# DEDICATION.



To All the Women of the Telugu Land,

To The Cultured amongst them,

To The Wives of all Telugu Graduates,

To The Lady Graduates of the Telugus,

This and similar efforts,

With the best Prayers on their behalf to

SRIMAN NARAYANA,

of

Swami Vidyananda Paramahamsa

This work was commenced in the rains of 1905 in the neat little Garden Hermitage of DEWAN BAHADUR B Narayanamurti Pantulu Garu and finished in the hospitable house of Balijipalli Suryanarayana Sastrulu garu, B. A & B. L,

VIZAGAPATAM.

ఆంధ్రాణులకెల్ల,

సర్వకలాశాలా పట్టభద్రులగు

ఆంధ్రుల పత్నులకెల్ల,

ఆంధ్ర విదుషులకెల్ల,

సర్వకలాశాలా పట్టభద్రిణులగు

ఆంధ్రాణులకెల్ల

నియ్యదియు, నీదృశ ప్రయత్నములును

వారి విద్యాపూర్వక సర్వసుగుణ క్షేమాభివృద్ధ్యర్థము,

పరమహంస విద్యారణ్యస్వాముల

నిరంతర

శ్రీమన్నారాయణ స్మరణపూర్వక

సమర్పణంబు

---

ఈ గ్రంథము 1905 వర్షమునందున విశాఖపట్టణము

దివాన్ బహదూర్ బు. నారాయణశాస్త్రి పంతులువారి నాగస్థైన

ఆరామహాశ్రమమున ప్రారంభించి

బలిజేపల్లి - సూర్యనారాయణ శాస్త్రిలు B.A.B.L. గారి

సదయ : సహాయమున

మా. ఒ. ప.

# KING LEAR



## DRAMATIS PERSONÆ

| | | |
|---|---|---|
| LEAR, KING | of | BRITAIN |
| KING | of | FRANCE |
| DUKE | of | BURGUNDY |
| DUKE | of | CORNWALL |
| DUKE | of | ALBANY |
| EARL | of | KENT. |
| EARL | of | GLOUCESTER |
| EDGAR | son to | GLOUCESTER |
| EDMUND | bastard son to | GLOUCESTER |
| CURAN, a courtier | | |
| Old Man | tenant to | GLOUCESTER |
| Doctor | | |
| Fool | | |
| Oswald | steward to | GONERIL |
| A Captain | employed by | EDMUND |
| Gentleman | attendant on | CORDELIA |
| A Herald | | |
| Servants | to | CORNWALL |
| GONERIL | | |
| REGAN | daughters to | KING LEAR |
| CORDELIA | | |

Knights of Lear's train, Captains, Messengers, Soldiers and Attendants

SCENE—BRITAIN.

# నాటక పాత్రములు

| | | |
|---|---|---|
| ప్రళయాంతకుడు | .. | బ్రిటానియా రాజు. |
| సుబుద్ధి . | .. | పంచనిస్థానపు రాజు. |
| శల్యపతి .. | . | కోరఖండపు సామంతుడు |
| కోణపాలకుడు . | ... | కోణసీమ సామంతుడు. |
| శివశివమ్హుడు | ... | ధవళమండల సామంతుడు. |
| హితకీర్తి (కేయూరుడు) . | | కెంటు మండలాధిపతి. |
| ప్రియవ్రతుడు | | గుళస్థానపు సామంతుడు. |
| ప్రేమసింహుడు | .. | ప్రియవ్రతుని సైనికుడు |
| సూరంరాజు . | . | ఒక సన్యాసి. |
| ముసలిగాడు . . | .. | ప్రియవ్రతుని వంటవాడు. |
| చరకుడు .. | .. | వైద్యుడు. |
| నాణభటితుడు | .. | విదూషకుడు |
| వసుపాలుడు . | .. | గరళవల్లి మగనివాడు. |
| పిడవాలు | ... | దుష్టబుద్ధి కింకరుడు. [డు. |
| సుజనుడు .. | | అమృతహృదయ పరిచరు |
| కట్టికె . .. | . | |
| సేవకులు | . | కోణపాలకునివారు. |
| గరళవల్లి, రజనీచరి, అమృతహృదయ | } | ప్రళయాంతకుని పుత్రికలు. |

ప్రళయాంతకుని పరివారపు యోధులు, దళవాయులు, రాయబారులు, సిపాయులు, పరిచరులును.

# నాటక కథా సంగ్రహము.

## ప్రథమాంకము.

మన దేశము నిక్కాలమున పాలించువారికి ఇంగ్లీషువా
రని పేరు. వీరి దేశము ఇంగ్లాండను నాఁబడు దీనికి ప్రాచీన
కాలమున బ్రిటను అని నామంబు. ఇట్టి బ్రిటానియా దే
మును ఒక కాలమున ప్రళయాంతకుఁ డను రా
చుండెను. ఇతనికి మువ్వురు కుమార్తెలు, గరళవల్లి, కపట
చరి, అమృతహృదయలు. ఇందలి గరళవల్లి యను జ్యేష్ఠ
పుత్రిక సుద్ది కొండలచే ధవళితమైన ధవళమండలమునకధి
పతియైన ధవళవర్మను పెండ్లియాడె. ద్వితీయ, కపటచరి,
నైఋతమండల మగు కోణసీమ కధిపతి కోణపాలుని మహి
షియాయె కనిష్ఠయగు నమృతహృదయ కన్యకకై కావున
నామెను వరించిన వారలు శ్రేష్ఠులగు పరంగిస్థానము అగ్ని
దక్షిణంపుదరి సీమకును, అందునకుఁ దూర్పున నుండు పర
ఖండ మండలమునకును, అధిపతులచే వలపు జాలక స
సరింపంబడె. ఇంతలో ప్రళయ భూపతి తన వయోధికత్వంబున
రాష్ట్రభారమును యౌవన భుజంబులపై నిక్షేపింప సమకట్టి,

మూవురి కూఁతులను రప్పించి వారివారి పితృభక్తి స్వరూప మును వర్ణించిన, నా భక్తి కనుగుణ్యముఁగ నీమను పంప కముఁ జేయునట్లు ప్రతిజ్ఞచేసె అత్తటి, గరళవల్లియు నాపె చెల్లియ రజనీచరియు కాపట్య ప్రేరితలై, అతిశయోక్తుల రాశులగు ముఖస్తోత్ర వచనంబుల రాజగు ముసలితండ్రి నంచించి మిథ్యానందపూరితుం జేసి సమృద్ధ భాగంబులం బడ సిరి అమృత హృదయకు పితృప్రేమా ప్రశ్నంబు రాఁగనే, యావిడ సత్యవచస్క యగుటం బట్టి, జనకరాజుని మిథ్యా స్తోత్రంబులు సేయలేక తన యుల్లం బెంతయు అంతయె వెల్లడి పఱచె వివాహమైన తటి భర్తృ భక్తియు విధి విహితంబు కావున జనకునియందే అనన్యభక్తి యసాధ్యంబనియు జన కుని కర్తవ్యా భక్తిని కొఱంతవడదనియు యథార్థము స్వీన యముత్తో విన్నవించె. అసత్యభాషణా ఘోషణంబుల నా నంద మగ్నుఁడై యున్న వృద్ధరాజునకు, సత్యభాషణంబుల నియతి శ్రవణ కఠోరంబాయె. అయినను కుప్త భూపతి తన యతిశ్రేష్ఠ కుమారికా రత్నమును మృదువచనంబులఁ దన్నా నందింప నాజ్ఞ యొసఁగె. అమృతహృదయ తన పట్టిన పట్టునే యూర్జితంబుఁ జేసె. క్రోధావిష్ట ప్రళయాంతకుఁడు అమృత హృదయ కుద్దేశించియున్న భాగంబును గరళవల్లి రజనీచరు లను వారి భర్తలా ధవళవర్మ కోణపాలకులకును సమం

భ్రష్టుఁ జేసె. అంతియు కాక యామెను నిరాకరించిన నత ఁడుం బని బాగగుచు, స్వీకరింప నుద్యమించిన పరంగీశుని నిరాకరింపుమని వేఁడె. సుబుద్ధి యగుటయు నామాటలఁ బాటింపక యా బోటికే యతఁడు తనకు సాటి యనుచును లస న్నాఁటికి రాణిం గావించికొనియె. పిదప నమృతహృదయుఁడు తన యుక్కల వీఁపు వేఁడుచు రాజును భక్తితో శుశ్రూషింపుఁడని యాచించుచు కన్నీరు కార్చ, వారు నామెను తిరస్కరించిరి. అంత నాబిడ తన మనోహరునితో పరంగి సీమకు బయలు వెడలె.

పిదప గరళవల్లియు రజనీచరియు నొంబోరులతో కలసి మెలసి, రాజుగారిని పరాభవించు నాలోచనలను నిర్ణయించి కొనిరి.

ప్రళయాంతకుని సామంతులలో మిగులను రాజభక్తి యుతుఁడు సుళస్థాన మండలపతి ప్రియవ్రతుండు. ఇతని కిద్దఱు కొమారులు; మొదటివాఁడు ప్రేమసింహుఁడు ఔరసుఁడు. రెండవ యతఁడు దుష్టబుద్ధి జారజుఁడు. ఇతనికి రిక్థ పాత్రత లేమిని కపటోపాయములచే ప్రేమసింహుని తండ్రినుండి విడఁ దీసి తాను స్వామ్యాధికారిఁ గాఁదలఁచె. అంతునన్నె, తన యన్న పితృహత్యకు తమ్ము సహాయు కారిఁ గన్నని వేఁడినన్

ఒక కూట లేఖమును సృష్టిచేసికొని ప్రియవ్రతుని మార్గమున చదువునట్లు అభినయించుచు, అతఁడు దగ్గిర వచ్చుచుండఁగా దానిని జేబిలోఁ దోపి కొనియె. ప్రళయాంతకుని యాగ్రహ మాధ్య కృత్యములను తలపోయుచున్న యా సామంతుఁడు దుష్టబుద్ధిని నడిగి బలాత్కారముగ నా జాబును తీసికొని చదువు కొనఁగనే భయ సంశయ విస్మయావిష్టుఁడై దుష్టబుద్ధిని ప్రశ్నించు నీతఁడును తన పితృ భక్తిని పరిశోధింప క్షేమసింహుఁ డట్లు చవి చూపెఁ బోలని బొంకుచు "లా మన్నఁ దమ్ము లిద్దఱు మాట్లాడు తఱిని తఁడ్రిని పొంచుండి వినునట్లు మంత్ర మొసఁగె తఁడ్రియునందున కియ్య గొనియె తఁడ్రిచే పంపిన వెంటనే, క్షేమసింహుఁడు నెదుర్కొని ఆతనిఁ జూచి దుష్టబుద్ధి, నాయనకు క్షేమసింహునిపై అత్యంత యాగ్రిహంబు పుట్టి యున్నట్లును, అది యుపశమిల్లుఁ దనుక నతని యెదుటఁ గనుపడవలదనియు, తీరిక వెలుపల వెళ్ళవలసి యున్న సాయుధపాణిఁగ వెళ్ళవలసినదనియు దిట్టముచేసి పలకిన, తన యింటి గదిలోనే దాఁగి యుండు మనియె, అంతఁ, ప్రియవ్రతుఁడు పలుకు రీతిని పొంచు విని తన మనసును తృప్తి పఱచుకొనవచ్చు ననియె. ఇట్లొయి నాఁటి తఁగది లాళ్ళు చేతిని నతని కప్పగించి పంపివేసిన మీఁదట దుష్టబుద్ధియు 'బుద్ధివలనఁ బడసెద భూమును' నని నిశ్చయించె.

# 11

రాజున కాతిథ్యము సేయ గరళవల్లికి మొదటివంతు కావున, ప్రథమ పక్షములోనే యాపె విసిగి, తన భృత్యులకును నాలిని పరివారులకును కయ్యములు పుట్టిన యుపాయములఁ బన్ని, ఒకనాఁడు రాజు వేటనుండి కట్టాఁకలితోఁ దిరిగి వచ్చిన సమయమున, నా కయ్యములకు మూలకారణము దని రాజ జనకునే చీవాట్లుఁబెట్టె రాజు నీ యవిధేయతను బొంకులాడ్రలకును మిక్కిలియు నలుక చెందె. ఇంతలో గరళవల్లి మరినకాఁడు వసుపాలుఁడు రాజును ధిక్కరింపఁ జూచి, దేశభ్రష్టుఁ డయ్యె వారలు వేసముఁ దాల్చి రాజయుని సేవించుచున్న హితకీర్తి యా వసుపాలుని తగిన యట్లు శిక్షించెను. ఇది విని గరళవల్లి రాజును పరుష వచనంబుల రోషాయత్తుఁ జేసె. అప్పుడు ప్రళయుఁడు రజనీచరితో వసింతమని నిశ్చయించుకొని కేయూర నామాంతరు మంచిపొన్ను హితకీర్తిని రాయబారిగఁ బంపె గరళవల్లియు వసుపాలుని పంపె, తన రాయబారిగ ఫాల్గాలి కడకు, తంత్రి కవిధేయుముఁగ వర్తింపు మనుచును.



ఇంతలో హితకర్త రాజనకును, వసుపాలుఁడు గిరళపల్లి కిని రాయబారులై తమ నగరువకు, రాను, కోణపాలక, రజనీ చరులు రాతిరి సేనగిరు విడిచి గుళ్ళస్థుని కోటకు వచ్చిరి, రాజను తమ యింట నుంచుకొన నయిష్టముతో! ఇచ్చట ప్రియవ్రతుఁడు తన పుత్రపలాయనాది దుఃఖములు విస్తరించిన మీఁదట, వా రిరువురు నతని మంత్రాలోచన నడిగిరి గుళ్ళస్థుని కోటన కోణపదంపతి శయనించి యుండఁగ కేయూరుఁడు వెలుపల వేచి యుండె రజనీచరి ప్రత్యుత్తరంబున నై. అంత వసుపాలుఁడును వచ్చి చేరఁగ కేయూరుఁ డతనితో కయ్యము లాగుచు నతనిఁ గొట్టె, వాఁడును మొఱలువెట్టె. కోటలోపలి వారు వెలుపల వచ్చి విచారింప నుదంతంబుఁ దెలిసికొని, కోణప దంపతులు కేయూరుని బొండకొంయ్యనఁ బెట్టించిరి ఇట్లుండ రాయశారి మళ్లి రానంమనకు చింతించుచు రాజు రజనీచరి నగరునను వచ్చి యూపె రజనియందె నగరువదలి గుళ్ళస్థుని కోటకు పోయినది విని. ఇక్కడికి వచ్చి చేరఁగా, కేయూరుఁడున్న నిలుకడకు నచ్చెరువుం గోపముం బొందె. అంత ప్రియవ్రతుఁడు కోటవాఁకిట కొట్టి పిలువ గుళ్ళస్థుఁడు వచ్చి, రాజ దర్శనంబు సేయఁ గూఁతురు నల్లుఁడు నిష్టము లేదంచు చెప్పె, రాజు మీఁకుమిగులను బలాత్కారము సేయఁగ వారు లేచి వచ్చిరి. అంత రాజు తనకు గిరళవల్లి చేసిన ద్రోహా

మసుఁగు వెల్వ, ఓఱి, తండ్రి నాశ్వాసించుచు, నాతనికి మతి భ్రష్టత వచ్చిన దానిని సూచించుచు గరళ యింటికే తిరిగి పోవును. ఇట్లు సంవాదించు తఱి గరళయు వచ్చి చేరె, నప్పుడా కాంతలిద్దఱు నొకరిపై నొకరు పోటి వేయుచు, పరివారమం తటిస తఱగింప కొమ్మనిరి. అప్పుడు ప్రళయాంతకునకు శోక, కోప, అవమాన, క్షుత్పిపాసాదులచే నిజముగనే పిచ్చి పట్టి కొనెను అప్పుడు అత్యంత దుర్భరమైన తుపాను కొట్టె అందు నిలువ లేక రజనీచరి, కోణపాలకులు గరళవల్లి గృహస్థులు కోటలోనికి వెళ్లి వాకిలి బిగించుకొని, రాజు పక్ష మవలంబించిన గృహస్థుని కొట్టాడించి, రాజునకుఁ సతిని యోధులకును సత్కారము చేయు నే కూడదని చేసినా రాజద్రోహమునకు శిక్షించెద మనిరి. అయ్యో పాపము! రాజును అతని సంగడీండ్రును ఆ భీకర వాతవర్షమున విశాలమైన గయాళున నల్లాడుచుండిరి.

## తృతీయాంకము.

రాజు రాకమీఁదట బొండకొయ్యన నుండి విడిపింపఁ బడిన హితకీర్తియు తుపానున బెట్టుబడుచు కొందఱి యాపులమూ

లఘుగ పరంగిరాణికి, అమృతహృదయకు, ఈవస్త్ర మాన ములను పంపును. మఱియు పరంగీశుని యుపకార ప్రయత్న ములను దెలిపి కొనును. రాజు ఆతపమును పడరాని యిడు ములంబడుచు ఉన్మత్త చిత్తముతో మనుష్యుల దూఱుచు భూతముల సఖ్యనందించుచు, తనవెంటనే వచ్చుచున్న విదూ షకుని హాస్యపు పలుకుల నాలకించుచుండు, హితకీర్తి యాయన స్వాతకి ప్రత్ని యూ ఝుంఝుచుండి యాయన న్వైడిపింపనొక గడ్డి గుడిసెలోనికిఁ గొంపోవును అందుండి యొక వెఱ్ఱివాని వేషము దాల్చిన ప్రేమసింహుఁడు పిచ్చి పలుకులు ప్రేలుచు బయల్పడ బాణభణితుఁడు భూతమని పరుగెత్తెను; హితకీర్తి రోసెను. రాజతని తాత్త్వికోత్తముఁ డనుచు ప్రశంసంబు ల్వేసెను.

నడుమంత్రపు, కోటలో ప్రియవ్రతుఁడు దుష్టబుద్ధిని పిలిచి, తాను రాజ పక్షపాతి కావున ఏమి వచ్చినను రాజు నకు శుశ్రూష చేయవలయు ననుచు, వానికిని హెచ్చరిక చేసి, తాను రాజు నొద్దికి పోవునపుడు, తన సత్కారమును దాఁచింప కోణపాలకునితో మాట్లాడుచుండుమని పనిచె. ప్రసంగ వశమున తన కేదో రహస్య పత్రం బందె ననియు దానిని బీరువన దాఁచి యుంచ ట్లుఘు వెల్లడి చేసె

వాని యొక కంటిని నదిమి గ్రుడ్డిచేసె. అడియును అతని లబలబ వాపోకను సహింపలేక, యందొక సేవకుం డడ్డగింప, కోణపాలకుఁ డతనిపై దూసె. వాఁడును దూసి పోరుచుండ రజనీచరియు నొక వాలుతో వెనుకనుండి పాఱి యా భృత్యుని హనించె. కాన, నీ కయ్యమున నొక గాయముఁ బడిన యా కోణపాలుఁడు నెత్తురు దొఱఁగుచు కొంత తడవ్రమీఁద నుసురులం గోలుపోయె. మఱునటి కంటిని న్నా కోణపాలకాఁపు క్రూరముఁగ గ్రుడ్డిపఱచె.

---

## చతుర్థాంకము.

గయాళున నిట్టులు తన పరిభవంబుల, భూపతి పరిభవంబులం బరిదేవించుచున్న ప్రేమసింహునకి మఱియొక ఘోరంబును సందర్శింపనాయె. నయన ద్వయాపహృతుఁడగు ప్రియవ్రతుఁడు నెత్తురు విడుచుచు నొక ముసలి కాఁపు నడిపింప నెదుర్పడె; ప్రేమసింహుని తలఁచుచుఁ దన దౌర్భాగ్యముం దుష్టబుద్ధి దౌష్ట్యముం దూఱుచు నఱచువానిఁ జూచి తన్ను నతనికి వెల్లడి సేయలేక యున్న వానిని వెఱ్ఱి వెంకటరాయఁగా నెఱింగి యతనికి గుళస్థుఁడు లంచమిచ్చెదను ద్వారపురి చేరువ సముద్రాగాధము పైని నొక కొండ చఱియకు గొంపొమ్మని యతనిఁ ద్రోవ చూపరిఁగ నేర్పఱచుకొనెను.

ణవాలక నిర్దిష్టుఁడై దుష్టబుద్ధి గరళవల్లికి మంత్రి కుమారుఁగ వెళ్లి శ్రోవన నామె వలఁపును సంపాదించుకొనెను. ఆకాలము వదలిపెట్టి మఱలు తఱిని వలఁపు టుంగరమును స్థానం బడపి తిరిగె మొదటనుండియె గరళవల్లి రజనీ పతుల పితృద్రోహమున సంబంధింపక యది విన్నది మొదలు వారి కృతఘ్నతకు దుఃఖించుచున్న ధవళవర్ముఁడు గరళవల్లికి నుపదేశంబు సేయ సేయ నా బిడ యతని శత్రునిఁగ, విప్రలంభకునిఁగ, రణభీరునిఁగ భావించుటయె కాక యతని పత్నికి దూషణంబును జేసె స్త్రీహత్య నింద్యమ్మని యూర కుంటి నన్న యతని సన్నిధికి గూఢ యొకఁడు వచ్చి కోణ వాలమరణంబును గుళస్థుని నేత్రాపహారంబును నివేదనంబు చేసె ఇది విన్న గరళవల్లి సంతసించుచు దుష్టబుద్ధి విధవరజనీ పతుల సామీప్యతకుఁ జింతించుచుఁ దన సుఖభంగము కా కుండఁగ నుపాయంబు తల పోయు చుండె.

ద్వారపురిని దండు విడిదియున్న అమృతహృదయ హిత కీర్తిచే ప్రళయాంతక జనకుని రాక యెఱిఁగి యాయనఁ దన యందు రప్పించ సర్వ ప్రయత్నంబు చేసె. కాని వెట్టి వేళల నా రాజు పట్టువడకయుండె: నెఱుక వేళల లజ్జ యగ్గలికను నా ప్రేమ ప్రతిఫలింపఁ జూడ లేసె. ఉత్తమ వైద్యుల నియ

మించి యామునను కుమర్పు నెంచి. తన రణపాటవంబు జూపి యెట్టకేలకు నాయనను పట్టుక రక్షుని నిట్టపొన కిట్టిపెల నొసంగ గరళవల్లిచే దుష్టబుద్ధి కడకు నుత్తరముతో పంపఁబడిన వసుపాలుఁడు, రజనీచరి యింట నాయనను గాంచి యతని వెదకిపట్టఁ ద్వేతపడుచున్న వాని, నాఁగుమన్న క నాఁగక, ఉత్తరముతను పగులఁగొట్టనీయక, యందలి శుద్ధమును దెలుపకయున్న వానిచేతికి తాను నొక యుత్తరమును కష్ట బుద్ధికిచ్చి, త్రోవలో గ్రుడ్డి గుడ్డస్థుఁడు కనుఁబడిన నాతని సంహరించిన బహాము తిర్చ్బిడ మఱియు నాజ్ఞ నొసఁగె.

ఆత్మహత్యకై ప్రయత్నించిన గుణస్థుని ప్రేమసింహాంబు పాలకుల న్నిలిపి కొండచఱియ యని బొంక, బోరగిలబడి నతఁడును, చమను కావునసే హానియుఁ బొందకుండె. అపు , ఒక్కించుక దవ్వున వెళ్లినట్లు నటించి యూరకున్న ప్రేముఁడు తన గొంతును మార్చుకొని, సముద్రతీరంబని యాతనికి నమ్మకము కొలిపి అంతటి యెత్తునుండి యతని పడఁదుమి పురికొల్పినది పిశాచంబె యగునవియు, అతఁడట్లు పడ లోతున దుమికియు నెట్టి హానియుఁ జెందమి యుపరి పాలింట దేవతల యనుగ్రహ జన్యమహా సద్భుతంబె యనియు బోధించె ముం దిట్టి పాపప్రయత్నములను సేయక మానుటమె . . ప్రే

మార్గమనియు నుపదేశించి యతని భక్తి క్షమా యుక్తునిం జేసె.

అత్తఱి నైష్టరాజు అడవి వృక్షాల నలంకరించుక యెదుర్పడ, ప్రేమయు జాలిని మనసు కరఁగ; ప్రియవ్రతుఁడు గొంతు నానవాలు పట్టి గుండెలు జల్లుమన నదరిపడి కరుణాయుత భక్తితో రాజహస్తముం ముద్దిడఁ గోరె; నంత రాజును వెఱ్ఱిలో వివేకముతో ద్రవ్యవంతుల పాపిష్ఠితనము నుపన్యసించె, జననకాలపు శిశురోదనము వివరణంబు చేసె; నయ్యెదనున వసుపాలుఁడు కనుబడి గృహస్థుని సంహరింప నుద్యుక్తుఁడగుటయు రాజవేసముఁ దాల్చియున్న ప్రేమసింహుఁడు వాని వారించియు వినకుంటఁ జూచి వాలుదూసి పోరి చంపె; అతని జేబుల వెతకఁగ గరళరజనికల నలఁపుజాబులు చేతికందె అందలి గరళాంబ జాబు స్వకీయ భర్తృహత్యకు గృష్టబుద్ధిఁ ప్రేరింపఁ జూచి, యా కూట ప్రయోగంబును ధవళవర్మనకుఁ దేటపఱచ నిగ్ణయించె.

ఇంతలో నచటి కరుదెంచిన యొక సుజనుచేతఁ బట్టుపడిన ప్రియయుఁను అమృత గుడారమునకు తేఁబడ, నచ్చట నూత్న ప్రాయంబులచే చరకునిచే నతఁడు పునః స్వస్థతం గాంచి తన ప్రియపు ఫుల్లికం గుఱుతింప శక్తుఁడాయె.



## పంచమాంకము.

ఈ నడుమ దుష్టబుద్ధి రజనీచరి దండుల నడపుచు ద్వారపురి చేరె; రజనియు వాని యండఁ జేరి తన్నే వలఁచుమనియె; నప్పుడే గరళధవళులుం డాయఁగ, గరళ రజనిని మత్సరించె, ధవళుఁడు ధర్మ యుద్ధములఁ దప్పఁ దాను పూనికొనమిని ద్యోతకంబు చేసె. పిదప రజనీదుష్టులు గరళను రమ్మని పిలువ, నదనఁ జూచి ప్రేముఁడు నాకడ వచ్చి ధవళునకు పైని యుత్తరముల నప్పగించి అందలి మాటల సూర్జిత పఱప యుద్ధాంతమునఁ దా సిద్ధుఁ డగునని వాక్రుచ్చి పోయె.

పిదప దుష్టబుద్ధియు ధవళుని పనిపి యేకాంతమున నాయకుఁ జెల్లెండ్రతో నెట్లు మెలఁగుటయని నిర్ణయించుకొనియె. అటుపై ఇరు దండులు పోర, దుష్టబుద్ధి పరాక్రమమున పరంగులు ఓడి పోవఁగ, నమృతహృదయ ప్రళయాంతకులు వానికి చెఱకాండ్రాయిరి, వారి నొక దళవాయి కప్పగించి చెఱయందు వారిఁ జంపుమని యధికారంబు నిచ్చె. ధవళుఁడు దుష్టునిం బిలిచి యా యుద్దజిం దన కప్పగించుమనియె; వీరిరువురు నిట్లుఁ గలహింపఁగ, గరళ రజనులు దుష్టునిమీఁది ప్రేమతో మత్సరించిరి అంత రజనీచరి దుష్టబుద్ధిని ధవళవర్మతో ద్వంద్వ యుద్ధంబునకుఁ బురికొల్పె; తావయు మఱఁ

చిలి యభీష్టమును సహేతుకముగ నడ్డగించె. అపుడు రజనీచరి తనకుఁ చెవులవి మొలబిడ, నావలఁ బంపంబడె. కాపాళికములు మోసి ముమ్మాఱులు ; మూఁడవ మ్రోఁతన ప్రేమసింహుఁడు ధవళవర్మని పక్షమున దుష్టబుద్ధితో ద్వంద్వంబునకుఁ బూను కొని వానినిఁ బడఁగొట్టె. గరళవల్లి అజ్ఞాతునితో ద్వంద్వంబు క్షాత్ర సాంప్రదాయము చొప్పున న్యాయముకాదని వాదించు టయు, ధవళవర్మ యామె యుత్తరముతో నామె నోటిని మూయించె. దుష్టబుద్ధియుఁ బ్రాణావసానమున నీచత్వాకారుణ్య పరుఁడై, ప్రేమసింహుని క్షమనుఁ బడసి, తన యిద్దఱి చెఱ కాండ్ర విడిపించి రక్షింప సాధనంబు చెప్పె ; కాని యంత మునుపె అమృతహృదయ ఉజ్జయినిఁ జనియె, ఆమెను చంపిన ఘాతకుని ప్రళయాంతకుఁడు పొడిచి చంపి, ప్రియ పుత్రిక కళే బరమును దండలం దెచ్చి ధవళాదుల యెదుట సంగలార్చె. నడిమిని గరళవల్లియు మానభంగమున భగ్నాశయై గరళంబుఁ ద్రావి, రజనీచరిం గరళంబుఁ ద్రావించినది పెల్లడి సేయుచుం జెద్ద నిద్దుర నృత్తమిళ్లె

ప్రేమసింహుఁడు తన పెట్టి వెంకటాయ చరిత్రమును ముగించి ప్రియవ్రతుని చరిత్రమును కథించి హితకీర్తి సమాగ మంబను నాతని మూర్ఛను వర్ణింపుచుండ, హితకీర్తియు

వచ్చటికి కేగెంచె; అప్పుడె పరిచరులు లెచ్చి రజనీచరి గరళ వల్లి కళేబరంబులఁ; హితకీర్తి యచ్చెరువు పడుచుండఁగ, వెంటనే వచ్చెఁ బ్రళయాంతక రాజును అమృతహృదయ శవమును సందిట మోయుచు; ఇదియె నా ప్రళయాంతంబని హితకీర్తియు నఱచుచుఁ దన యొడయునికి తన్ను నివేదించుకొనుచు మోఁకరించె. రాజును హితకీర్తి నానవాలు పట్టి, నీతఁడు కేయూరినిఁ బ్రస్తవించె, కేయూరిని రాజు శ్లాఘింప, నతఁడే తానని హితకీర్తి విన్నవింపను, రాజును చిత్తము తత్తఱించి అమృత హృదయనుఁ జూపుచుఁ బిలచుచు నేలను నీల్గె. ఇంతలో దుష్టబుద్ధియొక్క మరణ వార్తయు వచ్చె; హితకీర్తియు తన నాథుని పిలుపున కొడంబడె. ఇట్టులు ప్రళయాంతకరాజుని యంతము సమస్త విధముల ప్రళయాంతకింపె యాయె.

# NOTICE.

---

**Shakespeare's plays**

in

**Sanskrit, Hindi, Telugu,**

**Kanarese, Tamil & Malayalam**

UNDER THE

**Authorship or Editorship**

of

**Swami Vidyananda Paramahamsa.**

| | |
|---|---|
| People's Edition | 3 as to 6 as |
| Student's Edition . | 4 as to 8 as. |
| Library Edition . | 6 as to 12 as. |
| Royal Edition . . | 1 Re to 2 Rs. |

According to the size of the Play

* Differences in the Editions consist in quality of paper and binding

For particulars apply to

Swami Vidyananda Paramahamsa

The South Indian Vernacular Literature Press, Purasawakam,

MADRAS.

# ముఖబంధము.

అత్యంతనిపుణులకును దోషరాహిత్యం బతిదుర్లభంబు. మేమో గ్రంథకర్తల రంగమున బ్రథమప్రవేశము చేయువారము. దోషములు పెక్కులే యుండవచ్చు; గాని విశ్వాసంగ మా యావచ్ఛక్తిని నిందు వినియోగించితిమి. ఆంగ్లేయభాషను తెనుఁగుపఱచుట యందలి క్లేశమును, షేక్స్పియరు వంటి కవి సార్వభౌముని యభిప్రాయముల నిర్ణయించి [illegible]చుటందలి శ్రమమును, ద్రవ్యవ్యయతం ముద్రణాలయసామగ్రుల కొఱంతవలని శ్రమమును భరించుచు చేసిన ఈ ప్రథమోద్యమములోని దోషములకు రహస్యోత్తరముగం దెలుపుచు గుణములకు పత్రికలం బ్రకటించు కృతివిమర్శకులు[illegible]ను ర్శకులును, ఇఁకమీఁదు మేము బ్రకటింపంబోవు నాటకగ్రంథములకు దోషనివారకులును గుణప్రాపకులును అగుట[illegible] ఈ మొదటిగ్రంథపు విక్రయంబునందు సహాయభూతులై మా సదుద్దేశంబులకు బ్రోత్సాహకులును పోషకులు నయ్యెడను వారువారు చేయఁగల వాఙ్మనోద్రవ్యాది సహాయములకుం దగిన రీతిని సర్వేశ్వరుండు మా చదువరులకు ఇహపరసుఖప్రదాయకుం డగునుగాక!

పురశవాకము
ప్లవంగ వై.శు.ప.

ప. ఫి. శా.

22-[illegible]-1[illegible]

# శుద్ధిపత్రము.

| పుట. | పఙ్క్తి | సాధు. | పుట | పఙ్క్తి | సాధు. |
|---|---|---|---|---|---|
| 2 | 14 | Suryanarayana | 13 | 19 | వారును |
| 6 | 8 | నుద్ద | 14 | 16 | కొయ్యనుండి |
| 7 | 5 | రానులగు | 15 | 7 | ఝుంఝు [కొం |
| ,, | 10 | పలచె | 22 | 14 | కర్షాసింబాడిచి |
| 11 | 4 | వేంట [డు | 24 | 19 | South |
| ౨ | ౪ | విధివదుత్పన్నుం | ౨౫ | ౬ | దోంతెంప |
| ౪ | ౬ | బ్రాఘిష్ఠ | ౩౧ | ౫ | అది |
| ,, | ౧౭ | యూంపిరి | ,, | ౭ | బిడ్డ |
| ౧౨ | ౧౭ | భ్రోచుత | ,, | ౧౫ | జోస్యపు |
| ౧౪ | ౧౪ | సుబుద్ధి | ౩౩ | ౧౫ | విశ్వస్త(శ్వాసి) |
| ౧౫ | ౧౫ | దోంతెంచు | ౩౫ | ౨ | చెవుల |
| ,, | ౧౭ | బ్రభో | ౩౬ | ౨ | భోజన |
| ౧౮ | ౫ | స్థానమునకు (ము | ,, | ౭ | పొసంగించుకొని |
| ౨౦ | ౧౫ | ముంజేతి కంకణ | ,, | ౧౦ | దేశమునకు |
| ౨౨ | ౩ | దేవతపు | ౩౭ | ౪ | నుంచుకొను |
| ౨౩ | ౩ | యును | ౩౮ | ౧ | ఖావందు |
| ౨౪ | ౧ | చదువుచున్న | ౩౯ | ౬ | నిష్కృమించు |

| పుట. | పంక్తి | సాధు. | పుట. | పంక్తి | సాధు |
|---|---|---|---|---|---|
| ౪౩ | ౫ | బాసఁగి | ౫౮ | ౨౦ | దొలఁగింపఁ |
| ,, | ౧౦ | అదిగో | ౬౨ | ౭ | గావాసు |
| ౪౪ | ౧౫ | ఆస్త్రికి | ,, | ౧౩ | గారణ |
| ౫౩ | ౭ | గొంతకు | ,, | ౧౬ | ఔను |

౬౫ ప్రవేశము, దుష్టబుద్ధి సూరంరాజు అతని సంక్రందన :

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౬౫ | ౧ | ప్రోచుత | ౮౮ | ౧౪ | మణి |
| ౬౯ | ౪ | ప్రబుద్ధ | ౯౨ | ౯ | బొంత |
| ౭౨ | ౨౦ | సేను | ౯౩ | ౧౫ | బొంక |
| ౭౫ | ౧౨ | నెఱుంగ | ౯౫ | ౬ | రోగస్థి |
| ౮౪ | ౮,౯ | బొండ | ౧౦౧ | ౫ | నీవేమియు |
| ,, | ౧౨ | దేవర | ,, | ౧౦ | జేసి |
| ౮౫ | ౮ | ప్రియ | ౧౦౨ | ౧౬ | తోఁడేలు |
| ౮౬ | ౩ | అనుదానిని | ౧౦౩ | ౯ | బతిమాలి |
| ,, | ౧౪ | శేర్ప | ౧౧౨ | ౨ | వంద్రుక |
| ౮౭ | ౮ | దారిద్ర్య | ,, | ౮ | తోఁడేలు |
| ౮౮ | ౬ | బతిమాలి | ౧౧౬ | ౧౩ | దరిద్ర |
| ,, | ౧౦ | బొండ | ౧౧౭ | ౧౯ | సేయనది |

| పుట. | పఙ్క్తి | సాధు. | పుట | పఙ్క్తి | సాధు. |
|---|---|---|---|---|---|
| ౧౨౪ | ౯ | బతిమాలెద | ౧౬౪ | ౧౫ | రాజన్యుఁపు |
| ,, | ౭౮ | నిర్దయూర్షుంఝా | ౧౬౯ | ౧౦ | యూకసముచ |
| ,, | ౧౯ | చిల్గుల | ౧౭౦ | ౧౧ | నువ్వొళ్గార |
| ౨౭ | ౧౪ | వెంద్రుక | ౧౭౨ | ౧౩ | శిఖవము |
| ౧౩౩ | ౮ | బతిపాలి | ౧౭౩ | ౨ | గద్వేష్ట |
| ౧౩౧ | ౧౦ | పూస్రు | ౧౭౬ | ౨ | గాను |
| ౧౪౬ | ౨ | ద్రోహిష్మి | ౧౯౬ | ౨ | చెఱసాలయు |
| ౧౪౦ | ౧౦ | వెంద్రుక | ౨౧౦ | ౩ | ప్రళయాంతునకు |
| ౧౪౯ | ౧ | నేమేమి | ౨౧౧ | ౧౫ | ప్రళయాంతపు-డు |
| ౧౫౨ | ౬ | ఏఁడి | | | |
| ౧౫౩ | ౧ | గింటి | ౨౨౪ | ౮ | మోపినాఁడవో |
| ౧౬౪ | ౬ | జ్ఞాసమును | | | |

‘వ-స,’ ‘ను-సు,’ ‘నూ-సూ,’ ‘ప-వ,’ ‘పు-వు,’ ‘పూ-వూ,’ ‘నే-సే’ల యభేదత ఇందు అచ్చటచ్చట కానంబడు. గాలశితావష్ట నుండు పూ ముద్రణాయంత్రపు ఈ వ్యాకరణ విడిచి శుక్రబ్రహ్మయొక్క అద్వైతబుద్ధిఁబోలె పాఠకులు పాటింతురుగాక!

# అమృతహృదయ

## (లేక)

# ప్రళయాంతకరాజు.



## ప్రథమాంకము.



ప్రదేశము—ప్రళయాంతకుని నగరు.

[హేమకీర్తి, ప్రియవ్రతుఁడు, దుష్టబుద్ధి ప్రవేశింతురు]

హేమ.—నే నెంచితి, రాజున కధికప్రియుఁడనఁగా, ధన... కోణపాలకుని కంటెను.

ప్రియ.—ఎప్పుడు నట్టులే తోఁచుచుండె మనలకుం గాని యిపుడీ సీమసంపదమున, నిర్జీలో నే ప్రభువును హెచ్చుగఁ జూచెనో కానరాదు; పంచినభాగముల నంతయుఁ జూచినా నొండొంటికి నించుకయు భేదము తోఁచక విచిత్రముగఁ దూఁచినట్లున్నవి.

హేమ.—ఇయ్యుత్తంప మీ కుమారుఁడుగదా, జేసెఁ?

ప్రియ.—ఇతని పోషణమేమో, బాబు, నా భారముగా నుం చున్నది వీని పుట్టకను నొప్పుకొన పెక్కుమాఱులు ఉజ్జాంబిల్లజాంచి ఇటీవల నుక్కెక్కినాఁడ. కాని, దేవర, విశిష్టతుత్పన్నుఁడు పుత్రుం డొకఁడుకలఁడు నాకు వీనికన్న పిమ్మాంమివత్సరము పెద్దవాఁడు, అయిన సందునవేయధిక ప్రేమాస్పదుండు కాఁడు నాగణసంబున, ఈ తుంటరి పిలు పసిప్రేరంటముగ నీ నేలపై దిట్టఁడై దుమికివచ్చెఁగాని, వీని తల్లి ఒకహుహూపవతి. ఈ ప్రభువర్యు నెఱుంగుదువా దుష్టబుద్ధి?

దుష్ట.—ఎఱుంగను, మహాప్రభో.

ప్రియ.—మన కెంటు మండలాధిపతి ఇఁకను జ్ఞప్తినుంచు కొమ్మియనను, నా స్నేహితాగ్రగణ్యుఁడు సుమీ.

దుష్ట.—అస్మద్దాసో ఒహంబులు, ప్రభువులవారికి.

కెంట.—నా ప్రేమాస్పదుండవు, నీతోటి పరిచయమును బల పడజేసుకొనవలెను.

దుష్ట.—అయ్యా! అందున కష్టంబుగాఁ బ్రయత్నించెద.

ప్రియ.—తొమ్మిదివత్సరములాయె, వీఁడు దేశాంతరసంచా రియై; తిరుగ నూరుఁబాసి వెళ్లవలసినవాఁడేను, రాజు గారు వేంచేయుచున్నారు.

శృంగారాగారము

[ప్రశియాంతకుఁడు, కోణపాలుఁడు, ధవళవస్త్రుఁడు, నాగవల్లి, రజనీచరి అమృతహృదయ, పరిచారులును ప్రవేశింతురు]

ప్రశి.—ఫరంగి పరఖండప్రభువులనుపచరింపుము ప్రియవ్రత,

ప్రియ.—చిత్తము, దేవర. (నిష్క్రమించును.)

ప్రశి.—నవమంత్రము వెల్లడిసేయఁదలఁచెదము మా యంతరంగనిర్ణయమును, అందిమ్ము అదిగో నా పటమును, ఎఱుంగుఁడు మూఁడుభాగములం బంచినారమని మా రాష్ట్రముల్, మఱియు మా దృఢనిశ్చయమును, ఈ ముదిమిని మా వలనం బొల్లఁగించుకొందమని సమస్తవిచారముల రాజకార్యములను వీరిని నిక్షేపించెదను యౌవనభుజములపై. అటు మేము భారవిముక్తులై మరణపుదెసఁ బ్రాఁకెదము మెల్లమెల్లగ. మా యల్లుఁడ, కోణపాలక, ఓయి తత్తుల్యప్రేమనల్లుఁడ, ధవళవస్త్రుఁడ, ఈ ఘంటనే ప్రకటింప దృఢనిశ్చితులము, వరుసన మా పుత్రికల స్త్రీధనముల నడిమియూ మార్గము ఇపుడె వారించుటకే ముందెంతయు కలహము లుప్పతిల్లకుండఁగ. రాజకుమారులు, ఫరంగిపరఖండపులు మా కనిష్ఠపుత్రికాప్రేమకై బలు ప్రత్యర్థులు, నిడినాళ్ళు మన సభయందు తమ కామయాత్రల నిలిపినారలు, వారికి నిచ్చట ప్రత్యుత్తరం బీవలె. తెల్పుఁడు నాకు నా

తనయలారా,—ఇప్పుడే పరిత్యజింప నుద్యుక్తులము, ఈ రాజాధికారము, నీ రాష్ట్రప్రస్వామ్యము, నీ యుద్యోగపు సమస్తచింతలంగాన—మీలో నెవరితో జెప్పదము మమ్ముల నత్యంతముఁ బ్రేమించునదని? అంతట నిసర్గపు ప్రీతికి సదృశమౌ యోగ్యతం గైకొని మా యౌదార్యమును ద్రాఘిష్ఠముం గావించెదము. గరళవల్లీ, మజ్జ్యేష్ఠపుత్రికా, పలుకుము మొదటను.

గర —బాబయ, నా ప్రేముడి యెట్టిద, మాటలకలవికాదు మన్మనోగతముం జెప్ప ఈ నేత్రవీక్షణముకంటెను, వీక్షణ విషయమౌ దిగంతరముకంటెను, దిగంతరమున విహారింపనౌ స్వేచ్ఛకంటెను హెచ్చుగ భావించెద మిమ్మును, వింతనో విలువనో యనర్ఘ్యమౌ దేనికంటెను, సిరి, సంపద, ఆయు, రారోగ్యము, రూపము, మానము, ప్రాణము కంటెను ప్రేమించెద, నెచ్చట నెప్పుడు నేతండ్రి నేచిన్న నెంతటి ప్రీతితోఁ బ్రేమించెనో, ఏ బిడ్డయుం దేతండ్రి నెంతటిప్రేమనుం జూపెనో యంతటిప్రేమతో, నా ప్రేమనుం జెప్పలేక యూఁపిరి బలచుడిగె, నాలుక కదల దాయె; ఈ యుపమల చేత వివరముగాఁగల యంతకంటె నత్యధికముగ మిమ్మును ప్రేమించెద.

అమృ॰ —(తనలో) నిం కేమి చేయ నమృతహృదయ ? ప్రేమించుట, మఱి యూరకుండుట.

ప్రళ —ఇల్లిదిగో నీ యెల్లలకంత, ఈ గీత మొదలుకొని ఈ గీతదనుకను ఈ ఛాయాశ్రితగాఢారణ్యములతో, నీరసహిత ఫలవంతములగు విశాలసమభూములతో, సమృద్ధనదులతో విస్తీర్ణమగు నీ కేదారప్రాంతములతో సహితము, నిన్న రాణిగఁ జేసెదను నీకును ధవళవర్ణునకు నగుయుండు సంతతి కియ్యబడి శాశ్వతభోగ్య మయ్యెడు ఏమి చెప్పెదవో మా ద్వితీయపుత్రిక, మా ప్రియతమ రజనిక, కోణపాలకు నిల్లాలా ? వచింపుము.

రజ —వేయునేల, నాయనా ? నేనును, అక్కయం బోలిన పోతలోని లోహమే కావున నన్నును నాయిడ మదింపు చొప్పుననే మదించుకొందు. సత్యము పరసిన, నా హృదయమున నెలకొన్న యా ప్రేమము బలువిడే యీయమ యుదహరించె, కాని, భేదమేమన, ఇంచుక కొంచెము వడిమె తక్కుయ; ఎట్లన, సత్యవర్ణమగు నింద్రియగ్రామ మంతటికిని విషయములగు సమస్తయితరసుఖములను శత్రురాలిఁగ నన్నుఁ బ్రకటించుకొనియెద, గాన్ర

ప్రేష్ఠులగు దేవరవారిఁ బ్రేమించుటకంటె మఱి దేనియం దును ఆసంగలవలేశమును నెఱుఁగనిదానను.

అమృ.—(తనలో) అట్లైన, ఓడ యమృతహృదయ! అయి నప్పటికిని బీదరాలిని కాను, ఏలనఁగ, నాదుప్రేమము నా నాలుకకంటె నతిసుభగమేను.

ప్రభ.—అద్దిర! నీకును నీ సంతతికిని శాశ్వతస్థితియయ్యెడు మా శుభరాష్ట్రమం దీ పుష్కలతృతీయము, గరళకభాగ మున కిది వెడదియగు వైశాల్యమును, సస్యసమృద్ధిని, సౌందర్యమంతయుఁగాని, మఱి, మా యానందమా, కని ష్ఠవు లభీష్టమైనను, ఎవతె లేవల్లపుకై పరంగిద్రాక్షలు స్వారఖండపుక్షీరముం జిగీషతోఁ జెనంగుచున్నవో, ఆ నీవే మనఁగలవు చెంపుటకై నీయప్పలకన్నను హెచ్చుధనాఢ్య మగు మఱియొక తృతీయమునా? నుడువుము.

అమృ.—ఏమియు లేదు, మహాప్రభో.

ప్రభ.—ఏమియు లేదా!

అమృ.—ఏమియు లేదు.

ప్రభ.—ఏమిలేకున్న ఏమియు లేకపోవును. నుడువుము మరలను.

అమృ.—ఎంతటి నిర్భాగ్యురాలను, నా గుండియు నా నోటికి
కుబికించ లేనిదానిని; మహాప్రభువుల ప్రేమించుటకు నా
స్వధర్మము మేరకు; హెచ్చు లేదు, తగ్గును లేదు.

ప్రళ.—ఎట్టెటూ, అమృతహృదయా! దిద్దికొమ్ము నీ పలుకు
నాకించుక, లేనిచో, నీ భాగ్యముల కష్టము వచ్చును.

అమృ.—మంచిది మహాప్రభో, తమరు నన్ను గన్నారు,
పెంచినారు, ప్రేమించినారు నేనును, ఆ ఋణముల తీర్చు
కొనినదాన అత్యుచితరీతిని విధివిధేయను, భక్తితో వారి
పదముల బూజించెద నా యప్పలేల మగల పెండ్లియగు
సంసార మిమ్మునే ప్రేమించుట నిబద్ధమైన భాగ్యమైనచో
నే పెండ్లియాడిన, నా ప్రత్యభిజ్ఞను జేకొను నా పతి
మిటి నా భక్తిని సగంబునకు బాత్రుడగు, నా ప్రేమలో
సగమును, సేవలో సగమును గాగొను నిక్కము. పెండ్లి
యాడను నా యక్కలంబలె, తండ్రినే యశేషముగ ప్రే
మింపవలసిన.

ప్రళ.—అయితే దీనితో నీ హృదయము గమించునా?

అమృ.—సత్యము, మహాప్రభో.

ప్రళ.—ఇంత లేబ్రాయము, ఇంత కఠోరమయమునా?

అమృ.—ఇంత లేబ్రాయము, ఇంతటి సత్యమునా.

ప్ర—కాని యిష్టున్నచో నీ సత్యమే, మఱియుంతయు నీ ధన
ముగ వలయు నిదిగో నా శపథము ఆ చండాంశుని ప్రచండ
తాసాక్షిగ, నయోధ్యాధీశుని రఘువంశమహిమము లా
క్షిగ, మనము మనుటయు చనుటయు నేగ్రహముల
ప్రభావమో యా ప్రభావమంతటిసాక్షిగ, నిదిగో పరిత్య
జించితి నా పితృవాత్సల్యత యంతటి, రక్తసామీప్యత
సంబంధములంతటిని, మఱి నా డెందమునకు న్నాకును
బొత్తిగ నన్యమై భావింతును నీ క్షణమునుండి యావ
జ్జీవముగ. ఘోరకృత్యుఁడౌ శకుఁడను క్రూరరాక్షసుం
డును, క్షుధితస్వోదరమునుఁ బూరింపను స్వోదరజన్యు
లచే కోసి కూరలు వండు క్రవ్యాదుఁడు, నో పూర్వము
ను త్పుత్రికా, నినుంబలె నా సామీప్యముం బొందెడు, కని
కరము నందెడు, ఆపద న్నివారింపంబడు.

సీత.—ప్రసాదము మహాప్రభో—

ప్ర—ఊరకో, హితకీర్తి! అడ్డకుమోయి తెక్కలిచిలుకకుం
బాని యొక్కటకును నడిమిని. దీని నెంతయు సక్రిలిం
బెంచితి మఱి యెంచితి నువ్విళ్లూరఁగ దీని హితపోషణ
మున నా ముదుసలితనంబును నెమ్మదిం గడఁపను. అవత
లికి! నా చూపునం బడకుము! ఈ జనకహృదయముం

దీనియం దుండి దూడఁదీయు చుంత నిక్కముగ నా శవగర్రము
శాంతినొసంగుత నాకు! పరంగీశ్వరుం బిలుపుము; ఎవరు
కదలుటకి వరఖండునిం బిలుపుము. కోణపథవళులు, నాజంటు
కూఁతుల భూములతో, ఈ మూఁడవవాలినిం బంచిక్కొంపు
నివృపటత యని యది షేర్పాను గర్వము దానికిఁ
బెండిలిసేయుత! మీ యిద్దఱినిం గలిపి ప్రతిష్ఠించెద నా
యధికారమున, నా యగ్రగణ్యత, రాజబృందముం బరి
వేష్టించు సమస్తవైభవాడంబరంబులు. మేమోయన, మాన
ముపంతుఁగ, శత యోధులుమాత్రము యుష్మత్పోష్య లుఁ
సేవింపఁగ, నావర్తనమున మీ గృహములఁ వాసముఁజేసె
దము. ఇంతమాత్రము నింక మాయందుంచుకొనియెదను.
రాజను పేరును తచ్చిహ్నములగు బిరుదుల యావత్తి
ని చ్ఛేతికి; సీమను నేలుట, పన్నులఁబట్టుట, తక్కి, న
యన్నిటి జరుగుఁబాటును, ముద్దుటల్లుల, మీవిదైయుంపుత
దీని దిటవుపఱుపను, ఇందం డీ కిరీటముం మీ రిద్దఱుం బంచి
కొనుఁడు. (కిరీటము నిచ్చును.)

హల.——రాజన్య ప్రళయమతీశ్వర, మిమ్ముల నిరతము నాజే
డుఁగ గారవించినాఁడను, నా తండ్రికింబలె నయ్యాము

నూపినాఁడను, నా యనుంగునాథునిఁగ ననుసరించినాఁడను, నా పాలిటిప్రాపుగ నాజపములందలంచినాఁడను,—

ప్రళ.—వింటిని వంచి యల్లియు నీడ్చియు నైనది, అమ్మువేటునం దొలఁగుము.

హిత —అయ్యమ్మే పడుటయే మేలగు, దాని ములికి నా యీ గుండియలో దిగనాటఁగ : హితకీర్తి యవినీతుఁడు కాఁడగు, ప్రళయమతికి మతిభ్రష్టత వచ్చిన. ఏమి సేయఁగలవోయి ముసలి బడుగా? ధర్మువు పలుకుటకు ఒడియునని యెంచెదవా, ప్రభుత్వము యిచ్చకంబులకు లొంగుచుండఁగ? స్పష్ట వచనంబునకు గణ్యత బద్ధము, రాజగాంభీర్యము మౌర్ఖ్యమునకుఁ బడుచుండఁగ. నీ యాజ్ఞను త్రిప్పివేయుము. దీర్ఘాలోచనా పరుఁడవై ఈ పిశాచపు తొందర నాఁపు సేయుము, ఉత్తరవాది నయ్యెద నా యుసురుతో నా యీ నిర్ణయమునకు, నీ కనిష్ఠ పుత్రికామణి అధమురాలుగాదని నినుఁ ప్రేమించుట యందు; మఱియు నవ్వారు రిక్తహృదయులుంగారు, ఎవరి మందభాషణము శూన్యతం ఘోషింపదో.

ప్రళ.—హితుఁడవోయి, జీవము వలచిన, చాలింపు మింతట.

హిత.—నాజీవము నెన్నఁడు నెంచలేదు, కుసువయే యనక,
నీ శత్రువుల మార్గానఁ బాదమై యొడ్డను; భయమునఁ
బడను దానిఁ గోలుపోవను నీ క్షేమమే నిమిత్తమై
గాంచిన.

ప్రళ.—త్రోలఁగుము ఎదుటను!

హిత.—కన్నుఁచి చూడుమ ప్రళయుఁడ; ఎప్పుడు నన్నుఁడ
నిమ్ము నీకంటికిఁ దెల్లని గుఱ్ఱై.

ప్రళ.—ఇదిగో, జగచ్చక్షువు చూడఁగ,—

హిత.—ఇదిగో, జగచ్చక్షువు చూడఁగ, రాజ, నీవేల్పుల
యెదుట వ్యక్తము శపథముఁ జేసెదు.

ప్రళ.—ఓరి, యాశ్రిత! దురాత్ముఁడ! (కిరవాలము పైకెలు వైచును)

ధవ—కోణ—మంగళమూర్తీ, శమింపుఁడు.

హిత.—కానిమ్ము: చంపుము నీవైద్యుని, మఱి కట్టణము
నొసంగుము నీ దుష్టవ్యాధికి. నీ యాజ్ఞను మరలిం
పుము: లేదా, మొఱలు పెట్టి బొబ్బరింప నా కంఠము
నకు శక్తి యున్నంతవఱకును, నీ సేఁత కష్టఁ జెట్టయని
యార్వక మానను

ప్రళ.—వినరోయి మాట, ధర్మభ్రష్టుఁడ! నీ రాజవిధేయ
తన్మనరించక, విను నా నానాపుడు! మమ్ముల ప్రతిజ్ఞంగలఁ

జేయ యత్నించితి కావున, ఇందాక మేమెప్పుడుం దగించని రీతిని, అతిక్రమించిన గర్వంబుతో మా దండ నంబునకును మా యధికారమునకు నష్టముం బఱచితివి కావున, ఇట్టి దుర్నీతివి మా నైజము న్నా స్థానముం భరింపం జాలమిక్, మా ప్రభుత్వము నూర్జితపఱచుచు, నీకి కీ శిక్షను విధించెదము. ఐదు దినములు నీ కిచ్చె దము, అయిత మగుటకు, నీ లోకపు బాధల న్నిను నీవు కాచి కొనుటకై, మఱి యాఱవదినమున మా రాజ్య మునుంచి నీ యసహ్యాపుమూర్తిని వెడ మోపముం జెట్టు ము; మఱి యటుమీఁదను పదియవ దినమున ని బహి ష్కృత కళేబరము మా భూములం బొడకట్టిన నా ని మిషమె నీదు మరణము. లేచి పో! దివస్పతి సాక్ష్యము, ఈ యాజ్ఞకుం బ్రతికారము దొరకదు

హిత—సుఖముం బడయుము, రాజా. మఱి నీ పట్టిన పట్టె పట్టెదు కావున, స్వతంత్రత దేశాంతరముం బోవు, బహి ష్కారమున కిదియె యుంకిప ట్టాయె. (అమృత హృదయకు) వేల్పులు నినుం దమయండ జేర్చుత, కన్యకారత్నమ, న్యాయము తెంచితి, బలు సత్యముం బలికితివేయమ! (రజనీ గౌరలకు.) మఱి మీ యతిశయ వచనముల

స్త్రీ పడతలు ఋజువుసేయుత; మీ ప్రియభాష
ముల సత్ఫలములు పుట్టుత. ఇట్టుల హితకీర్తియు
నోరాజస్యుల, మీ సెలవుల నొందెడి; మఱియొక నూ
తన దేశమందుఁ దనపూర్వప్రవర్తనము నాచరించెడు

(నిష్క్రమించు.)

[వాద్యఘోషము ప్రియవ్రతుండు తిరుగఁ బ్రవేశించును,
తోడ్కొని సుబుద్ధి శుల్కపతుల, నుపచయుల సహితము]

ప్రియ — ఇదిగో ఫరంగీశ్వర వరఖండులు, మహాప్రభో.

ప్రళ — వరఖండపు సీమంతుఁడ, మొదట నిన్నుఁ బలుక
రించెదము, మా కొమార్తెకై యీ భూపతితోఁ బోటి
కొని వచ్చినాఁడవు ఏమి కోరుదు వధమము ఆపెతో
స్త్రీధనముగ, ఎంతకుఁ దగ్గిన నీదు కామయాత్రను
సలింతువు?

శుల్క — మహారాజ రాజేశ్వరా, ప్రభువులవారు ప్రస్తా
వించిన దానికన్నఁ బెచ్చునకాశించను; తమరును అంత
టికిఁ దక్కువగ నొసంగ రించరు.

ప్రళ — బహుఘనుండవౌ వరఖండుఁడ, ఆపె మా పైఁ
బ్రీతిగ నున్నపుడు, మేమును ఆపెపైనట్టులే యుం
టిమి. కాని ప్రకృతము ఆపె విలువ తక్కువపడినెను.
అయ్యా, అదిగో నున్నదాబిడ. అయ్యాల్పమా, చూప్పు

జిత్తులు న్నాకు రాసిది నేరమె యయిన. ఏలన నేఁ జక్కఁగఁ జిక్షింపు నది ముంముందు సేయుము, గాని మాటల మాట ల్విప్పనేర——తాము సభవారికిఁ దెలియఁ జెప్పుదురని, ఏదియు దౌష్ట్యపు కలంకము కాదని, మఱియే మలినత కాదని, యే యగౌరవ చరితము కాదని, తమయనుగ్రహకటాక్షముల నావలన నపహరించిన హేతువు; మఱి యెయ్యది చేసిదో నాయెడ, నేని లేమియె నాయెడ హెచ్చిన కలిమి యయ్యెనో యంపని కేయని, యది యేమన, విడనాడక బతిమాలెడి కనుమాపును, నాయెడ లేదని నే సంతసించు నిసు నాలుకయు, ననఁగ దీని లేమియె తమ ప్రీతిని న్నచుఁ బాపెనని.

ప్రియ.——కడు మేలయ్యెడి నీ పుట్టకుండిన, న్నన్నింతకంటె నెచ్చుగ సంతసింపఁ జేయమికంటెను.

సు ౹౹ ——అయారె యింకేనా,——ఒక సహజపు సంకోచము, ఇయ్యది తఱుచుఁగ, తరుణ మనసి చేయ నెందిన కర్జముం ముంముందుఁగం బలుకులం గూర్పలేనిది? వర ఖండ మండలేశ్వర, యే మనియెద నీ పీ ముద్దరాలికి ' వలఁపు వలఁపు కాదు వల గుఱియగు వలఁతిచుంకి కడు

## రంగము II గుళస్థాన సామంతుని మార్గము.

(ప్రవేశము దుష్టబుద్ధి, ఒక జాబుతో.)



దుష్ట:—ఓసీ, ప్రకృతి, నీవే నా యిష్టదేవతవు నీ శాసనమునకు నా కైంకర్యములు బద్ధములు. కావున నే నేల మాచార కంటకములో నిలువవలెను. అట్లు నిలుచుచు నేల నియుకొనవలెను రాష్ట్రవాసుల యాశంకలు నన్ను శిష్ట భ్రష్టునిం గావింప, నదియు నెవండో యొక యన్నంట! వానికంటెం బండ్రెండో పదునాలుగో నెలవెలుగులు వెనుకం బట్టితి నంట నేల దిగుటకు? ఏమి మహా ప్రమాదము? ఏల నన్ను జారజుం డనియెదరు? నేనెట్లు నీచుండ నైతి? నా యవయవములు పొందుగం గూర్పం బడియుండగ, నా బుద్ధి విశాలమై యుండంగ, నా యాకారము సలక్షణమై యుండంగ, పతివ్రతా జనితునకుం బలె నైదద్భుతములు సమరి యుండంగ? మమ్ము నేల హీనజాతులని ముద్రించెదరు? హీనత్వమా? జారజన్యలా? హీనము, హీనము? మంచిది, కానిమ్ము, ధర్మజుం డెగు ప్రేమసింహాసనముండ, 'నీ భూమి నాకు రావలెను: మా నాయన ప్రేమ దుష్టబుద్ధిమీఁద నున్నది, ధర్మజనితుపై

ప్రియ.—నీ వా చదువుచున్న కాగిత మేమిటీ?

దుష్ట.—ఏమియు లేదు మహాప్రభో.

ప్రియ.—లేదా? ఏమగత్యము, అట్లయినచో, నంతటి ఆవ
ఆవతోఁ బెదరుచు వేవేగముం దాని నీ జేబిలో దోఁపనేల?
ఏమి లేమి యనువానికి దస్సు దాఁచి కొనవలసినంత యగ
త్యము లేదే చూతము, తే రమ్ము, ఏమియు లేకుం
డిన, నాకు సులోచనము లక్కఱ యుండదు.

దుష్ట.—అయ్యబాబు, మనవిఁ జేసెద, మన్నింపుఁడు నను
మా యన్నయ్య పంపిన యుత్తరంబది, యింక దాని
నంతయుఁ దుది ముట్టనుఁ జదివితి లేదు, చదివినంత
వఱకుఁ జూచిన, నది తమ చదువునకుఁ దగినదియు కాదు.

ప్రియ.—ఇమ్మో యిక్కడఁ కాగితము నా చేతికి.

దుష్ట.—అపరాధిని నగుటను దీసి నుంచినా, నిచ్చినా.
ఇందలి విషయములు, నేఁ జదివినంత వఱకును, గర్హ
ణార్హములు

ప్రియ.—ఏది చూతము, చూతము తే.

దుష్ట.—మాయన్నయ్య పటము సమాధానముగ, నా సౌ
జన్యతఁ బరిశోధింప నిట్లు చవి చూపి వ్రాసెఁ బోలు.

ప్రియ —(చదువును). "వార్ధక్యమును నంత భక్తితో గౌరవించు నాచార నీతి, యీ వృద్ధ్వునిఁ జేదుఁ గాపించెడి యింతిమాయుష్యమున నతిభోగ్య భాగములు; మన భాగ్యములం తెంతకునిక మనల నటంకపఱచెడి, మనలకు రుచి నేపగించు మానలితనంబు వచ్చు దాఁక. ఒలహీనముం మోహాముమునగిఁ బెజానాటఁ గొఁడి తెంపు నాయె, నీ వృద్ధ పిత్రు పృత్తురి నిర్బంధ శాసనము: ఈతఁ డిట్లు శాసించుటకు హేతువు తన శక్తి సమర్థతేమియుఁ గాదు, మఱి యీ శాశాసనమునకు వశవర్తులమై లొంగి మెలంగుటయె. నేస్తు నాయొద్దికి, దీనిఁ గుఱించి నీతోఁ బెచ్చుగ సంభాషింపవలయు. మఱి నాయన శయనించిన, నే మేలుకొలుప్రపజాకు, నీ వనుభవింపఁ గలవు ఆయన భాగదేయంబున నర్ధభాగములు శాశ్వత భోగముగ, మఱి మరియెడవు నీయున్నయ నెయ్యంపుఁ దమ్ముడవునై. ప్రేమసింహుఁడు."

హుం—ఉపజాపికమే!—'శయనించిన నే మేలుకొలుప్రపజకును,—నీ వనుభవింపఁ గల వాయన భాగదేయమున నర్ధభాగములు,'—నా కొఱక ప్రేమసింహుఁడ! వానికి చెయి వచ్చెనా దీని వ్రాయుటకు? గుండియయు మెదడును దీనిఁ బుట్టించుటకు?—ఎప్పుడు వచ్చె నిది నీ చేతికి? ఎవరు తెచ్చిరి?

దుష్ట — ఇది నా యొద్దికిం జేఁ బడ లేదు, ప్రభూత్తమ; అందున్నది నేర్పు, నాకు దొరికెను నా యింటిగది (డాఁపుట్టిల్లు చాటున్న) కిటికినిం బడవేసి యుండఁగ.

ప్రియ.— నీకుఁ దెలియునా యీ వ్రాలు నీయన్నదని?

దుష్ట — లక్షణము చక్కనిదైన, మహాప్రభు, నే నొట్టుఁ బెట్టనోఁపను నతనిదే యగునని; కాని, యీ లక్షణము పట్టి చూచిన, సంతస పడుదు నతనిది కాకుండునో యని.

ప్రియ — అతనిదేను

దుష్ట — అతనిది వ్రాలేను, మహాప్రభో, కాని యతని హృదయ మీ సంగతుల నుండదని నమ్మెద.

ప్రియ — ఇన్నెప్పుడు నిటుమునుపు ఈ కర్జమున శోధింప లేదా యతఁడు?

దుష్ట — లే దెప్పుడు దేవర; కాని తఱచుగ వినిన వాఁ డతఁడు స్వాధింపఁగఁ దగవని, యేమన్న, కొడుకులు నిండు ప్రాయముఁ బడసి తండ్రులు ఒఱగఁ జాఱుచు నుండిన, తండ్రి కొడుకు ప్రోపున మెలంగ వలయుననియుఁ, కొడు కాతని వచ్చుబడినిఁ బరామరిసింప వలయు ననియు.

ప్రమ.—ఓరీ, దౌర్జన్యుడ, దౌర్భాగ్యుడ! ఘాతుక వి
ద్యాభిప్రాయమే యీ ఉత్తరమునందు! ఓరీ ఘోర
దురాత్ముడ! దారుణ, గర్హిత, తిర్యగ్జాతి దురాత్ముడ!
లిక్యకుల్యకరుడు అనసముడా! పోరోరీ, నెమకొను వాని,
వానిఁ బట్టికొనియెద; జగిన్నాకక నృశంసుడు! ఎక్క
డున్నాడు వాడు?

దక్ష.—నాకుఁ జక్కఁగాఁ దెలియదు, మహాప్రభూ. మా
యన్నయ్యనుఁ గుఱించిన తమ యాగ్రహము నడఁచి
యుంపఁ జిత్తగింతురేని, యతని సంకల్ప మెట్టిదో యను
కంతకింటె బలతర నిదర్శనము నాతనివలన సంపాదింపఁ
డకకను, తమరు వెళ్లునది శ్రేయస్కర మార్గముగా,
నంగనను మాఱుగ, నతని యుద్దేశము నిదమిత్థమని
తెలిసికొనక, యిష్టముగ బలాత్కరించి ప్రయోగంబుఁ
జేసితిరేని, తమ గౌరవమునం గొప్ప ఛిద్రం బప్పళిల్లు,
మఱియుఁ బితృభక్తి రాజిల్లు నతని హృదయమును
భిన్నాభిన్నపఱచు. అతని కొఱకు నా ప్రాణములైన
బాధ్యము వలదఁ దగించుదు, గౌరవీయులు తమ పైఁ
నాభక్తిస్వరూపమునుఁ బరిశోధింపను బ్రాసినాఁడని, మఱి
యెటువంటి దురుద్దేశముతోఁ గాదని నిరూపించుటకు.

దుష్ట — ఇదియె యీ లోకపు టితిరి యమహా మోసంపు మా
ధ్యము, ఏమన్న :— సంపదలో మనకు జాడ్యము వచ్చి న-
తఱుచుగ నిడియు మన యతిక్రమ శీలతాఫలంబే — మన
యాపదల మూలంబు లని యెత్తి పొడుచుట, సూర్యుని,
చంద్రుని, నక్షత్రముల; మనమేమో విధిలేక ద్రోహుల
మయిన యట్లు; వేల్పుల బలిమిచే విధవలమయిన యట్లు,
గ్రహ గోళముల యుచ్ఛతచే దొంగలము, దోపిడి
కాండ్రము, ద్రోహులము నయిన యట్లు; గ్రహచారపు
ప్రభావమున బలాత్కారముగ బాధింపబడి ప్రాగు
బోతులుగ కల్లరులము లంజెకాండ్రము నయిన యట్లు:
మన మెందరము జెట్ట పాల్పడితిమో యిది యెల్లను దైవ
నిర్బంధమంట. ప్రేమసింహుడు —

(ప్రవేశము ప్రేమసింహుడు.)

భళిరే! తఱివేచి వచ్చుచున్నాడ తలంపను పురాతన సుఖో
దయపు ఉపసంహారంబు బోలె: నా సూచనాభావ సే
మిన్న, ధూర్తవ్యాకులము, ఒక నిట్టూర్పుతోగ గూడ
కెట్టింటి వేంకటాయ లాగు ఓరన్న, ఈ గ్రహాణవులు ఈ
విగ్రహములం జూవుచున్నవి రోయి! పూ, ధా, నీ, గా

ప్రేమ — ఏమిరోయి, తమ్ముడ, దుష్టబుద్ధీ! ఏమి మహత్తర
యాలోచన నీ చేయునది?

బను చోటికి: బాబు, పుణ్యము నీకు, పద, పద; ఇా
దమ్ము నా తాళపు చెయ్యి, వెలుపటఁ గడలుదు వేసి,
సాయమునుఁడవై వెళ్లుము.

ప్రేమ —నాయకుఁడుఁగనా, తమ్ముఁడు!

దుష్ట —అన్నయ్యా, నా మాత్రము నీ మేలుఁ కేను. నాయ
కుఁడవై వెళ్లుము. నే యోగ్యుఁడను కాను, నినుఁ
గూర్చి యించుకైన మేలెంచిన వారలుండిన· నే విన్న
దియుఁ గన్నదియు నే వెల్లడి చేసినాఁడ: కాని పోలఁ
ముఁగ, దాని కలకూవును గోరఁగింతయు నెచ్చటం
మఱి చూడఁ జాలుదు, నెగ్గు వర్ణింప నేర్తు! కరుణించి,
యవతలికి.

ప్రేమ.—విందునా నీవలనం జెచ్చెర?

దుష్ట.—నీ సేవకుండ, నీ యుద్యోగమునందు. లఘు

(నిష్క్రమించు ప్రేమసింహుఁడు.)

విశ్వస్తుఁడు మా ప్రియవ్రత బాబు! భ్రాతృ
సింహము మా ప్రేమసింహ యన్నయ్య; ఒరుల కే
కీడును నెంచ నేరఁడు కాన నొరుల కీడును నెంచ
నోపఁడు నలు సంతయు: ఈతని మాధుర్యపు సత్యసంధత
పై నాదొంగ జిత్తులు చులకనగ సవాల్ జేయుచున్నవి!

నే నేమో కార్యముపై కన్ను గలవాఁడు. పుట్టుకవలనఁ గాకపోయిన నేమి, బుద్ధివలనఁ బడసెద భూములు. అన్నియు నాకు యుక్తమేను, వేని నేఁ బొసఁగఁ గూర్ప గల్గిన. (నిష్క్రమించు)

రంగము III ధవళవర్మ సామంతుని నగరు.

(ప్రవేశము, గరళవల్లి, వసుపాలుఁడు, (నాఁమె మణివకాఁడు.)

గర —నాయబ్బ కోట్టైనా నాపనివాని, ఆతని విదూష కునిఁ జీవాట్లుఁ బెట్టినందునకు?

వసు —ఔనండి, యమ్మయ్యగారు.

గర —పవలు రేయిని నతఁడు నాపై తప్పుడు దూఱులు కల్పించుచున్నాఁడు; ప్రతి గంటయు నేదో యవాచ్య యతిక్రమణంబున బుడివడి రేఁగుచున్నాఁడు, వెంటనె మన యందఱికిని గయ్యములు పుట్టుచున్నవి; నే సహింప నేర నబ్బ దీని; అతని యోధులు కయ్యాల క్రచ్చు లగుచున్నారు; తానును మమ్ముల నత్యల్ప హేతువుల కెల్ల గద్దించుచున్నాఁడు. వేఁటనుండి తిరిగి వచ్చు నప్పుడు నే నతనితో మాటలాడను; జబ్బుగ నున్నా నను; నీ పూర్వపు శ్రద్ధాభక్తి సేవలలో మందగించిన మేలు సేతువు! ఆ నేరమునకు నే నుత్తరవాది నయ్యెద.

వసు.—ఆయన వచ్చుచున్నా రమ్మయ్యగారు; ఆయనగొంతు చెవులఁ బడుచున్నది. (కొమ్మల రవలి, లోపల)

గర.—నీ చిత్తమువచ్చిన యశ్రద్ధ నభినయింపుము, నీవే కాక నీతోఁడికాండ్రు నయితము; మీ నటన ప్రశ్నంబు నకు రాఁ గోరదు: అది యతని కొల్లని చో, వెళ్లని మా చెల్లెలింటికి; ఆపె మనసును నాదియు, నే నెఱుం గుదు, నీ విషయమున నొక్కటేను, ఏమన, నీతని చా పలముల చొప్పున శాసింపఁ బడము: మోటుముదుసలి వాఁడా, దత్తముఁ జేసిన యధికారముల నింకనుఁ బ్రయో గించునఁట! భళిరే, నా ప్రాణ మాన, ముసలి మొర సులు పాలపాపలు మఱి; వారి నడవుటకుఁ గూఁకలు వేయవలెను బుజ్జగింపను వలయు—చనువున్నఁ బట్టి వారు త్రోవ తప్పిన. జ్ఞప్తి నుంపుము నా యాజ్ఞ నుడువుల

వసు.—చిత్తము, అమ్మయ్య.

గర.—మఱి యతని బంటులకు నీతోఁడికాండ్రు నొప్పఁకపు చూపులఁ దోఁప నిమ్ము; అందుండి యేమి వచ్చినా బంధి లేదు; నీ సంగడీంద్రకు అమ్మెయి బోధింపుము. వాని నుండి నే నడసులు కల్పించుకొనవలె, కొనియొడఁ దప్పక

నా యుల్లంబు ఘల్లడి సేయఁగ: నా తెల్లకు నీ శిక్షణ మునే ప్రాసెద, నా ప్రకారమే జరుపను. భోజనమునకు సిద్ధము సేయుము. (నిష్క్రమింతురు.)



## రంగము IV ఒక కూటము దానినే.

ప్రవేశము హితకీర్తి, నూలు ఁకముః.

హాత — నా సహజ కంఠమును దాఁపఁ జాలిన కపటస్వర ములచేఁ గూడ నింత చక్కఁగనే చేకొని ప్రయోగించి నయెడ, నాదు సదుద్దేశము ఆ పరిపూర్ణ కృతార్థతం గాంచ వచ్చు, నెందుకై నా స్వరూపమునుం గోఁకి వేసితినో. ప్రకృతము, విడాసిత హితకీర్తి, నిన్ను పరదేశమునకుఁ బలియిచ్చిన వారికే సేవఁ జేసిన యెడల, తట్టమము కా వచ్చును నీ ప్రేమించుఁ ప్రభుండు నిన్నతి ప్రయోజకుఁ డని భావించునట్లు.

కొమ్ముల రవళి, ఉగ్గోఁపల. ప్రవేశము, ప్రళయాంతకుఁడు యోధులు, పరిచరులును.

ప్రళ.—లేశకాలమును నేఁ దడయఁ గూడదు భోజనమునకు: వెళ్లుము, సిద్ధపఱుపుము. (నిష్క్రమించు నొక పరిచరుఁడు.) ఏమది! ఎవఁడురా నీవు?

హిత —మానిసిని, బాబు

ప్రళ —ఏమి తెలియు నీకు? ఏమి పని మాయెడ?

హిత —నా చేత నెంతమాత్రమో జాలికిఁ దక్కువపడదు
నా తెలివి: నన్ను నమ్మకమైన కొలువున నుంచువారికి
నమ్మకముగఁ గొలువు సేయుదు, కల రూపు కలవానిఁ
గను చెలిమినిఁ జేకొందు; తెలివి హెచ్చి పలుకు తగ్గిన
వానితోఁ గలసి మెలఁగుదు, నీతికి లొంగుదు; అగత్య
మగునపుడు కయ్యమునకు జడియను; చేఁపలు ముట్ట
నొల్ల.

ప్రళ.—ఎట్టివాఁడ వీవు?

హిత.—మహా సత్యహృదయుఁడను, మఱి బీదవాఁడను
రాజనకుం బలె.

ప్రళ.—రాజఱికముఁ బట్టి రాజు బీదగా నున్నట్లు, ప్రజా
ధర్మముఁ బట్టి నీవంత బీదవాఁడవే యయిన, కడుఁ జేద
వాఁడె కావలెను. నీకేమి కావలయు?

హిత —కైంకర్యము.

ప్రళ —ఎవరిం గొలుతువు?

హిత.—నిన్ను.

ప్రళ.—నన్నెఱుంగుదువటరా, ఓరి?

హిత —లేదు, బాబు; కాని నీ మొగముఁ జూచినఁ గా వందు లన బుద్ధివేయు జాడ యున్నది.

ప్రశ.—ఏమది ?

హిత —అధికారము.

ప్రశ.—ఏమేమి పనులు చేయఁ గలవు ?

హిత —మంచి యేకాంతముల దాఁపఁ గల, గుఱ్ఱముఁ ద్రిప్పఁ గల, పరుగఁ గల, సొగసు కతనుఁ జెప్పుట యందుఁ జెఱుపఁ గల, తేట సుద్దిని మోటుఁ దనంబునం దెలుపఁ గల; సామాన్య జనులు జేని దేనికిఁ దగియుందురో, దాని కెల్లఁ దగినవాఁడ; మఱి నాయందు గొప్ప యే మంటెను చుఱుకుఁ దనము.

ప్రశ.—నీ కేమి వయస్సు ?

హిత —పాట విని బోటిని వలచు నంత పడుచువాఁడనుఁ గాను, బాబయ్య, ఆవ నూపకు సతివ మాట వినఁ దెఱఫు మఱువుల ముసలినిం గాను; నా వెన్నుపై నలువది యెనిమిది ఏఁడులు మోసినాను.

ప్రశ.—నను వెంబడించు నన్నే కొలుతువు కానిమ్ము; భోజనానంతరము నా ప్రీతి నీ పైని తగ్గకుండిన, నిన్ను వేగిరఁ బంపి వేయను లే. భోజనము, ఎవఁడు రోయి,

భోజనము! దుడుకఁడెక్కడ? విదూషకుఁడు? వెళ్లరా,
తోడ్కొని రా నా విదూషకు నిక్కడికి.

(నిష్క్రమించు నొక పరిచరుఁడు)

ప్రవేశము, వసుపాలుఁడు.

ఓరి, ఓరి, ఓరోయి, ఎక్కడరా నా పుత్రిక?

వసు —చిత్తము, చిత్తగింపుఁడు,—

ప్రళ.—ఏమనుచున్నాఁడు రా వాఁ డక్కడ? పిలుపుమఱా
తిరుగ నా మద్ది దున్న పోతును. (నిష్క్రమించు నొక యోధుఁడు.)
ఎక్కడికి వెళ్లెను రా నా విదూషకుఁడు? లోకము నిద్రి
రించు చున్నదా యేమి?

పునఃప్రవేశము, యోధుఁడు.

ఏమిటి యోయి! ఎక్కడ నా పలుగాకి?

యో.—వాఁ డనుచున్నాఁడు, మహాప్రభు, ఏలినవారి కుమా
రిత కోళ్ల బాగు లేదఁట.

ప్రళ.—ఏల రాఁ డా బానిస మళ్లి నా యొద్దికి, వానిఁ బిలు
వంగ నేను?

యో.—అయ్యా, వాఁ డుత్తరం బిడె నాకు బలు మోటుఁ
దనముగఁ, దా రానేరఁడని.

ప్రశ.—నేరేఁడా వాఁడు ?

యో.—మహాప్రభో, నే నెఱుంగ నేమి కారణమో : కాని, నా కనులకు, తమ గాంభీర్యమున కెప్పటి యట్టుల నా యత్యుపచార పూర్వక ప్రీతి యిప్పుడు జరుగుచాటు లేదు.; ఆ భక్తియందు మిక్కిలియుఁ గొఱంత వడి నట్లున్నది సామాన్య యుపజీవులయందె కాక, యిచ్చటి నామాంతుఁడు మీ యల్లుని యందును, మఱి తమ కొమా రిత యందును.

ప్రశ.—హా ! అట్లనియెదవా నీవు ?

యో.—ప్రార్థన, యేలినవారికి, సవినయము, క్షమింపుఁడు అడియని యపరాధము, నా మాట పొరపాటైన, నా స్వధర్మమూర కుండు టెట్లుఁ దమ గంభీరతకు నవమర్యా దని తోఁచుచుండఁగ !

ప్రశ.—లేదు లే, నీవు నా స్మరణకే తెచ్చినావు నాకు పొడ మిన యనుమానమునే ; ఇటీవలనేఁ జూచినాఁడను బహు స్వల్పమైన యశ్రద్ధను ; కాని సాక్షిమానము నూతన్యాంశ ములును శంకించు నట్టి నా లోపమేయని యెంచితిఁ గాని, బుద్ధి పూర్వకముగఁ గావలెనని యాచరింపఁ బడిన య ప్రియంబని యెంచలేను : కాని హెచ్చరికతో మఱి

కొంత సరసమైన దీనిని. పతి నా విదూషకుఁ డేఁడీ? గడఁచిన రెండు దినములఁ బట్టి యతని చూడలేదే.

యో.—మా చిట్టి దొరసానమ్మగారు పరంగి స్థానమునకు నడు చెంచినది మొదలు, విదూషకుఁడు నత్యంత విషాదముతో సోలి కూలి పోవుచున్నాఁడు.

ప్రళ.—చాలించు మిఁక నా సంగతిని; దాని నే లెస్సఁగ వీక్షించినాఁడ. పద నీవు, చెప్పు మమ్మాయితో, నేనామెతో మాటలాడవలెనని. (నిష్క్రమించు నొక పరిచరుఁడు) నీ పదపోయి, నా విదూషకు నిక్కడికి పిలువుము.

(నిష్క్రమించు నొక పరిచరుఁడు)

(పునఃప్రవేశము, వసుపాలుఁడు.)

ఓరోరి, నీవు రా, నీ విటు రమ్మురా, ఎవరురా నేను, ఓరోయి?

వసు.—మా దొరసానమ్మగారి తండ్రి.

ప్రళ.—'మా దొరసానమ్మగారి తండ్రి' నా! మా దొరగారి భృత్యుఁడా! ఓరి కుక్క లంజకొడుకా! ఓరి గుండఁడా! మాలకుక్కా!

వసు.—నీని నేమియుఁ గాను నే, దేవర; మన్నింపుఁడు నన్ను.

ప్రళ.—ఎదురు చూపులు చూచెద వటరా, ఓరి చండా లుఁడా ? (అతనిఁ గొట్టును.)

పసు —దెబ్బలు గిబ్బలు కొట్టఁ దీసికోఁ జాలను సుమండీ, దేవర.

హిత —మఱి నీ కాళ్లు జార్చి కూడ బోరఁ గొట్టించఁ గూడదు కాఁబోలునే, ఓరి కాలిబంతి కుందికాళ్లవాఁడా !

(గుదికాళ్లు లాగి బోరఁ గొట్టించును.)

ప్రళ.—భళిరే, నా గట్టి దిట్టఁడా, లెస్సని పనిఁ జేసితివి, నీకు మేలుఁ జేసెద.

హిత.—రా, వయ్యా, లే, వెళ్లిపో ! పెద్ద చిన్నల భేదముల నేర్పెదను ; వెళ్లి పో, వెళ్లి పో ! నీ దున్నపోతు దేహ ముతోఁ దిరుగఁ గొలిచికో నెంచిన, తడయుము : వలదు, వెళ్లిపొమ్ము ! అవతలికి ; నీకేమి, తెలివి యున్నదా ? అట్లుఁ జేయుము.

(పసుపాలుని వెలుపలికి గెంటి వేయును.)

ప్రళ —మఱి నా యనుఁగు బంటుఁడా, సంతోషించితి నీ పనికి : ఇందమ్ము నిన్నుఁ గొలువు కొన్నందునకు సంచ కరము.

(హితకీర్తికి సొమ్మిచ్చును)

ప్రవేశము, బాణ భణితుఁడు.

బాణ.—నేను వానిఁ గొలువు కొసియెద ; ఇందమ్ము నా కొండె బొమిడికంబు. (తనకుళ్లాయిని హితకీర్తి కివ్వఁ బోవును)

ప్రళ.—ఎట్టు లిపుడు, నా ముద్దు గుంటఁడా ! ఎట్లున్నాఁడవు ?

బాణ.—ఓరోయి, నీవు తీసికొన్న మిగులఁ బొసగి యుండు నా కొండె బొమిడికంబు.

హిత.—ఏలరా, యాగడీఁడ ?

బాణ.—ఏలనా, దయాఽపాత్రుని పక్షము వెనుకొన్నందునకు : వలదు, కాలానుకూలముగ నడచికొన లేకపోయిన, త్వరలోనే నీకు శైత్యము చేయును సుమా : అదుగో, పుచ్చుకొమ్ము నా కోడిజుట్టు కుళ్లాయి : చూడుము, ఈతఁడు, తన కూఁతుల నిద్దఱిఁ దోలివేసినాఁడు, మఱి మూఁడవ దానికి దీవన లొసంగినాఁడు, తనకుఁ దెలియకయే : వాని వెంబడించితివా, తప్పక నా కుళ్లాయిని నీవు తొడిగికొనవలయు. ఎట్లిప్పుడు, మామయ్య ! నాకు రెండు కుళ్లాయిలును ఇద్దఱు కూఁతులు నుండిన బాగుండును.

ప్రళ.—ఏలరా, గుంటఁడా ?

నిష్ప డే చూ పట్టునుం డేట తెల్లమిగా.
మొట్టమొదట నిచ్చటి పలువన్నెల పుట్టింపుఁదాలుపు
న్నెట్ట యెదుట నిలిచినాఁ డిం క్లోకండును.

ప్రళ.—నన్ననియెద వఁటరా మూఢుఁడని, దుడుకఁడా?

బాణ.—నీ తక్కిన యన్ని బిరుదుల నిచ్చివేసినాఁడవు; అది యో నీ పుట్టువుతో వచ్చినది.

హిత.—ఇది యెంతేనియు మూఢవచనంబు కాదు, మహా ప్రభో.

బాణ.—కాదు, సత్యము, సామంతులును సీమంతులును నా జోలికి రాకుండరు, మాధ్యమున కేకాధికార పత్రిక నాకుఁ బుట్టించియున్న, వారి కొంక యంశము నిచ్చియుందు; సీమాటుఁలు కూడ, వీరుచు నన్ను సర్వమూఢునిగా నుండ నివ్వరు; పెఱికి కొనువారె వారును. నా చేతికొక గ్రుడ్డు నిమ్ము, మామయ్య, నీకు రెండు మకుటము లిచ్చెద.

ప్రళ.—ఏమిటోయి, ఆ రెండు మకుటములు?

బాణ.—ఏమహా, ఆ గ్రుడ్డును నడిమినిఁ గ్రోసివేసి యందలి గిజురుచుం దిన్న మీఁదట, నుండు నా గ్రుడ్డు టోపీలు

రెండును. నీ మకుటమును నడిమికి రెండుగాఁ జీల్చి, యా రెండు భాగములను ఎప్పుడు ఇచ్చివేసితివో, అప్పుడే బురదపై నీ గాడిదను వీఁపుమీఁద మోసికొని వెళ్లితివి: నీ బట్టతలలో నింగంత తెలివియు లేదాయె, నీ బంగారు తలచుట్టును దత్తము చేసినపుడు ఇంకను నాఁగా గున నే మాట్లాడి యుంటె, వాని కిన్నెవలెను చబుకు దెబ్బ, మొనఁడనునో మొదట నట్లని.

(పాటను.)

హాస్యకరు లింత యగ్గువ కాలేదే హాయనమందును
హాస్యమున కర్హులైరి ప్రాజ్ఞు లండఱు నగత్యమేమి వారికి?
తెలియనైరి ప్రాజ్ఞు లెవరుఁ దమ తెలివిఁ బ్రోచి కొనుటకు,
కలయఁ జూడ వీరి నడత కడుఁ జోద్యమాయెను.

ప్రళ.—మును పెప్పు డుంటివో యింత పాటల మాఱివై, ఓరోయి?

బాణ.—ఈ త్రోవను బడినవాఁడ మామయ, నీవు నీ కొమరితలఁ దల్లులు జేసిన నాటనుండి; ఎందు కందువా, వారి చేతికి ఖేమ యిచ్చి నీవు చల్లడముఁ దొడిగిన యప్పుడే,

[పాటను]

వారు నేర్చిరి డబ్బాటు టరుసము బట్ట లేకయే,
నేనుఁ బాడితి తొంట్రిలుచుఁ జుమ్మ చుట్టుటక్,
ఇట్టి రాజు డాఁగురింత తెలమి నాడుచు,
పట్టి మూఢుల జట్టులోనఁ జేరఁ గాయవి.

వేడుకోలు నీకు, మామయ్యా, ఒక బడి పంతులఁ గుదిర్చి పెట్టుము నీ యాఁగడీఁడున కబద్ధము నేర్పఁ గలవానిని: అబద్ధము నేర్చికొన నాసక్తి వాడమెడి.

ప్రశ్న —అబద్ధమాడితివా, యోరోయి, నీకు జాటిదెబ్బలు కొట్టించెదము.

బాణ —నిక్కముఁ గొందుచున్నాఁడ నేమి బంధమొ నీకును నీకూఁతులకు నని: వారు జాటి దెబ్బ కొట్టింత మనెదరు నిబద్ధి యాడెద నన్న, నీవు కొట్టించెద ననియెదవు అబద్ధమాడెదనన్న, ఇంతకంటె వింత యేమన్న, కొన్ని వేళల నన్నుఁ గొట్టించెదరు మిన్నకుండినందునకు. అబ్బబ్బ యేమైనఁ గావచ్చుఁగాని వలదబ్బ యీ విదూషకుని కొలువు: అందును, నీలాగున నుండలేను, మామా, నీ తెలివిని సిరుచెంపలనుఁ జివ్వికొని నడిమిని నున్నఁ జేసికొన్నాఁడవు:- ఇల్లిదిగో వచ్చుచున్న దా చివ్విన పేళ్లల్లో నొక్కటి,

గయ్యములకుఁ గాలు ద్రవ్వెదరు; ఘోర దుర్భరము లగు పోరులుఁ బెట్టెదరు. అయ్యా నే నెంచియుంటి, ఇది నీకుఁ జక్కఁగఁ దెలియఁ జెప్పి యేదైన సుఖకరమగు మోచన మార్గముఁ బడయ వచ్చునని; కాని యిపుడు పెల్లును వెలపు మీఱుచున్నది, నీవు నిటీవలఁ జెప్పినది యుఁ జేసి నడియుఁ జూడఁ జూడ, నీవే వారి యీ నడ తల కియ్యకొనిన యట్లును అట్టి యియ్యకోలు వలన వారిని రేఁపుచున్నట్లును. ఇయ్యది తథ్యమే యయినయెడ, నపరాధమునకుఁ దగిన యాక్షేపము రాకమానదు; మఱి యుచితమైన ప్రతిక్రియలు నూరకయుండవు; హితావహ మగు భద్రత కొఱకు నా ప్రతిక్రియల రచియించితి నేని, నిష్కారణతం బుట్టిన నెది నా కవమానాస్పద మగునో యట్టిదా నే నీ కొనర్చు నపరాధము సమయావశ్యకతం బట్టి సవివేక యాచరణం బనఁ బోవును.

బాణ—ఏలనా, తెలియుఁగా నీకు మామయ్యా,

కంచె పిచ్చిక హెచ్చు మచ్చికం గోకిలంబును
కడఁగి నిడివి కాపాడఁగా
మించి దాని తలను కొఱికె నేరమగునొ
యదియు మఱి వివేకమే కదా?

అట్టులె, చయ్యనఁ జల్లార వైనప్రవృత్తియు; మేమును మగ్నుల మయితిమి వెల్లగు చీఁకటిక.

ప్రళ.—నీవు మా పుత్రికవేనా?

గర—రావయ్యా, ఎంతవేఁడుదు నిన్నుపయోగించుమని, యీ సద్వివేకమును? నే నెఱుంగుదునే నీ వెంతటి యఖండ పరిపూర్ణ ప్రజ్ఞానిధివి యని; ఈ యనక తవక వికారము లన్నింటి నావలఁ గట్టి పెట్టుమోయి; ఇటీవలి వివి నిన్ను బొత్తిగ మార్చి వేసినవి నీ యథార్థ స్వరూపము నుండి.

బాణ—గాడిదైనఁ దెలిసికొన నేరదా బండి గుఱ్ఱము నీడ్వఁగా? బలారె, గర్వ! నిన్నుఁ జూచిన ముద్దు వచ్చుచున్నది.

ప్రళ.—ఇక్క డెవరైన నన్నెఱుంగుదురా? వీఁడు ప్రళయుఁడు కాఁడే: ప్రళయుఁ డిట్టులా నడచును? ఇట్టులా పల్కును! ఏమయ్యె వాని కండ్లు! ఒక్కండు, అతని బుద్ధి బల ముడుగుచున్నది; లేక యతని తెలివికలు మబ్బుకొనిన చేవి కాఁబోలు.—అహా! మేలఁకువేనా? కాదు కాదు. ఎవరు చెప్పఁ గలరు నాకు నే నెవరని?

బాణ—ప్రళయాంతక రాజుని ఛాయవు.

ప్రళ.—అవి నేఁ దెలిసికొన నిచ్చగింతు; ఏలన్న, నా రాజాధికారము, నా జ్ఞానము, నా వివేకము, వీని గుఱుతులం బట్టి చూడ, నేను రాజు నని, నాకుఁ గొమరితలు కలరనియు స్ఫుటమగుఁ గాని, నే నొందిన యపచారముఁ బట్టి సందియంబు సిగుడెడి.

బాణ.—కాఁ గాని యీ కొమరితలు తండ్రినిఁ దమకు సవి నయుంచు గావింతురు.

ప్రళ.—నీ పేరు చెప్పుము, ఓ ముద్దుల సీమంతినీ

గిర.—ఈ నివ్వెఱపాటు, నబ్బయ, చాలను నీ యిప్పటి యితర నూతన చపల చేష్టల వాసన వీచుచున్నది. నిన్నుఁ బాదము లొత్తి బతిమాలికొనియెద, నా యభిప్రాయముల నరిచూచి యరసికొమ్ము. నీవు ముదుసలివి పూజ్యుఁడవునుం గాన, తెలివి కల్గి యుండవలయు. ఇదిగో చూ డిక్కడ నుంచికొన్నాఁడవు నూర్వుర జోదులం బారి వాండ్రను, వీ రెంతటి యక్రమ ప్రవర్తకులో, యెంతటి యాకతాయలో, యెంతటి తెగువకాండ్రో చూడుము, నానాటికి వీరి దురాచారముల వలన దూషితంబై మా మందిరము అల్లరి మూఁకల కల్లు పెంట యయినది. వీరి విషయ భోగమునను సుర

తేర్చుటకు మా భవనము ప్రాగుప చావడిఁ గను తొప్పు టిల్లు నాయొఁ గాని గంభీర రాజ భవనంబుఁ గఁ గాల్పింప లేదు. ఈ సిగ్గుమాలిన తనమె ప్రవేశించుచున్న దెద్ది యైన తాత్కాలిక చికిత్సను: కాఁబట్టి ఈ ప్రార్థన నంగీ కరింపుము, నీ పట్టి సేయు శక్తి, దివ్యదైత్రైతే స్వతః జ పింపఁ గలవో లేఁ బ్రార్థించు దానిని, అది యేమన్న నీ పరివారపు సంఖ్యను కొంతకుఁ దగ్గించు కొమ్మని, మఱి శేషించిన వారి నీ యాశ్రితుల నేర్పఱచి కొమ్మని నీ వయస్సునకుఁ దగినవారుఁ గను దమ్ముల నిన్న యోగ్య తాంతరముఁ దెలిసికొన్న వారుఁ గను.

ప్రళ — ఏం జీకట్లం పిశాచములా! హాయము ల్పల్లన కట్టి తెంపతిరయమున; నా పరివారము లన్నెట్టినిఁ గలయఁ గూర్చుదు. దాక్షిణ్యపు డంపు లంజె కూఁతురా! నీ జోలికి రాను లే. ఇంకొకటి తె మిగిలి యున్నది నాకుఁ గూఁతురు.

గిర — నీవు నా జనులనుఁ గొట్టెదవు: నీ లాఱుమాఱు మూఁక పనిఁ గొని మెడరు తమకంటె మేలు వారిని.

(ప్రవేశము, ధవళవస్త్రుఁడు.)

ప్రళ — తెలివికాల్ల, వాసిది, ఎవఁడు సమయము మించిన వెనుక చింతించునో—(ధవకు) ఓయి, బాబు, వచ్చినా

వంట వయ్యా? నీ సమ్మతేనా యిది? మాట్లాడు మోయి, నా గుఱ్ఱముల సిద్ధము సేయుఁడు కృతఘ్నతా, ఓ రాతి మనసు దయ్యమా, అతి ఘోరాకారమా, మున్నీటి రక్కసు కంటెను, కన్న బిడ్డయందు నీవు కనుపట్టు నప్పుడు!

ధవ.—దయఁ జూపుఁడు, మహాప్రభో, క్షమియింపుఁడు.

ప్రళ.—(గరకు) బలు రోఁతగద్దా! నీవు కాడ బొంకిన దానవే: నా పరివారము లందఱు నతి శ్రేష్ఠ పురుషులె, అత్యపూర్వ సుగుణ గరిష్ఠులె, సమస్త ధర్మ సూక్ష్మములు నెఱింగిన విధికోవిదులె, అతి సూక్ష్మతర శ్రద్ధతో తమ నామశ్లాఘ్యతను రక్షించికొనువారలే అహా. అత్యల్పదోషమా, ఎంత యవలక్షణముగ నగుపడితివే యమృతహృదయయందు! చిత్రహింసన యంత్రంబుఁ బోలె నా యథార్థ స్వభావమును దాని దృఢబంధముల నుండి పెలిపెట్టి నులిమి పీఁకివేసితివి, నా హృదయము లోని యద్మిలి నంతఁ జప్పరించి, దానిని చేఁదువిసముతో నిండించితివే. ఓరి ప్రళయాంతక, ప్రళయాంతక, ప్రళయాంతకా! కొట్టికొనుమ యీ మట్టి గుమ్మము పైని. (తల మొత్తికొనును) నీ మాధ్యమునుఁ జోర నిచ్చి నీ కాల

లేని జ్ఞానమును వెళ్లఁ గొట్టినది! అరుగుఁడు, అరుగుఁడు, నా జనులార,

ధవ.—మహాప్రభో, నే నిరపరాధిని, నే నెఱుంగను ఏమి కారణమో తమర్ని నిట్లు ప్రేరేపింపఁ జేసినది.

ప్రళ—అట్లు లే కావచ్చు సామంతుఁడ, వినుమో ప్రకృతీ, వినుము; ప్రియదేవతా, వినుము! ఆఁపివేయుము నీ యత్నమును, నీ కుద్దేశ ముండిన నీ పశువును శిశుసం తము చేయను! దీని గర్భమునందు గొడ్డు తనమునుఁ ద్రుక్కించుము! వృద్ధి కరణములను దానిలోనే యింకఁ గొట్టుము; దీని యపయశస్కర శరీరమునుండి యెప్ప టికినిఁ బుట్ట వలదు చంటి పాపఁడైనను దీనికి యశ ముప్ప తిల్ల! ఇది పిల్లలఁ బెట్టనే వలసి యుండెనా, మహా ద్వేషంపు సంతతిం బడయింపుము; చిరకాలము జీవించి దీని కష్టంబు ల్గావించుచు నానుర రీతిని దీనికి నిత్యాశల్య ముగ యాతనలుఁ బెట్టు నట్లు! దీని జవ్వని మొగము నందు పెన్ముడుతల ముద్రించుత నా పట్టియు; కన్నీటి పాటులతో దీని కపోలములయందు కాలువలు త్రో యించుతు. మార్చివేయని తన మాతృ శ్రమముల నుప కారములను అవమానపు నగుపాట్లకు; ఆ రీతిని ఇది

యనుభవించుగాఁ దెలిసికొని యెంత యెక్కుడు వాఁడి మయినదో పాముకో అకంటెను నొక మేలు మఱచిన బుడుత. వెళ్లెఁడు, వెళ్లెఁడు! (నిష్క్రమించు.)

ధవ — హాహాహా! మా ప్రెముక్కాఁడు నిల వేల్పుల, ఎట్టిఁ బుట్టెనో యియ్యది?

గిర — నీవేమియు బాధపడవలదు దీనికి హేతువుం దెలిసికొన; మఱి పోనిమ్మతనిగుణము పాష్యాడి పోకిళ్లంతయు నతని ముష్కు తనంపు మతిహీనతకుఁ జిత్తము వచ్చినట్లు.

పునఃప్రవేశము, ప్రళయాంతకరాజు.

ప్రళ — ఏమిటి, నా పాటివాఁడిలో నేఁబండ్రనా యొక్క యేటున! అదియు నొక పశువులోనే!

ధవ. — ఏమి సంగతంపు, మహాప్రభో?

ప్రళ. — నేఁ జెప్పెద నీకు: (గిర కు.) జీవముం మరణమా! కడు లజ్జతుఁ జైనాఁడ నీకు శక్తి యున్నందునకు, ఱ మ్మయి నా పౌరుషంబునుఁ గదల్పను; నావలనం బలి మినిం బొంగి విడివడు నీ యుష్ణబాష్పము ఓ నీవంటి దౌర్భాగ్యురాలి న్నిమిత్తీకరించం గదా యని. పెను గాలులుం బొగ మంచులు నీ్నిపైఁ గవించను! పితృశా పపు మాన్పరాని గాయములు నీ యొక్కొక్క యిఁద్రి

బాణ.—మామయ ప్రళయాంతక, మామయ ప్రళయాంతక,
నిలువు మోయి, విదూషకుని వెంటఁ బెట్టుక పొమ్మోయి.

కొంక నక్కయు, నది పట్టు వడిన
కూఁతు రోర్తను, రహి నిట్టిదయిన
శంక యక్కజ, లే దురిదీసిన
కొండె కుళ్ళాయి కొక్క యురిత్రాఁడు దొరకిన
క్షంకేమి పలయు విదూషకుఁడు వెనువెంబడే.

(నిష్క్రమించు.)

౧.ర —ఈతకానికి మంచి మంత్రమే యిచ్చినదాన —మూర్వురు జోదులే! బలుతంత్రమిది, బలుకాపుగడ, యీతని నుంచుకో నిచ్చుట యాయితులై మూర్వురఁ జోదుల: జౌర, ఏ కల కన్నప్పుడెల్ల, ఏ గుసగుసలు విన్నను, ఏ తోఁపు తోఁచినను, ఏ మొజపాటు, ఏ యనిష్టము పుట్టినను, వీఁడు కాచికొనుటా, తన ముప్పు తబ్బిబ్బులను వారి బలములతో? అప్పుడు మన ప్రాణము లీ మొఱకు ముసలి వసమున నిమిడియుండుటా. వసుపాలుఁడ, ఓరోయి!

ధవ.—మంచిదె, కానినీ వనగత్యభయాక్రాంతవు కావచ్చు.

గర —ఇదుకాఁపగు, ననగత్య విశ్వాసము కంటెను. ఎప్పుడు ష్మం దొలగించు కొందుఁగాక నే శంకించు పీడల, నెప్పు

డును భయరహితరాలై యుండుఁగాక యెట్టి విపత్తముల వలనను సేమముపాటుఁ బడయక : నాకుఁ దెలియును లెమ్మాతని యుల్లము అతఁ డెద్దాని వాక్రుచ్చెనో వ్రాసినాను నా చెలియలికి! ఆతని, నాతని నూర్వుర జోదుల నాబిడ సంరక్షించిన, నట్టి యనౌచిత్యము నేను విస రించి యుండఁగ,—

పునః ప్రవేశము వసుపాలుఁడు.

ఏమిరో యిపుడు, వసుపాలుఁడ! ఏమిటి, ఆ యుత్తరమును నా చెలియలికి వ్రాసినాఁడవా?

వసు —చిత్తము, అమ్మయ.

గర —వెంటఁ బెట్టుకొమ్ము, కొందఱి నాత్మ సంరక్షణార్థము, ఝడితిని వెళ్లుము జవాశ్వమెక్కి : వివరింపు మాపె కాద్యంతము నా ముఖ్యమయిన భయమును; మఱియద్దానికి నీ వుచుఁ గలుపుము స్వకల్పిత హేతువులను దాని నిబ్బడింతలు దృఢపఱుపఁదగుపాటి వానిని, పోసద వేగిర; మఱి నీ తిరుగుదలం ద్వరిత పఱుపుము, (నిష్క్రమించు వసుపాలుఁడు) అబ్బబ్బ, పనికిరాదు, ప్రాణనాథ, యీ నీ పాలమెత్తని చిత్తంబును నే నిందించు దాననుఁ గాను కాని, నను మన్నించు వాఁడవైనఁ జెప్పెద వినుము, తెలివి తక్కువ

తనమునకు నీ బడయు నపదూఱుఁబోలె, ఆత్మహాఁకర మగు శాంతాత్మతకుఁ బోకడ్డ యంత రాఁజాలదు.

ధవ — ఎంతదవ్వు నీ కను లాగామి నూడఁ జూచునో నే ను పవగేసు: కాని యింత మాత్రము గట్టి: బాగున్న దాని మఱి బాగుసేయఁ బోయి యున్న బాగును తఱు చుగఁ బాడుఁ జేసి కొందుము.

గర — అబ్బబ్బ, మఱి—

ధవ — మంచిది, కానిమ్ము; ఫలము తెలుపు

రంగము V దానియెదుటనే, మురిగిరి ప్రవేశము,

ప్రళయాంతకరాజు, హితకీర్తి, బాణభణితలు.

ప్రళ— వెళ్లుమో నీవు ముమ్మందు గుళస్థానమునకుఁ బట్టాక యీ యుత్తరములు. నా కుమార్తెకుఁ దెలుపకుము మఱి దేవి నీ వెఱింగినది, ఆపె యీ యుత్తరముఁ జూచి యడుగు నట్టిది తప్ప. నీ చుఱుకుఁ దనమునకు చుఱుకు లేనిచో, నేనే నీకు ముందుఁగ నచ్చట నుండెద

హిత — నిదుర నొల్లను, మహాప్రభో, నీ యుత్తరమును నప్పఁజెప్పువఱకుకు. (నిష్క్రమించు.)

బాణ — ఒకని మెదడు వాని కాళ్ల మడమల నుండిన, దాని కపాయము రాదు కాళ్ల పగుళ్లవలన?

ప్ర.—ఔర, కుఱ్ఱఁడా.

అట్టియన బంతి లేదు, నా మాట విని, యల్లాఁ ముగ నుండుము; నీ తెలి విన్నఁడు చెప్పలు ద్రాక్షి నమువదుతె.

ప్రశ.—హో, హో, హా!

బాణ.—మాటదవు లెమ్ము, ఆ మరుసటి కొమ్మఁత నకు ప్రీతి తోఁ గైంకర్యము సేయుట: ఏలంటివు, దీనికిం దానికిఁ బులికేఁగు నింద్రకాయల సామ్యమయినను, చేసితో యనఁగలను, నే ననగలఁ దానిని.

ప్ర.—ఏలనోయి, ఏమనఁగలవుర నీవు, పిల్లఁడా!

బాణ.—అదియు నిట్టి రసికురాలె, పులికేఁగుం బులికేఁగు బోలె. నీవు చెప్పఁగలవా యెంమనకో మన ముక్కు మన ముఖము నమునుండుట?

ప్ర.—లేను.

బాణ.—ఏల, మన కన్నుల మన ముక్కునకుఁ జెఱి యొక చెంపనుండుట కొఱకే; దేనినయి తే యొకఁడు ముక్కుతోఁ మూర్కొని తెలిసికొనలేఁడో, దాని కనులతోఁ జూచి తెలిసికొనుటకు.

ప్ర—దానికి నేను కీడొనర్చితి—

భాణ—చెప్పఁగలవె, ముత్యపుచేప యేలాగుఁ దన గుల్లను జేసికొనునో?

ప్రళ—లేను.

భాణ.—నేనుఁ జెప్పలేను; కాని నేఁజెప్పఁగల నత్తకిల్లెందునకో.

ప్రళ—ఎందునకు?

భాణ—ఎందునకా, తన తలను గాపాడుకొనుటకు, తన కూఁతులకు బంచిపెట్టి, తన కొమ్మునకు బసలేక చచ్చుటకుఁ గాదు.

ప్రళ.—నా నైజమును మఱచెద అంతటి నెయ్యంపుతండ్రిని! నా గుఱ్ఱము లాయితము లయినవా?

భాణ.—నీ గాడిదలు వెళ్లియున్నవి వానిపట్లకు. సప్తఋషులు నేల సప్తఋషులేనో, పెచ్చుకాని దానికిఁ గారణ మేమో, యది సొగసు కారణము.

ప్ర—ఎనిమిది కానందున నేనా?

భాణ.—ఔను, సత్యము; భళి, నీవుమంచి విదూషకుఁడవుగా నుండగలవు.

ప్రళ.—తిరుగ బలాత్కారముగ నపహరించుటా! పిశాచపు కృతఘ్నత!

బాణ.—నా విదూషకునిఁగా నుంటివా, మా మయ్యా, నిన్ను బాగుగ బాఁధించియుందును నీ కాలమునకు మునుపు నీవు ముసలి యయినందునకు.

ప్ర.—అదేలాగురా?

బాణ.—తెలివిఁ దెచ్చికొనేవఱకు నీవు ముసలివాఁడవు కాకుండవలయు.

ప్రళ.—ఓరబ్బ, నే వెఱ్ఱిని కాకుండుత, వెఱ్ఱిని కాకుండుత, అమృతంపు టమరులారా! నన్ను స్వాధీనచిత్తునిఁగఁ గావుఁడు: వెఱ్ఱిని కా నోర్వజాల!

[ప్రవేశము, ఒకసుజనుఁడు.]

ఏమోయి! గుఱ్ఱము లాయితము లైనవా?

సుజ.—సిద్ధము, మహాప్రభో.

ప్రళ.—రావోయి, పిల్లఁడ. (నిష్క్రమింతురు)



# అమృతహృదయ

లేక

# ప్రళయాంతకరాజు.

---

## ద్వితీయాంకము.

### రంగము 1. గుస్థాన సామంతుని కోట.

దుష్ట.— దేవుఁడు బ్రోవుత నిను, సూరనా.

సూర.— తమ్ముఁడు, నయ్యా. తమ తండ్రిగారియొద్ద నుంటిని, మఱి వారికిఁ దెలియఁజేసితి, కోణపాలక సామంతుఁడును రజనీచరి యాతని సీమాటియు ఇచ్చట నీ రేయి ఆయన తోఁ గడఁపుదురని.

దుష్ట.— దాని కత మేమి?

సూర.— ఏమో యెఱుంగను, తమరు వినియే యుందురు, వ్యాపించెడు వర్తమానము: అనఁగా, గుసగుస నానుడులే యలన నింక నవి చెవి ముట్టెడు మాటలేను.

మష్ట.—నే నెఱుఁగ: నేఁడెడ చెప్పుము, ఏమో యవి?

సూర.—తమకేమి వినలేదా, యుద్ధములు సిద్ధములగుచున్నవని, కోణపాలక ధవళవస్త్ర పట్టవర్ధనులకు?

మష్ట.—మహాశయ వినలేదు.

సూర.—వినవచ్చెడిని, తెలియు, కాలక్రమమున. శుభమస్తు, దేవర! (నిష్క్రమించు)

దుష్ట—పట్టవర్ధనుఁ డిక్కడనుండెడివాఁడా యీ రాత్రి? మఱి బాగాయె! మిక్కిలియు బాగు! ఇదియు నా ప్రయోగములో ఒకిమిఁ జొచ్చిల్లుచున్నది. నా యబ్బ నా యన్నను బట్టుకొనుటకు కొలచుట్టును కాఁపుదల నమర్చె నాఁడు; అయితే నాకొక్క సంగతియున్నది, యొక్క సూక్ష్మాంశము, దీనిని నేనే జరిపించుకొనవలయు: శీఘ్ర భాగ్యములార, నా మేలునుఁ గూర్పుఁడు! అన్నయ్యా ఒక్కమాట; దిగిరమ్ము; అన్నయ్యా, ఓయి, యంటెను!

ప్రవేశము ప్రేమసింహుఁడు

నా నాయన కావలిఁ జూచుచున్నాఁడు; ఓయి బాబు, ఈ చోటుఁ బాసిపరుగెత్తుము; సమాచార మందిపోయినది నీ వెచ్చట దాఁగఁబడి యున్నావని, నీ కిప్పుడు రేపూఁటప్ర సదుపాయము నున్నది: కోణపాలక పట్టవర్ధనునకు విరుద్ధ

నుగ దూఱు లాడినాఁడు ప్రకాశా' అనుచు నిప్పుడును వచ్చు
చున్నాఁడు, ఇప్పుడే, ఈ రేపూఁటనే, పెనువేగముతో, రాజ
నీచరియు నాయన వెంబడి. నీ వేమియుఁ జెప్పలేదా ? పసోదర
పట్టబద్ధునకు విరోధముగ నాతఁడు చేసియుండు కష్టములఁ :
బాగుగ జ్ఞాపకముఁ జేసికొమ్ము.

ప్రేమ — అందు నాకు నిశ్చయమేల, ఒకవార్తయు లేదు.

దుష్ట — నా నాయన రాకజాడ వినుచున్నాఁడ : మన్నిం
పుము నన్ను ; నెపమునకు నీ పైని నా కత్తిని దూయ
వలయు. నీవును దూయుము ; నిన్ను గీఁగాచినాన్న
కనుఁబడు, నీ పక్షమునుఁ బూనికతో రక్షించుకొన్న
ట్లగుపడు (బిగ్గర) లోఁబడుము ; రమ్ము నా నాయన
సమ్ముఖమ్మునకు. వెలుఁతురు, ఎవరోయి, ఇక్కడ ! (చెవి
లో ) పాఱిపో, అన్నయ. (బిగ్గర ) కాగడాలు, దివ్వటీలు !
(చెవిలో.) మంచిది, పోయిరమ్ము (నిష్క్రమించును ప్రేమ)
నానుండి తీసిన కొంచెము నెత్తురు నమ్మకమును బుట్టించు
(తనచేతిని గాయముఁ జేసికొనును) నేను ఇనుమిక్కిలి యావే
శముతో సాహసించితి ననిః నే జూచినాఁడఁ ద్రావుపోతు
లింతకంటె నెచ్చుఁజేయు వట్టి చెఱఁగాటకు. నాయనా,
నాయనా! నిలువు, నిలువు ! సాయము లేదా ?

ప్రవేశము, ప్రియవ్రతుఁడును సేవకులును కాగడాలతో,

ప్రియ —నీవు, దుష్టబుద్ధి, ఎచ్చటరా యా ద్రోహి!

పుష్ట —ఇచ్చటనే నిలచి నాతఁడు కటికి చీఁకటిని, అతని నాఁడీవాలు జూసి, దుష్టమంత్రముల గొణఁగుచు, చంద్రు నభిమంత్రించుచుఁ దనకు శుభము ననుగ్రహింప వేఁడుచు,—

ప్రియ —ఉండని, యెక్కడవాఁడు?

పుష్ట.—చూడు, బాబు, నెత్తురెట్లుఁ గాఱుచున్నదో.

ప్రియ.—ఎక్కడరా యా ద్రోహి ప్రవేశింపఁబడు?

పుష్ట —పాఱిపోయె, బాబూ, యిత్తెరువున (తన్వాగ్రోప చూపును.) ఎప్పుడైతే యే యుపాయమునను నతఁడు శక్తుఁడు

ప్రియ —తఱుముఁడాతని, నహా! వెంబడించుఁడు (నిష్క్రమింతురు కొందఱు సేవకులు.) ఏ యుపాయమునను నేమిటి?

పుష్ట.—శక్తుఁడు కాకపోయెనో తమ సన్నిధానమును సంహరింప నొప్పియకొనుటకు; మఱి నే నెప్పుడైతే చెప్పితినో యతనికి, దుష్టనిగ్రహులకు దానవారులు పితృఘాతకులపైఁ దమ రక్షితముల నెల్ల ప్రేరించెదరని; వివరింపఁగనే యెట్టి బహుగుణ బలిష్ఠ బంధముతోఁ బుత్రుఁడు తండ్రితో నియంత్రితుఁడో యని, బాబయ్యా, సంగ్రహముఁగ, చూడఁగనే యతఁడు నే నెంతటి విద్వేషముతో నతని

రాక్షస విజయమును నిరోధించెదనో యని. కడు ప్రచా
వేగముతో నతని దూసిన కరవాలంబుతో వాని యుదర
శరీరమును దన యావచ్ఛక్తిని గూర్చిపోవ త్రొక్కుడు
నా చేతిని గాయముం జేసినాడు కాని, పూర్ణ ప్రబుద్ధ
స్థైర్య శౌర్యాదులతో, నీ యుద్ధప్రసక్తతుజ్ఞ సాహసంబు
వర్ధిల నే నతని మార్గాన సిద్ధపు నాద్ధతిం జూచితో.
లేక నేఁజేసిన ఘోషంబున భీషణంబౌదియో, ఒట్టిజాలి
యురవడితో పలాయితుండయ్యె

ప్రియ —పరుగెత్తినవాఁడు బహు దూరమునకు: ఈ భూమి
యందుండలేఁ డతఁ డెన్నఁడైనఁ బట్టువడక, పట్టువడిన
నా—పరిమార్పు మహా ఘనుఁడు పట్ట భద్రుఁడు మా
యధీశ్వరుఁడు, నాదు పూజ్యుఁడౌ నాయకుండును బోష
కుండు, వచ్చు నీ రాత్రి, ఆయన యాజ్ఞఁగాఁ బ్రకట
నంబుఁ జేసెద, నెవ్వండాతని వెదకిపట్టునో, యా ఘాతక
దురాత్ముని దహాన స్థానంబునకు సమర్పణంబు సేయునో.
యతండు మాకుఁ గృతజ్ఞతాపాత్రుఁడు, ఎవ్వం డతనిఁ
దాఁచి యుంచునో యతఁడు వధాపాత్రుఁడు నగునని.

దుష్ట —వాని దురుద్దేశంబును మాన్పింప నే ప్రత్యాదేశంబు
జేసియు, నతఁడు తన నిశ్చిత దుష్కర్మమున దృఢవ్రతుఁడై

యుండఁజూచి, పరమసుప్రభాషితంబుల వలని కుట్రల మాయలు పెట్టెద నని భయముఁ జూపితి; ప్రతివచనం బిచ్చెదఁగా, ఇటు, ఓరి యదార్థవాదుఁడా కాలకేయుఁడా! తలఁచెదవా నీవు, నిను మార్కొని నే నిలచిన, నీయందు ప్రీతి యుంచుట కాని, నీయం దేదైనను సద్గుణమో మహత్త్వమో కలదని విశ్వసించుట కాని, నీ మాటల విశ్వా సార్హంబుగా భావించనని? కానేరదు: కాదని నే సాధింపఁ బోవుదానిని—ఏలన నే సాధింపనే సాధింతుగా, నిక్కమిది, నీవు నా సొంత దస్తూరినినే వెల్లడించినను—నా సన్నిధి నుండి త్రిప్పివేయఁ గలను, నీ సూచన యని, యోచన యని, పాపిష్ఠి ప్రయోగంబని: అప్పుడు నీ వీలోకమంత టిని మందబుద్ధులం గావింపవలసి యుండు, వారూహింప కని యెడల, నా మరణము వలని లాభములు అతిబలిష్ఠ ప్రేరేపణములును ప్రోత్సాహన కారణ గర్భితములును గనుటంబట్టి, యట్టి నా మరణమును సంపాదింప నిన్నుఁ బురికొల్పెనని.'

శ్రీయు —విపరీతుఁడా కటికి గుండెల మహా పాతకుండ! తన యుత్తరమునే తనది కాదని సాధించునా? నాకుఁ బుట్టిన వాఁడు కానే కాఁడు. (కాళ్లవాఁగును లోపల.) వినుము పట్ట

వర్ధను కాహాసులు! కారణము తెలియదు ఆయన యాగ
మనమునకు. కడలి దేవులన్నింటికిం గట్టివేయించెద; ఈ
పాతకుండు తప్పించుకొనఁ జాలఁడు, పట్టభద్రుఁడు నా
కా వరం బీవలె; అంతియకాదు, అతని చిత్తరువ్రుఁ బం
పించెద దర్పణము దగ్గరకు, రాష్ట్రజనులందఱు నతని
గుఱుతు పట్టుకురు గాక, మఱి నా భూమికిఁ, బిత్రు
భక్తిఁ డా నో సహజ బాలుఁడ, నిన్ను దిక్కపాత్రుఁ జేయు
నుపాయములం బన్నెద

ప్రవేశము, కోణపాలకుఁడు, రజనీచరి, పరిచరులు.

కోణ——సుఖమా, అస్మ దార్య మిత్రమా! ఇచ్చటికి నే
వచ్చిన పిదప, నన గనిప్పుడే యనవలయు, విచిత్ర
వార్తలు విన్నవాఁడను.

రజ——అది నిజమేయయిన అయ్యపరాధికి విధింపఁగల రాజ
దండన యెంతైనఁ గొంతయే యగు. ఎట్లున్నారు,
ప్రెగ్గడలవారు?

ప్రియ.——ఓయి, మాతాంబగారు, నా వృద్ధహృదయంబు
భగ్నమై పోయినది, భగ్నమై పోయినది!

రజ.——ఏమిటీ, నా బాబుగారి జ్ఞానపుత్రుఁడు నీ ప్రాణమును

నేమకెనా? ఆవ్వాఁడు, మా నాయనగారు నామకర ణము జేసినవాఁడె? నీ యస్మిలి ప్రేమసింపఁడే?

ప్రియ.—అమ్మయో, దొరసాని, దొరసానమ్మగారు, ఆ యవ మానము నేమందును, దాఁపవలెను గాని!

రజ.—మా నాయనగారి పారివాంద్రగు జగడగొండి జో దులతోఁ గలిసి మెలఁగుచున్నవాఁడు కాఁడు?

ప్రియ.—తెలియదమ్మ నాకు కడుదుర్భరము, చెడు దుర్భర మమ్మ.

దుష్ట.—ఔను, మాలాంబగారు, ఆ సహవాసములోని వాఁడే.

రజ.—విచిత్ర మేమున్నది మఱి, యతనికి ద్రోహచింత పుట్టి నది వారలె కావలయు, నీ ముసలివాని మరణమునకై యా తనిం బురికొల్పినారలు, యీతని నేల వచ్చుబళ్లను దూఁ బఱచిండుటకై పాడుసేయించుట కొఱకు ఈ నేటి మా పటనే మా యక్కయవలన వృత్తాంతమంతయు తేఁట తెల్లమిని వారి యసభ్యతను గుఱించి, మఱి యిటువంటి మున్నెచ్చరికలతోఁ గూడ, నేమన్న, వారలు నా యింట నిలుచుటకు రాఁగలిగిన నే నచట నుండఁగూడదని.

కోణ.—నేను నుండను, నమ్ముము నా మాటను, రజని. దుష్ట

బుద్ధి, నే విన్నాఁడను, నీ తండ్రికి సూచిత వరి ధర్మపుత్రా ధర్మము.

దుష్ట.—కుమారధర్మము కాకుండెడి, దేవర, కేవలము, ?

ప్రియ —అతఁడే బయలు పెట్టె వలెను ప్రయోగమును: మఱి విడినాఁ న్యాయముఁ జూచుఁడీరు, వానిఁబట్టుకొను టకుఁ బ్రయత్నింపఁగ.

శోణ —వెంటఁ బాఱియున్నారా యెవరైనను బట్టుకొనఁ వానిని ?

ప్రియ —చిత్తము, మహాప్రభో.

శోణ —పట్టుబడిన, వాఁడిక నేమి కీడు సేయు భయముండదు. నీ యిష్టానుసారము నిర్ణయించికొనుము, నా యధికార బలాదులన్నియు నీ చేతివి యని యెంచికొనుము ఇంక నీ పనియేమన్న, దుష్టబుద్ధి, నీ సుగుణము నీ వినయమును నీ కుణమున నే యింత స్తుతి పాత్రమగుటను, నీవు పేట నుండి మా వాఁడవు కమ్ము: ఇట్టివంటి యగాధ విశ్వాస మున కర్హ నైజంపువారు మా కత్యంత యగత్యులు: కాన నిన్ను మేము పట్టుకొనియెదము.

దుష్ట —సేవఁ జేసెద, స్వామి, తమకు, సత్యము తప్పక, తక్కిన కొఱంత లెట్లున్నను.

ప్రేమ.—అతని నిమిత్తము, కృతజ్ఞుఁడను సన్నిధానంబునకు.

కోశా.—నాకుఁ దెలియదు, మేమెందునకు వచ్చితిమో నీ దర్శనంబునకు—

ప్రే.—అమ్మాయి, వేళపాళము లేక, గ్రుడ్డికంటి రేయికి దారము గ్రుచ్చుచు (నూదినాటు చీఁకటిని మెల్లమెల్లఁగఁ గ్రాకుచు); అన్య ప్రియవ్రత, ఘనహేతు పూర్వక యవసరములు పుట్టినవి; యింక నీయొక్క మంత్రసహాయముఁ బడసి నడపవలసి యున్నది మా నాయనగారు వ్రాసినా లేఖపత్రికఁ, మా యక్కయ్యయు వ్రాసిన దొంగ పత్రికఁ, దమలోఁ బట్టిన వేఱుములంబట్టి; వీనికి మాఱుమాట, మా యింటికి దవ్వుననుండి వ్రాయుట మిక్కిలియు మేలని నా మనంబునఁ దోఁచె. ఆయా నాయకగారులు వేచుచున్నారిచటనుండి పంపుటకు. మా మంచి ప్రాణవతి, నీయుల్లంబు నోదార్చుకొనుము, మఱి యొకసంగము నీవ యీవలసిన యేకత మీ మా కర్జము గనుక నీ మాటచొప్పున నీ నిముసమునందే మా పని జరిపింపవలసి యున్నది.

ప్రియ.—దాసాను దాసుండను, మాతాంబః పలిన వా రిద్దఱికిని మనఃపూర్వక స్వాగతంబు. (నిష్క్రమింతురు.)

రంగము II ప్రియవ్రతుని కోట ముందట.

(ప్రవేశము. హితకీర్తియు వసుపాలుఁడును వేఱువేఱుగ

వసు —నమస్సు నీకు, సుమిత్రమ! ఈ యింటివాఁడవే?

హిత.—ఔను

వసు —ఎక్కడ నుంచివచ్చు మా గుఱ్ఱముల?

హిత —అమసులోన.

వసు.—వేఁడెద, నేస్తముండిన, జెప్పుము నాకు.

హిత —నేస్తము లేమ నీ పయి

వసు —పోనీ, అట్లయిన, సక్షసేయను విన్నను.

హిత —పెదవ్రాఁడి కంపకోటలో దిన్నే నిలిచి కించిఁ నప్రాఁక
నన్ను సక్ష సేయఁ జేతులే.

వసు —ఏలనయ్యా నన్నిటు లాడుదువు? నే నెఱుంగనే నిను.

హిత —ఓరి, నే నెఱుంగుదురా నిను.

వసు —ఏమని నన్నెఱుంగుదువు?

హిత —దొంగవు: పోకిరివి; జూదరివి; ఎంగిలి తిండివి;
నీచవు, పసికిమాలిన, బిఱ్ఱ బిగువు, బింకాలపోతు, కౌలివి
తక్కువ, బికిరాలమాఁడి, గోఁచిగుడ్డల, పుట్టు పేదటక,
అడ్డగ బత్తెపు, ముఱికి మూఁతి, చింపిరి చెప్పుల కైలాట
కొఁడవు, కలువకాఁదివు, తగవుల మాఁరి టకటంకవు,

అద్దపు నీటుల, జోలిమాలిన పనుల, పిలువని పేరంట
ముల, పిచ్చిగాండ్ల పెక్కలి కాండవు; ఒంటి కక్కసాల
కొంపముంచు యముపంప బొంగసీండ ; ఈ నీతగు బిరుదుల నొక్క
చిన్న యక్కరమునకైన నద్దంకి యాడితివా చెప్పుదెబ్బల
నాకేతం దినుచుం గూండరాగములం గూంతలు వెట్టుచుం
ఒలవరించు పిచ్చికి ఖూళుండవు.

వసు — శేశేశే, ఎట్టి రాకాసి పలువవురా నీవు, ఇట్టి యసం
గతాలుం గూకరించుచు చీకాకు పెట్టెదవు, నీ మోర
తెలియని నన్ను నా మర్యాదయు నీకుం దెలియకుండంగ!

చిత్ర — ఎంతటి సిగ్గుమాలిన మొండికట్టె తులువవుర నీవు,
నన్నెఱుంగ నని బొంకుటకు! కొంతనాళ్లైనం గా లేను
గా దంటరా, నీ కాళ్లు వాడిక్కొట్టి, రాజుగారెదుటం దెగం
దన్ని నేను? దూయుమురా ఓరి మాయలమారి; ఇంత
రాత్రి యైనను, నెల వెలుంగుచున్నది; నిన్ను పిసికి
పిండి వంటం జేసెద నీ వెన్నెల తోడుత; దూయుమురా,
ఓరి నీచపు మంగి వేసాల దొరకోలు సన్నాసి, దూ
యురా, దూయు! పేడిమీసపు మిడి గ్రుడ్ల పోతా

(దూయును కత్తిని.)

వసు — పోపో! నీతో నాకేమి జోలి లేదు పో.

హిత —మాయు రా, ఓరి జోకీరి, రాజుగారి కడ్డముగ జాబులు తెచ్చినాఁడవు; ఆ పడికిమాలిన కీలుబొమ్మ మాటను మోసికొని వచ్చినాఁడవు, దాని కన్న తండ్రి యొక్క రాచఱికమును దిగఁ ద్రొక్కుచు మాయు ముర్రా, ఓరి మాయదారి; రా రమ్ము చూతు మొకచెయి.

వసు —సాయము, హెూ! హత్య, హత్య! సాయము!

హిత —కొట్టు, ఓరి వరవుఁడ, నిలువ, దొంగఁడ, నిలుము, ఓరి నీటు గుండఁడ, కొట్టు. (వానిఁగొట్టును.)

వసు —సాయము, సాయము, కో—హెూ—హెూ, హత్యా, హత్య!

ప్రవేశము, దూసిన కటారితో, దుష్టబుద్ధి; కోణవాలక, రజనీచరి, గుళస్థానుఁడు, సేవకులును.

దుష్ట.—ఏమిటది! ఏమి నడవడి? (వారి విడఁదీయును.)

హిత.—కానిమ్ము, నీతో, ముద్దుల బుడుతఁడ, ఇష్టముండిన; రమ్ము, నీకు పెట్టెద నెఱచి (కయ్యవు చవి చూపెద), రా రమ్ము చిన్ని కొమరుఁడ.

ప్రియ.—ఆయుధములు! సాధనములు! ఏమి వివాద మిక్కడ!

కోణ —శాంతింపుఁడు, ప్రాణముల కాశించిన; చచ్చును వాఁడు, మరల సేయువాఁడు. ఏమి వర్తమానము?

హేమ. దఱిమి కొట్టుము నీ యింటికిఁ గిచకిచ నూయుచుఁ బోవంగ,

కోణ.—ఏమిటిరా, నీకు పిచ్చిపట్టి యున్నదా, ముసలి కొడుక?

ప్రియు.—మీ కేల్లఁ బుట్టె కలఁత? అది చెప్పుముందు

హిత.—ఏ ద్వంద్వములకును నింత పగ యుండ నేరదు, నాకును నీ జిత్తులమారికి నుండు నట్లు.

కోణ.—వాని నేల పిలిచెదవు జిత్తుల మారి యని? ఏమి వాని నేరము?

హిత.—అతని మొగ చూపు నా కింపు కొలుపదు

కోణ.—అంతకంటె మెప్పు కాదు కాఁబోలు, నా మొగము, లేక యీ వాని దేని, మఱి యామె దేని,

హిత.—బాబు, నా పని యేమన్నఁ, గలరూపు చెప్పుట విషము, నా కాలములోఁ జూచినాఁడ నెన్నెన్నో మేలు మేలు మొగముల, నిప్పుడు ఈ నిముసమున నా యెదుట నగుపడు మెడల పై నిలిచి యుండు నే మొగము కన్నను.

కోణ.—వీఁ డెవఁడో టక్కరి వీని నెవరో మొండి మాటలఁ బట్టె పొగడి నందున, వినయము లేని పరుష వేషంబుఁ

హిత —తాము తప్పులు పెట్టు నా సహజ భాషణఁ బోలుఁ గుటయే. నాకుఁ దెలియు, నయ్యా, నేను వ్యాజ స్తుతి సేఁతు కా నని; మిమ్ము నెపుడు మోస పుచ్చనో తేనె మాటలతో, నలవడు తేటఁగ కౌడుకాండే, నేనెమో అట్టి పని చేయు లేను, తమ నిగ్రహము చవిపడి నన్ను మైత్రిఁ జేయు నట్లుఁ బ్రార్థించు భాగ్యంబు నాకుఁ గల్గినను.

కోణ —నీవు వానికిఁ గావించిన నేర మేమి?

పసు —నే నెద్దియుఁ గావింప లేదు: కొం తొక దినముల క్రిందట, నీతని చూచి పలుకు లాలగించి, వీని దొరయగు రాజుగారు నన్నుఁ గొట్టు నంతటి యనుగ్రహముఁ జూపిరి: అప్పు డీతఁ డాతనితోఁ జేరికొని, యాయన నిగ్రహమును ననుమోదించుచు, వెనుక నుండి నా కాళ్లను వారి కొట్టెను; బోరగిల నే పడి యుండఁగ, వీఁడు నన్నుఁ దిట్టుచు, దూఱుచు, వెక్కిరించుచు నతి శౌర్య పౌరుషములఁ దన మీఁద నారోపించి కొనఁగ నే యితఁ డపూర్వాసహాయ వీరులలో నొకఁడుగ గణన కెక్కి రాజుని శ్లాఘనములఁ బడసెఁ, బడమి పైఁ బడి యుండుటం బట్టి యాత్మ సంరక్షణాశక్తుఁడై యున్న

నన్ను, మార్కొనుటకు యత్నించి నందునకు; ఈ
దారుణ వీర కృత్యంబు వలనఁ గంత పట్టిన క్రొవ్వుతోఁ,
బిరుగ నిచటను నా పై దూసినాఁడు.

హిత —ఈ కోఁచ తీ క్రుచ్చు గోర తెగోట నుత్తర కుమా
ర మారీచులను పనికిరాదు, వారి విద్యలలో నీవు ప్రథ
మాక్షరాభ్యాసకులు కావలెను.

కోణ —పట్టుక రా బొంత కొయ్యను! ఓరోరి మొండి
పట్టెల ముదుసలి జూదరి, ఓరి నరపగడ్డప్రదంబుల
మారి నీవు నేర్పెదవు చూడు—

హిత.—బాబు, నేఁ జాను ముసలి నిపుడేమియు నేర్చు
కొనఁజాల; నీ బొండ కొయ్యను నాకని తెప్పింప వలదు:
నే రాజుని భృత్యుఁడ; ఆయన నియోగమున నీ యొద్దికిఁ
బంపఁ బడినాఁడ. అట్టి దూత నగు నన్నుఁ బట్టించు వేని
నీ బొండు కట్టెలో, కను నవమతించిన వాఁ డయ్యెదవు
నా యొడయుని పవిత్రతకు, కను మేర మీఱిన వైరి
యయ్యెదవు నా ప్రభు సమ్ముఖమునకు.

కోణ —పట్టుక రా బొండ కొయ్యను! నా ప్రాణము నా
మానము సాక్షిఁగ, నందు నే వీఁడు కూరెడి నడి పగలు
వఱకును.

రజ.—నడి పగలు వఱకునా! నడిరేయి వఱకును, ప్రాణ నాథ, చాలదు, రే యెల్లను.

హిత.—ఏమమ్మ, తల్లి, నీ నాయనగారి కుక్కయినను, నన్నట్లుఁ జేయరాదే నీవు.

రజ.—ఓయి, నీ వతని బంటు కావున, అట్లనే చేయుదు, మానను.

కోణ.—మా వదినియ వర్ణించి యుండు నదే వన్నె కల వాఁడీ కొంటెకాఁడు. కానిమ్ము, పట్టిక రంపు బొందు కట్టెను. (బొందు ప్రూను తెత్తురు.)

ప్రియ.—నేఁ బ్రార్థించెద దేవర ప్రసాదమును, ఆలాగు తమరు ఆనతియ్య వలదు: ఈతని నేరము గొప్పదే కాని, వీని దేవర లగు రాజ సన్నిధానంబు తగుమాడ్కిని దండించెదరు. ప్రభువులవారు విధించిన నీచ దండన అల్ప స్తేయములకును, సతి సామాన్య యతిక్రమణములకును, మహా నీచతములు సత్యంతావజ్ఞాతులు నగు దౌర్భాగ్యులకు విధింపఁ బడు నట్టిది: మహారాజులంగారి మనంబునకు మిగులను స్వమానభంగమని తోఁచెడిని, తమ రాయబారి నీ రీతిని నిర్బంధించుట తమ గౌరవమునే తృణీకరించి నట్లు.

కోణ.—అందునకు నే నుత్తరవాది నయ్యెద

రజ.—మా యక్కయ కింతకంటె మనస్సు నొవ్వ వచ్చు, వినెనా యిప్పుడువునఁ దన మశివకానికి దెబ్బలును దిట్టులును బ్రాప్తించె నని యా బిడ పనులయందు శ్రద్ధ వహించి నడచి నందునకు దూర్చుము వాని కాళ్లను.

(హితకీర్తి బొంతంగోనుంపఁ బడును.)

రమ్ము నా ప్రియనాయకా, వెళ్లుదము.

(నిష్క్రమింతు రందఱు లఘు. హిత. లు తప్ప.)

ప్రియ.—నిన్నుఁ బట్టి నేఁ బరితపించెద, మిత్రమా; ఇయ్యది పట్టభద్రుల వారి ప్రసాదము, వీరి మనోభావమునకు అంగు లడ్డులు లేవు, లోకమంతటికి నిది విశదము: మనవిఁ జేసెద నీ కొఱకు.

హిత.—దయయుంచి, వలదు బాబు: ఎక్కుడు జాగరణముం గడిన ప్రయాణముం జేసి నాఁడ: కొంత తడవు నిదురించి బడలికఁ దీర్చికొనియెద; మిగిలిన సేపు ఈల వేయుచుండెద. సత్పురుషునకును దురదృష్టము డాయఁ బోను. సుప్రభాతము నొసంగెద!

ప్రియ.—పట్టభద్రున కిది చెట్టమె యగు: ఈ చేఁత యుతని మాటునకు పాలు సేయు. (నిష్క్రమించు.)

హిత.—రాజభద్ర, ప్రాంత సామెతను స్వానుభవమున మూదలించి కొనవలయుంగా, భగవ దనుగ్రహంబు వలన (తప్పి) భానుని తాపమునం బడదవు అనుం దాసిని! (అనంగ, ఉభయభ్రష్ట ముపరి సన్న్యాసం బని) చేర రమ్ము, ఓ యీ దిగువ గోళపుటాకాశ దీపమా, నీ సుఖ ప్రదము లగు మయూఖముల నీ శేఖవమునుం బరించు కొనియెద! మహా దుఃఖమునకే కాని మఱి దేనికిని మహాద్భుత భాగ్యములు సామాన్యముగ గోచరంబు పడవు: నే నెఱుంగుదు నియ్యది యమృత హృదయ, పంపినదని, ఆ సౌభాగ్యవతికి నా మహా భాగ్యవశమున సమాచార మందినది నా మూఱు వేసపు జీవనమును గుఱించి: ఈ విపరీత స్థితినుండి మా బోంట్రి నష్ట భాగ్యులకుం దగుంబాటి నివారణముల సూపి చేం బట్టి గట్టుం జేర్పం దరుణంబు డాయు. బౌత్రిగ నిదుర రేమిని పూచి పోయుంచు కునుకు కన్నులారం, తరుణ మరసి మూసి కొనుండు, ఈ నా యవమానపు టునికి నవలోకింపకుండు. భాగ్యమా, సుక్షత్రము చిఱునవ్వు నగుమా మఱియు నొక పరి: త్రిప్పుమ నీ చక్రము!

[నిద్రించును.)

## రంగము III ఒక యడవి.

ప్రవేశము ప్రేమసింహుఁడు.

ప్రేమ — నన్నుఁ జాటింపఁగ నే వింటిని; అదృష్టవశమున నగుపడిన యొక చెట్టు తొఱ్ఱు వేఁటనుండి తప్పించుకొంటి ఒక రేవైనను బందు కట్టఁబడి లేదు: ఒక చోటైనను గాన రాము నన్నుఁ బట్టుకొనుటకై కాఁపుదల లేనిదియు, మహా విశేష జాగ్రతతోఁ గూడికొననిదియు. నేఁ బట్టుపడని వఱకును నన్నుఁ గాపాడుకొనియెద: కావున నిట్లు నిశ్చయించుకొన్నాఁడ నత్యంత నీచమును నత్యంత దీనము నగు వేసమెయ్యదో, ఎట్టి వేసమును దారిద్ర్య దేవత మనుష్యుని మృగమునకు దాదాపున సమానముఁ జేసి యవమానించుటకుఁ గల్పించి కనఁబఱచెనో, యట్టి వేసముఁ దాల్చెద; నా ముఖమునకు మురికిఁ బూసికొనియెద; నడుమునకుఁ గంబళ్లు కట్టించుకొనియెద, నా కేశజాలమును పిశాచముల కరణి జడలుగఁ బేడికొనియెద; విగతవస్త్రమగు నా శరీరము ఆకాశ జన్యము మారుతములను తజ్జన్య సమస్త యుపద్రవములను పరాఙ్ముఖంబు చేసెడిని, గ్రామవాసములు నాకు ఋజువు నుదాహరణములుం జూపుచున్నవి, ఇచ్చం వెఱ్ఱి చావళ్ల బికారులు లబలబ రవ్వాలు పెట్టుచు,

తిమ్మిరెక్క కొఱడు పాఱిన దండచేతులం గుంపుసూదులు, ప్రమాకుముళ్లు, మేకులు, రావణ మీసంబులుం గ్రుచ్చి కొనుచు, నీ కీలిని వికృత చేష్టలతో భీదకాంపు లిండ్లను, చిన్న పల్లెలందును, గొప్పాల దొడ్డులందును, పిండి తిరుగలులందును, కొన్ని వేళల వెఱ్ఱివెఱ్ఱిగ శాపములు పెట్టుచు, కొన్ని వేళల బ్రతిమాలికొనుచు, బలవంతపు బిచ్చముల నార్జించుకొని యెదురు దిసమొల వేల్పుగాఁడు! నెత్తి వెంకటాలయు! అదొక్క ఆదరువున్న దింకను; ప్రేమ సింహాసుఁడు సమాప్తిఁ జెంచె. (నిష్క్రమించును.)

---

రంగము IV సుశ్రీస్థానని కోటతోట, హితశ్రీ బొండకొయ్యన.

ప్రవేశము,

ప్రళయాంతక రాజు, శాణభోళితుఁడు, నొక సుజనుండు.

ప్రళ.—విచిత్రముగ నున్నది వాకిళ్లు లేచిపోవుట యింట నుండి, సుఱి పంపకుండుట నా రాయబారిని.

సు.—అయిన పైని తెలియవచ్చు, అటుముందటి కేలిరి ఇష్టఁ జోటుమార్చ వా రాలోచింప లేదని.

హా.—జయము, జయము నీకు, ప్రభువర్యా!

ప్రళ.—ఆహా! ఈ యపమానమును నీకు వినోదముఁ జేసి కొంటివా?

హిత — లేదండు, దేవర.

బాణ. — హా, హా! కటికి పెండెములు కట్టించుకొన్నాఁడు. గాఁడ్రములను పుస్తెలం గట్టుదురు, కుక్కల నెలుఁగులను గొంతులఁ, గోఁతులను గానుల, మనుష్యులను కాళ్లను, ఒక్కఁడు కాళ్లను గ్రొవ్వు మీఱియుండిన, సతనికి మ్రాకు మేకోళ్లఁ దొడిగెదము.

ప్రళ — ఎవఁడు వాఁడు నిన్నిచట నుంచునంత నీ మాన్యత నవమతించిన వాఁడు?

హిత — వారిద్దఱును, అతఁడును, ఆబిడెయు, నీ యల్లుఁడుం గూఁతురున్.

ప్రళ. — కాదు.

హిత — ఔను.

ప్రళ — కాదని నే నంచుండఁగనే

హిత — నే నంచున్నానుగా, ఔనని.

ప్రళ. — కాదు, కాదు, వారట్లు చేయరు.

హిత — ఔను, వారే చేసినారు.

ప్రళ — దివస్పతి సాక్షి, నేఁ బ్రతిజ్ఞఁజేసెద, కానేకాదు.

హిత. — దివస్పతిన్ని సాకిరి, నే నొట్టుపెట్టెద, ఔనే యౌను.

ప్రశ.—వారెట్లు జేయఁ దెగించిరు, చేయనేరరు, చేయ నొల్లరు, ఇయ్యది నరహత్యకంటె యెక్కుడగు, యోచించి యిట్లు జేయుట యింతటి క్రూరప్రయత్నము. వివరించుము నాకు, తగుపాటి ద్వేతముగో, ఏ హేతువున నీవు దీని కర్తృత్వంకళ్లైతివో యీ యపచారమున నను, వారలెట్లు విఘటింప నుద్యమించిరో, ఈ శిశువు, నీవు మా పసుపున వచ్చియుండఁగ.

హిత—రాజేశ్వర, వారికి దేవరవారు వ్రాసిచ్చిన యుత్తరముల వారింట నే ముట్టఁజెప్పినప్పుడు, భయభక్తి పూర్వకముగ మోకరించి యున్న చోటునుండి లేచి నిలుచుమునుపే, వచ్చానచటికి నొక వార్తాహారుఁడు చెమట వడియుచు వేగిరపాటున, సగ మూపిరి పోయి, వగర్చుచుఁ దన యొడయరాలు గరిశన్లి యభివందనముల, తన పత్రముల సమర్పించె, మధ్యనున్నది సడ్డ సేయక, వీనిని వారు లాతిణమున నే చదువుకొనిరి, అందలి విషయములఁ బట్టి, వారు తమ పరివారమును శీఘ్రర రా నాజ్ఞాపించి యప్పుడే గుఱ్ఱము లెక్కికొనిరి; నన్నును వెంట రమ్మని యానతిచ్చి, తము ప్రత్యుత్తరము నకై సమయము వేచి యుండుమనిరి, నాను దాసీనపుం గ్రోకన్నులఁ జూపిరి, అంత నిచ్చట నా కండవ యంచె

కాని నే తలియఁ గన్గఁగ, వీని స్వాగతంబు నా సంచార కారణముఁ గా వికత్థింపఁ జూచి—ఏలినవారి యహాన్న త్యము మొన్నటి దినము బలు పోకిరి తనముతోఁ దిర స్కరించిన యాతఁడే యగుటయు,—వివేకము తక్కువ వీర్య మెక్కువ వాఁడగుట గాన, దూసితి నా కత్తిని: అతఁడును డిగ్గ పడి పిల్లికితనంపు గట్టి మొత్తాలతో నింకి వారిని బెదరఁ గొట్టె. నీ యల్లుఁడుం గూఁతురు నీ నేరము నీ సిగ్గుమాలిన శిష్యుకుం బాత్రముఁ జేసిరి.

బాణ.—హేమంత మింక సమాప్తి నొందలేదు, అడవిబాతు లా మూడిక్కె నెగురుచుండిన;

పేలికలే పుట్టను తాఁ బేద తండ్రుల
పిల్లలగు నారు కంళ్లు లేని కబోదులు,
పేటికలో రొక్కముండఁ బైడి తండ్రుల
పిల్ల ల్సేవ సేతు రిలను మెచ్చఁ బ్రీతిని

పోని కాని, నీ కూఁతులం బట్టి పేఁడాది యంతయు నేడ్చుచు రో జంతయు రోఁజుచు గడియ గడియకుఁ గడు పంత మాఁడఁ గంపవునే.

ప్రళ.—ఓహోహో! ఎంత దుర్భరముగ నీ కూల నాగుండె కెక్కి పొడుచుచున్నది! మూర్ఛాదేవి, దిగుము, ఓసి

ఎక్కుడు దుఃఖమా, నీ స్థానము దిగువఁ గదా! ఎక్కడ ఈ కూఁతురు?

హిత —పట్టభద్రుఁడితోను, బాఁపు, ఈలోపల.

ప్రశి —నా వెంటఁ రావలదు! నిలు మిచ్చుటనే (నిష్క్రమించు)

సుజ —వేఁటేమియు నేరముఁ జేయ లేదు కదా, ఇప్పుడు చెప్పిన దానికంటె?

హిత.—ఎయ్యదియు లేదు ఏమి కారణము రాజుగారు ఇంత స్వల్ప పరివారముతోనే వచ్చుట?

శాణ —నిన్ను బొంకునఁ బెట్టిన నీ ప్రశ్నంబునకు, తగి యుండును దండన.

హిత —ఏలరా, దూషకా?

శాణ —నిన్నుఁ జీమయొద్ద నుంచెడము చదువు నేర్చుకొన; అది నేర్పును లే నీకు, హేమంతములో పని పాటు లేదని. ముక్కు మున్నుంచి నడచు వార లందఱు, గ్రుడ్డివారలు తప్ప, కండ్లు చూపిన త్రోవనఁ గడచువారలు: ముక్కు చూపెన తెరువున నడచు నిరువండ్రల నొక్కఁడైన నుండక పోఁడు గబ్బు మానిసిని మూర్కొనఁ జాలు వాఁడు, పట్టు వదలి వేసెత నొక్క పెద్ద చక్రము కొండ దిగుచు దొరల సాఁగిన; లేక పోయిన నిన్నీడ్చికొనిపోయి; అది నీ మెడపు విఱిచి వేయుచు; కాని, కొండ నెక్కుచు

పోవు నా వెఱ్ఱ మానిసి నిన్నును వెంట లాగికొని పోనిమ్ము.
లౌకిక ప్రాజ్ఞుం డెవండైన నింతకంటె మంచి యోచనం
జెప్పిన, నా యోచనను నాకుం ద్రిరుగం గొట్టుము;
దొంగలు తప్ప వేతెవ్వరు దీని ననుష్ఠించం గూడదని
నా యిష్టము, నేర్పువాండు వెంగలి కావున
స్వార్థము బడయును సాంగిలు పురుషుండు
ఉపాసించు నెవ్వం డుపచారార్థము,
మూట కట్టును ముసురు పట్టంగ, లేచి పోవు
వదలి పెట్టి నినుం బాను గాలివానలో.
కాని నేను నిలచి యుందును; వెంగళే నిలుచును
వెళ్లనిచ్చి దురుసు నడక వివేకిని:
దొంగ యవ్వెడి వెంగలి, పాఱిపోయెనా;
వెంగ లెన్నండు దొంగ కాండు దేవుం డుండంగా.

హిత.—ఎక్కడ నేర్చితివిరా యిది మూఢ కా?

బాణ.—బొంకు కొయ్యన కాదుర మూఢుండా.

ప్రవేశము, ప్రళయాంతకరాజు,

గుళస్థాను నతో.

ప్రళ.—నాతో మాట్లాడ నొల్లరా? ఒళ్లు జబ్బా? బడలి
నారా! రే యంతయుం బ్రయాణముం జేసినారా? వట్టి

నెపములు: తిరుగఁబడి విడిపోవు చిహ్నములు. ఇంత కంటె మంచి యుత్తరముఁ బట్టుక రా.

ప్రియ.—మహాప్రభో, పట్టభద్రుని యుగ్రస్వభావము మీకే తెలియుఁగా, ఎంతయుఁ గదల్పఁ జాలనివాఁడు, తన పట్టిన పట్టు సాధించు వాఁడు నని.

ప్రళ.—దండన రాను! అనిష్టము పట్టును! నాశము కాను: ప్రళయము పుట్టను! ఉగ్రుఁడా? ఏమి వన్నె యాతని యుగ్రత? మంచిదోయి, ప్రియవ్రత, ప్రియవ్రత, కోణపాలక పట్టభద్రునితో సతని భార్యతో మాట్లాడవలెను నేను

ప్రియ.—మంచిది, మహాప్రభో, వారి కాంతటిని విన్నవించి నాఁడను.

ప్రళ.—విన్నవించినాఁడవా! నా మాట నీకు బోధ పడు చున్నదా, ఓరోయి?

ప్రియ.—బుద్ధి, బుద్ధి, మహాప్రభో.

ప్రళ.—రాజు కోణపాలక భద్రునితో మాట్లాడ వలయు: ప్రియ జనకుఁడు తన యాత్మజతో భాషింప వలయు, నా బిడ్డ శుశ్రూష నాజ్ఞాపించుచున్నాఁడు. వారికీ వార్త యందినదా? ఓరి నా ప్రాణమా! నారుధిరమా! ఉగ్రుఁడే? ఉగ్రపు పట్టభద్రుఁడా? చెప్పు మా యుగ్ర

భద్రుననుఁ జెట్టని—వలదు, అంతలో వలదు, ఒళ్లు బాగులేకుండవచ్చు; ఆరోగ్యమున కవశ్యయుక్తములైన యత్నముల శుశ్రూషలచే బలహీనత యెల్లప్పుడు నుల్లంఘింప వచ్చును గదా; ప్రకృతి, పీడితమై బుద్ధిని శంకముతో దుఃఖపడుమని విధింపఁగా, మనవశము పడకుండదు, ఓర్చుకొనియెద; స్వవశము లేని రోగిష్టి యొక్క చపలాలాపమును దృఢగాత్రుని బుద్ధిపూర్వక నిశ్చయమని తలంచి నందునకు నాదు సంరంభ ప్రవృత్తిని ఖండింపఁదగు. ఎంతటి పాపిష్టిని నేను! అత్తఁడేల యిట్టుల కూలఁబడి యుండవలె! ఈ చెయిదము నా కుపదేశించుచున్నది, పట్టభద్రుని వాని భార్యయొక్క స్థానభేదదరన రాకరణములు కేవల మాయా తంత్రములని పిడివింపుడు నా సేవకుని: వెళ్లి చెప్పుము భద్రుఁడితో భద్రితో వారితోనే మాట్లాడవలెనని; అదియు నిప్పుడె యీ నిముసముననే; రమ్మనుము వారి బయటికి, వచ్చి నా మాటల వినమనుము; లేదా, వారి పడుకటింటి తలుపున రాయిడి గిడిగిడి వాగించెద నిదురకు చావు వచ్చునటులను.

ప్రవే.—నా యభిలాష మీలో మీ అందఱు సమాధానముగ నుండుమరని, (నిష్క్రమింపు)

ప్రశ.—ఓరి బాబయ్యా, ఏమందువు నను, నా డెందమా, నా చెలరేఁగు డెందమా! కాని, ఘూలుము!

గాణ.—అటవి యనుము దానితో మామయ్య, లాడను వంట లక్క యఱచి న్నల్లు మలఁగు చేఁపలను జూచి, ఉసురుతో వానిని పిసికిన పిండిలో నుంచుచు; ఏతుకుమ వాని తలల నొక కఱ్ఱతో 'ఘూలుఁడు, తుంటలార, ఘూలుఁడు.!' అని ఘూర్ణినఁట నది దాని తమ్ముఁడే నఁట మఱి, తన గుఱ్ఱము పై విశుద్ధ ప్రేమతో, దాని మేఁతగడ్డికి వెన్నఁ బట్టించె నఁట

(ప్రవేశింతురు.) కోణపాలకుఁడు, రజనీచరి, గుళస్థానుఁడు, సేవకులును,

ప్రళ.—సుప్రభాతము మీ యిద్దఱికిని.

కోణ.— జయము సన్నిధానంబునకు!

(హితకీర్తి విడివింపఁబడును.)

రజ.—బలు సంతసము నాకు తమ యౌన్నత్య దర్శనమున.

ప్రళ.—రజనీచరి, యని తోఁచెద వీవు; అట్లు నే నెంచుటకు తగు హేతువు నే నెఱుంగుదు: నీకు సంతసము లేక పోయిన, నీ మాతృ సమాధి నుండి నన్ను ఎడఁబాపి

కొందు, అంకులాడిని నిషేపించితిని కదా యనచును
(పిత, కి) ఓహో, నిన్ను విడుదలఁ జేసినారా? మ
హాశకప్పుడు కానిమ్ము దానికి ముద్దుల రజనీచరి, నీ
యక్కయ రక్కస: అమ్మయ్యా, రజనికా, వాఁడిపండ్ల
యప్రియమును, ఇదిగో (ఎడఁదచూపు) విచ్చుటఁ గట్టి
యున్నది గద్ద లాగున నా గరళవల్లి: నీతోఁ బలుకు
లైన నాడ లేకున్నాఁడను, నీవు నమ్మఁగాలవు, ఎంతటి
దుష్ట హృదయముతో—నో రజనీచరి!

రజ—ప్రార్థించెద బాబయ, ఓర్పుఁ జూపుము: నే నమ్మెఁ,
ఆయమ గుణాఢ్యత నిట్టిదని నీవు మతింపఁ జాలవు కాని,
నీ యెడ భయభక్తులు ఆపేకించుకయుఁ గొంతవడదు.

ప్రళ.—చెపుమ, యేలాగో యది?

రజ.—నే నెంచఁ జాలను నా యక్కయ ఇసుమంతయు
స్వధర్మచ్యుతిఁ బొందు నని; ఒక వేళ, బాబు, నీ యను
చరుల తొఱుమాఱులను నాపె యాటంకపఱచియుండిన,
నది సహేతుకమును మంగళ ఫలోద్దేశ పూర్వకము
గాన నామె పై నెంతయు దోషము లేదు, విగత కల్మష
నమీ.

ప్రళ—నా శాపములు దానిఁ బట్టుకొనను.

రజ.—ఓయి, బాబు, నీవు ముసలివాఁడవు; నీ యందలి ప్రకృతి కేవల యాయుష్యాంతపు పొలిమేర యంచున నిలిచి యున్నది: కావున నీ వెఱుంగ లేవు నీ స్థితి యెట్టిదో. దాని నీకంటెఁ జక్కఁగ నెఱిఁగిన వారెవ్వరో యట్టి అరయికకాండ్రు మేలు కీళ్లఁ జూపుచు నీకు విధించు క్రమము చొప్పున నీవు ప్రవర్తింపవలయు. కాఁబట్టి నాయందు కరుణించి, మన యక్కయ్య నగరునకు మరలి వెళ్లుము: వెళ్లి నీ వామె కపరాధివియని చెప్పుకొను మయ్య నామాట విని.

ప్రళ.—ఆమెగారి క్షమార్పణము వేఁడి కొననా? ఒక్కింత తిలకింపు మియ్యది కులమున కెంత యర్హమై యుండునో, (మోఁకరింపుచు.) "ప్రియ పుత్రికా, నే ముసలివాఁడను నీకుఁ దెలిసినదే కదా, ననుఁ బోటి ముదుసళ్లు అనగత్యులు; నా మోఁకాళ్లపై యాచించెద నిన్ను, కృపా కటాక్షము వాల్చి వస్త్రము, శయ్య, అన్నము మాత్ర మొసంగుమా".

రజ.—మేలిమయ్యా, చాలు నింత; ఇట్టివి యసహ్యపు వెక్కిరింతలు; తంత్రములు; తిరుగు మయ్యా నా యక్కయ్య వలనికి.

ప్రళ.—(లేచుచు) ఎన్నటికి జరుగఁ బోదు, రజనిచరి; అది నా పరివారములో నొక సగముఁ దరిగించుమన్నది; కలుషు చూపుల వైచినది; కాల సర్పము మాడ్కి నా యెద పైనినే కొట్టినది తన నాలుకతో: గగనపు సమస్త శిక్షా సంభారము లెల్ల దాని కృతఘ్నమస్తకముపై పడియెదు! తెగులుగాడ్పులార, దాని పుట్టఁబోవు చిట్టి ముకలను కుంటకొట్టుఁడు!

శోణ.—ఛీ, శాబు, ఛీ!

ప్రళ.—ఓ చురుకు మెఱుములార, మిఱుమిట్లు గొలుపు మీ జ్వాలలను దాని యలక్ష్యపు లోచనముల నేసి గ్రుడ్డి సేయుఁడు: ప్రతాపవంతుఁడగు తపనునిచేఁ జవుకు నేలలఁ జప్పరించి యాకర్షింపంబడు పొగమంచులార, దాని యందమును సోఁకి పాడుచేసి దాని గర్వమును గూల్పుఁడు!

రజ.—అహాహా పొగడ్త గాంచు వేల్పులార! ఈరీతినే నా మీఁదను శాపములఁ గుమ్మరింతువు, నెట్టి యావేశము పైకొనునపుడు.

ప్రళ.—లేదు, రజని, నీపైని శాపమెన్నటికి నిడనులే: నీదు లలితహృదయత్వము నిన్నుఁ గాఠిన్య పాత్రురాలిం జేయదు; దాని కండ్లు నిప్పులు కక్కుచున్నవి; నీయవో క్రా

లుటకు మాఱుగాఁ జలువఁ గొలుపుచున్నవి. నీప్రకృతి యొల్లదు, నాసంతోషముల క్షీరసించుటకు, నాపరివార మును తరిగించుటకు, సరభస పదముల నేటికిఁ బోటి వచిం చుటకు, నా భరణములను తక్కువ పఱచుటకు మఱి తుదిని నన్ను రానీయక గడియ వేయుటకును. దాని కంటె బాగుగ నెఱుంగుదువు సహజ ప్రీతి ధర్మములను, పుత్రికా బాంధవ్యమును, మర్యాదా వచనములను, కృతజ్ఞతా భారములను; నీకు నేఁ బ్రీతి నొసఁగిన అర్ధ రాష్ట్రాంశమును మఱచిన దానవు కావు.

రాజ — బంగారు బాబు, ప్రకృతము ననుసరింపుము.

రీ. — నా మనుష్యు నెవరుంచిరి బొండ ప్రమాకున

(కాహళములు లోపల)

కోణ — ఏమి టా కాహళము ?

రా. — నే నెఱుఁగుదు, నా యక్కయ్యది; ఇది యాజ్ఞిత పఱచుచున్నది, శీఘ్రములోనే తా వచ్చెద నన్న ఈ యుత్తరవు మాటను

ప్రవేశించు వసుపాలుఁడు.

నీ దొరసానిగారు వచ్చినారా ?

రీ — వీఁ డొక నీచుఁడు, ఇతని సులభావిష్ట యహం

కారను వీఁడు సేవించు దాని చపలానుగ్రహాయ త్తము;
అవలరా, పోకిరి, నా యెదుట నిలువకు!

కోణ.—ఏమని భావము దేవరవారిది?

ప్రశ.—ఎవఁడు బొంకవేసినవాఁడు నా సేవకుని? రజనీచరి, నాకు బలు నష్టకము నీవేమి నెఱుంగవు దీని వివరము నని. ఎవరు వచ్చున దిక్కడ? అహా! ఋవములారా,

ప్రవేశము గరళవల్లి.

మీరలు ముసలివాండ్రఁ ప్రేమించిన, మీ శుభ పరిపాలనమునకు విధేయత రంజకముగ నుండిన, మీరలును వయోధికులైన, దీనిని మీ స్వవిషయముగఁ జేసి కొండు, పంపుఁడు మీ దూతల, నా ప్రక్కన నిలువుఁడు.

(గర-కి) లజ్జలేదు నీకీ గడ్డమును జూచుటకు!

ఓ రజనీచరి, దానిని కరావలంబనముఁ జేసెదఁటవే!

గర—ఏలనయ్యా, కరావలంబము కారాదు? నే నేమి యపరాధము చేసితి? అవివేకము చూచునదియు శాలి శతపేరుపెట్టునదియు నెల్ల యపరాధము కానేరదు

ప్రశ—ఓపార్శ్వములార, మీరు బలు గట్టిగ నున్నారు. గుండియ, యింక పగులకుంచువా? ఎట్లు వచ్చెనా మానిసి బొండ ప్రాకులోన?

కోణ.—నేనే వాని నంపుంచితినయ్యా; కాని యతని బలవ ద్దురాక్రమమునకు ఈ ఉద్యోగము అత్యంత గౌరవ మైనది.

ప్రళ.—నీవే! నీవే యుంచితివా?

రజ.—మనవి నీకు, బాబు, వైకల్యముఁ బొందినాఁడవు కాన, దార్ఢ్య వేష మెందునకు? తగినట్లుండుము నీ నెల ముగియు వఱకు తిరిగి వెళ్లి నా యక్కయ్యతో వసియింతువేని, సగము పరివారమునుఁ దోలివేసి, యిదప నా యొద్దికి రా; నే నిపుడు ఇలుఁబాసి యున్నదాన; మఱియు ని న్నుపచరించుటకు అగత్యమైన యాహారాది సంభారము లింక సంగ్రహింపనిదాన.

ప్రళ.—తిరుగుటా మరలను దానింటికి? నఱియు నేఁబండ్ర జోదులఁ దోలివేసియా? అక్కఱలేదు, అంతకంటె నన్ని పటలములను బరిత్యజింపఁ బ్రతిజ్ఞ సేయుదు, మఱి శీతోష్ణముల శాత్రవముతోఁ బోరాడ నభిలషింతు; తోడేలుతోను గ్రుడ్లగూబతోను సహవసింతు—దుర్గతి యొక్క క్రూర కృచ్ఛ్రింబు! దానితోఁ దిరిగి నడచుటా? అంతేల, వేఁడి నెత్తురు (తీవ్రప్రకృతి) కాఁడగు పరం గీశ్వరుఁడు, అస్మత్కనిష్ఠాత్మజ న్విశుల్కముగఁ గైకొన్న

వాఁడు, వాని సింహాసనమునకు మోఁకరింప నన్ను సుల
భముగఁ బ్రేరించుకొనవచ్చునే, యుపయోధునిం బలెఁ
బ్రణతుఁడై, వార్షికంబు వేఁడవచ్చునే యీ నీచ జీవ
నము సాఁగ నిచ్చుటకై. దాసితో తిరుగనా? అంత
కంటె, సిల్లిదిగో నీ పరమ చండాల పరిచారకునకు
బానిసకాఁడుఁ, గంటలపుటెద్దుఁగఁ, జెట్టికగాడిదెగనుండ
నేర్పవచ్చునే. (వసుపాలుని జూపును)

గర —స్వేచ్ఛానుసారముఁగ, నయ్యా.

ప్రళ.—బ్రతిమాలికొనియెదనే, కూఁతురా, నన్నిట్లు వెఱ్ఱి
వానిఁ జేయకవే: నిన్ను బాధింపనే, నా బిడ్డా; సుఖము
నీకు, పోయిరా, ఇఁక నెప్పుడు మనము కలిసికొనవలదు,
ఇఁక నెప్పటికిని ముఖావలోకనము వలదు; అయినను,
నీవు నా మాంసమవు, నెత్తురవు, కూఁతురవు; మఱి
యిట్లనుట మేలు నాకండలోనిపుండవు, నిన్ను నాది
యదే యనవలయు: నీవొక నెత్తురు గడ్డవు, మహా
మారి చీడకుఱుపవు, గుబకపంక్తి రాజవ్రణమవు, నా
కలుషిత రక్తములో. కాని నిన్ను దూఱులు పెట్టనులే:
అపమానము రానీ దాని చిత్తము వచ్చినప్పుడు, నేఁ
బిలువ నొల్ల నేఁ గోరలేదు వజ్రహస్తుని నేయుమని;

ఉత్తమ న్యాయాధికారియగు యమధర్మరాజుతో నీవైం గొండెముల మాట విప్పలేదు; నీ కిష్టమగు సాధ్యము గునో యదియును బాగుపడును: నీకు సమయము వచ్చి నపుడు, మంచి తెలివిం దెచ్చికొమ్ము నేను నోర్చికొనం గల, వసియింపం గల రజనితో, నేనును నా నూర్వురు జోదులును.

రజ—కావంత సంపూర్ణముగ, నీ వింత వేగిర వర్తువలె యెదురు చూడలేను, మఱి నీ యాదరణకుం దగినట్లు ఆయితురాలినింగాను పీను ఇప్పు, బాటు, నా యక్క య్యకు; కలంటివ, నీ యాగ్రహ వచనములను వివేక ముతోం బదికింపువారు నీవు చాలను ముదుసలి యయినా వని యెంచక మానరు, కావున—అయితే ఆ బిడకుం దెలియును ఆబిడ చేయునది.

ప్రశ.—ఇయ్యది మనః పూర్వకముగ మాట్లాడితివా ?

రజని.—తిరుగను నొత్తి పలికెద, బాటు ఏమిటి, ఏబద్రపు జోదులా ? అది బాగులేదు ? అంతకంటె నధిక మేల నీకు ? నిక్కము, అంగిలియ కాదు, అందజే యేల, వ్యయ మునకు వ్యయము చేం ; అపాయమునకు కపాయము పెచ్చు; వ్యయాపాయములే వాదించుచున్న వే యన్ని

పెక్కు మూఁక కారాదని. ఎట్లుఁ బొసఁగు నబ్బ, యొక్క
యింటిలో, నింతలు జనులు, రెండు కట్టడల క్రింద, పొత్తాని
యుండుట ? బలు కఠినము; ఇంచు మించుగ నసాధ్యమేను.
గర —ఎందుకు వలను పడదు, రాజతిలక, ఆపెకుఁ బనికాం
డ్రెవరో, లేక నావారెవరో వారియెడ సేవఁ గొనుట ?
రజ —మత్తే, ఏలఁ గూడదు, మహారాజ ? అట్లుఁ జేసిన నెంత
శాగు, వా రెవ్వరైన నీయెడ ననష్టఁ జూపిన మేము
దండింతుము పైఁబడి. నీవు నాయొద్దికి రానే వత్తువా,—
ఇప్పుడొక యాపద నాకుఁ బొడకట్టుచున్నది కాన,—
నా ప్రార్థన యేమన ఏవురు నిరువండ్ర నే తెమ్మని
ఎక్కువమందికిఁ జోటు నివ్వను, వారిఁ జూడనుం జూడ.
ప్రళ.—నే నిచ్చి తీరికన్నఁటి—
ర జ—మంచి యదనున నిచ్చితి.
ప్రళ —మిమ్ముల నాపోషకులఁ జేసికొంటి నాస్వామ్య రక్షి
కలుగ (న్యాసధారిణులుగ); కాని యొక్క నిబంధన
మాత్రము శేషించియుంచికొంటి, ఇన్ని మందిజనులు వా
రి కాఁపులతో సంచరింతునని. ఏమిటి, నీయింటికి ఇరువదేను
మందితోనే రావలెనే నే రజనీచరి, అంటివఁటె యట్లని ?
రజ —అంచున్నాను మరలను, మహారాజా, అంతకంటె నె
క్కువనొల్లను, నాయింటను

ప్రళ.——దుష్ట జంతువు లనునట్టివియు సుగుణాలంకృతము లన్యేడి, ఇతర జంతువులు వాని కంటెను దుష్టములై యుండిన; అన్నిటి కంటె దుష్టతమము కాకుండుట యొక రీతిని శ్లాఘనీయతమె.

(గిర కు) నీతో వెడలివచ్చెద, నీ ఏఁబ దినుమడింత లేనునిరువదికి, కావున, నీవు దీని ప్రేమకు రెండింతల దానవు.

గిర ——వినుము నన్ను, పుడమి ఱేఁడ, ఎందునకు వలయు నీకు నేనులిరువదైనఁ, బదియునైన, నయిదైన, నిన్ను వెంబడిం ప నొకయింట నిబ్బడింతల వారుండఁగ, నాజ్ఞఁబడసిన వారు నిను సేవింపను?

రజ.——ఏలవలయు నొక్కండైనను ?

ప్రళ——ఓ, తర్కింపవల దక్కఱను గుఱించి; మన నికృష్ట యాచకులును, అత్యంత దరిద్ర పదార్థములపైనిని, అనావ శ్యకస్వామ్యులు: కాన, ప్రకృతి కీయఁబోకుము ప్రకృతికి నవశ్యం భోక్తవ్యములకంటె నధికమైనవానిని: మానుష జీవనమున్మృగజీవనమువంటి చౌకయే: నీవు దొరసానివి కావా, అలకింపుమీమాటను; శరీరమును సమోష్ణమునునుం చి కొనుటయే మానవులకు శోభయయిన, నీకేల నీ

శోభాయమాన వస్త్రాభరణాలంకారము లెల్ల? ప్రకృతిని బట్టి యివి నీకనావశ్యకములు, అవశ్యకమైన శరీరోష్ణమును నివి యియ్యవే కాని, యథార్థావశ్యకతకు,— ఓ దివములార, మీ క్షమాశక్తిని నాకిండు, క్షమ నాకవశ్యకము! ఇదిగో నన్నుఁ జూచెదరు, ఓ దేవులార, పేదముసలివానిని, వయస్తుల్య వ్యసనాక్రాంతుని; రెంటను దుర్దశాపీడితుండను! మీరలే యయితిరా, యీకూఁతుల హృదయమును ఇట్లు తమ తండ్రికెదురుగ కెరల్పువారలు, ఈ యవజ్ఞను మెత్తనతో సహించునట్టి శుంఠనపుంసకునిం జేయకుండుం; ఉదాత్తరోషాయత్తునిం జేయుండు; అబలల యాయుధములగు నశ్రుబిందువులతో నా పురుష కపోలములను కలుషీకరింపకుండు! కానేరదు, ఓ యప్రాకృత ఘూన్యకత్తెలార, మీయిద్దఱిపైన నెటువంటి పగతీర్పు నొనరించెద చూడుఁడు, ఈ లోకమంతయు గడగడ—ఎటువంటి చేతలం జేసెదనో—అవేవో నేనింకఁ జెప్పలేను; కాని భూమికంతె భీతికరములయ్యెడి. మీరెంచెదరు నే నూరక యేడ్తునని; ఎన్నటికిని లేదు, ఏడ్వనే యేడ్వను; ఏడ్పుటకు వలసినట్టి కారణము లున్నవి, కాని ఈ గుండియ నూఱువేల తునియలై చిట్లిపోవుగాని నే నేడ్వనే యేడ్వ. ఓరి విదూషక, పిచ్చిపట్టి పొయ్యెడిరా!

(నిష్క్రమింతురు ప్రళయాంతక, గుళస్థాన, హితకీర్తి

శాణ భణితులు. గాలివాన.)

కోణ.—మనము మరలిపోదము; తుపాను కొట్టెడి.

రజ —ఈయిల్లు చిన్నది; ముసలివాఁడు నతని జనులు నిచ్చట సదుపాయము నొందలేరు.

గర — ఆతని తప్పినది, సదుపాయములనెల్ల వదలికొని వచ్చినాఁడు; మాధ్యఫలమనుచిని చూడనేవలయు.

రజ —ఆతని విషయమై మాసంతసముతో నాతనిఁ జేర్చికొందుఁగాని, ఒక్కయనుచరు నైననొల్ల

గర —నేనునట్లు లే నిశ్చయించుకొంటి. ఎక్కడ మా గుళస్థాన సీమంతుఁడు?

కోణ —ముసలివాని బయటికి ఝంబడించి వెళ్లె. మళ్లివచ్చినాఁడు.

పునఃప్రవేశము ప్రియవ్రతుఁడు

ప్రియ —మహారాజుగారు మహాకుపితులై యున్నారు

కోణ —ఎచ్చటికి వెళ్లుచున్నాఁడు?

ప్రియ —పరివారుల గుఱ్ఱమెక్కుమనుచున్నారు; ఎచ్చటి నో తెలియఁజాల.

కోణ — అతని క్రోధ మతని పోనిచ్చుటె యుత్తమము; మొండి పట్టుల ముసలివాఁడు.

గర — స్థానేశ, అతనిని యాచింపవలదనుముని యెంతమాత్రము.

ప్రియ — కట కటా! రాత్రి యేతెంచుచున్నది, హిమశీతల మారుతము లతివిపరీత ఘోషోత్పాతకరము లగుచున్నవి. అనేకక్రోశముల దనుకఁ జుట్టుపట్ల నొక్క యూరైనఁ గానరాదు.

రాజ — ఓయి, శాబు! పెడసరకైలకు తమయింటిధామము తెచ్చుకొనియెడు నాపద లే తెలివికొల్పునొజ్జలు గానయ్యెడి. నీగుమ్మములను బంధించి వేయుము: అతని వెంబడి పరివారము ఆతతాయుల సమూహము: కావున వారలతని నేమి సేయుమని ధూపము వేయుదురో! మాయబ్బ చెప్పుడుమాటల విని తప్పుదారి తీయుఁగాన, వివేకము వెఱపు గొలుపుచున్నది.

కోణ — తలుపులను వేయించుము స్థానేశ్వర; భయంకర రజని; నా రజనీచరి సన్మంత్ర మిచ్చుచున్నది: తుపాను నుండి లేచిరండు. (నిష్క్రమింతురు.)



# అమృతహృదయ

## (లేక)

# ప్రళయాంతకరాజు.



## తృతీయాంకము

### రంగము I ఒక గయాళు.

తుపానుకొట్టుచుండగను ప్రవేశము హితకీర్తియు నొక సుజనుఁడును, ఎదురెదురుగ.

హిత —ఎవరక్కడ, ముసురు నీదరయు గాక ?

సుజ.—ముసురువంటి మనసువాఁడు, పెల్లుసుడిఁగలఁగినవాఁడను

హిత.—నిన్నెఱుంగుదు. రాజుగారెక్కడ ?

సుజ —పోరాడుచున్నారు, క్షుభితభూతంబుతో; ఆనతిచ్చుచున్నారు ప్రభంజనుఁడు భూమిని సముద్రములోఁగొట్టి ముంపుతని, లేదా, యూర్మిమాలి నుబుకించి మూలభూమిని ప్రమింగింపుతయని; అప్పుడైని వస్తువులు మాఱనిమ్ము లేదా కూలనిమ్మని. తమ శ్వేత కేశములను కలగుంకున వ్రాఁగికొను

చున్నారు. ఉరవడితో వీచు నాయీఁదర గ్రుడ్డికోపముతో వారి వెంట్రుకలనుఁ బట్టుకొని యిట్టట్టనని జెట్టిదములు వెట్టుచున్నది. ఇట్టి తెఱఁగున ముందును వెనుకను పెనకువలాడుచుండు పెనుగాలి వానలం దెగడుటకు తమ యల్పమ్గానుషపిండాండ బలమునకుఁ దగుపూనికతోఁ బాటుపడుచున్నారు. నేటి రేతిరిని ఘూనలకుఁ బాలుకుడిపిన యెలుగుబంటియు బయటబో వెఱచి తనగుహలోనె పన్నుండు, సింగంబును, నాఁకొని కడుపు క్రాలు తోడేలును, తమబొచ్చునుఁ దడియనీక యుంచుకొను, నట్టి యీ పెనుమునురు చీఁకటిని టోపిలేకయె నలుమూలలం బొఱలుచు నత్యంత నిరాశాక్రాంతు లయినారు.

హిత.—అయితే, ఎవ రున్నా రాయన సహాయమునకు

సుజ.—మఱెవరు లేరు, విదూషకుని వినా; ఈతఁడు నాయన హృదయతాడక యపకారములనుఁ బరిహాసించి మఱపింప ప్రయాసపడుచున్నాఁడు.

హిత.—అయ్యా మిమ్ము నే నెఱుంగుదు; ఆ యెఱుక బలిమిఁ బట్టి తెగువఁ జేసెద నొక ముఖ్య విషయమును మీచెవులకు సమర్పింపను. బలు విరోధమున్నది ధవళవర్మ కోణపాలకులకు, నీపట్ల మాత్రము దానిరూపు కప్పఁబడి యున్నను పరస్పర

కైతవంబుల చేతను; వీరియెడ కొందఱున్న వారు—గ్ర
హాచార బలమున సింహాస నారూఢులౌ నున్నతస్థితింపం దు
లెవరియెడ మాత్రము లేరు?—కపట సేవక వేషధారు
లు, కనుల కట్టులై గాంతురు, పరంగీశ్వరునకు మన రాష్ట్ర
పు వర్తమానముల నరసి కొంపోవు వేగరులు ; ఏవేవి
తాఁ కంబమున్నవో, ఈ పట్టభద్రుల కలహములనుఁ గూట
సంకల్పములను గాని, ప్రియమనస్కుఁడౌ వృద్ధభూపతికి వి
రోధముగ వారిరువురుం బట్టుక నీచ్చుచుండు దుర్భర ప్ర
గ్రహమునఁ గాని ; లేదా, ఈ పన్నియుఁ గేవల బాహ్య
విడంబనములై కాఁబోలు నింతకన్న నుచ్చైచ్చ జిత్తు కూ
ర్చిన వేఱొక్కటినో కాని, చారణులు కాఁబోదురు; ఏది యె
ట్లున్నను నిది నిక్కువంబు, పరంగినుండి రాఁబోవుచున్న
దొక్క బలంబు మన విభిన్న రాష్ట్రములోనికి, ఇయ్యది
తఃపూర్వమే, మన యశ్రద్ధను నాధారంబుఁ జేసి కొని, మ
న యుత్తమ సాకాశ్రయములం గొన్నిట రహస్యపరూ
ఢమై బాహాటముగఁ దన ధ్వజముల విఁయువీఢ్చి యారో
పించు సమయమున నున్నయది. ఇప్పుడు మీ కొక మాట;
మీరు నను నమ్మిపోవరునకు ద్వారపురికి త్వరితమున నరు
దెంచఁ దెగువ చేయుదు కేని, కొందఱు అచ్చట మీకుఁ గానుపిం
తురు మీకు భీమదించువారు, మీరు కలవరూపుఁ గ వివరించిన,

నెంతటి దారుణమును నున్మాదకరము నగు చిత్తసంక్షోభ
మును గుఱించి రాజగారికి మొఱలిడఁ గారణం బున్నదో
యని. నేను నొక సుజనుండనె, కులీనుండను, విద్యావినయ
శీలుండను; మఱియుఁ గొంత విచారణను నిర్ణీత వృత్తాంత
మునుఁ బట్టి, యీ యుద్యోగంబునుఁ దమకు నియమింపఁ
బూనితి.

సుజ.—మీతో సవిస్తారముగ పదంపడి సల్లాపించెద.

హిత.—వలదు, సందియంబు వడకుఁడు. నామాట నూర్జితపఱ
చి కొనుటకు, నాయీపైని యీవరణను కంటె నధిక
సత్త్వము నాకున్నదని దృఢపఱచికొనుటకును, ఈసంచిని
విప్పి యిందుండుదానిఁ దీసికొండు. అమృతహృదయను
దర్శింపఁ గల్గునేని,—గల్గు ననుటకు సందియంబు లేదు,—
ఆమెకీ యుంగరమునుఁ జూపుఁడు: ఆబిడగారు బయలు
వెట్టుదురు, మీరింక నెవరని తెలిసికొనలేని మీ సంగడికాఁ
డెవఁడని. ఛీ-ఛీ! ఈ ఝంఝూ కూలను! నేవెళ్లి రాజుగారి
దర్శించెద.

సుజ.—మీహస్తము నిండుః ఇంకేమియు లేదా మీరు నాతోఁ
జెప్పవలసినది.

హిత.—కొన్నియె మాటలు, కాని, వాని సద్యస్కఫలముఁ
గూర్చి, అధికము, ఇందాఁకటి వన్నిటికంటెను, ఏమన్న,

మనము రాజుగారిని వెదకి పట్టుకొన్న—ఈ పనిని మీ ప్రయత్నము లాత్రోవన, నాయది యీత్రోవన—ఎవరు మొదట నాయనం బట్టుకొందురో వారు హెచ్చరించుట కైఅవారిని. (నిష్క్రమింతురు వేఱువేఱుగ.)

రంగము II బయలున వేఱొక భాగము. తుపా నింక వీచును.

ప్రవేశము, ప్రళయాంతకరాజు, బాణభణితుఁడు.

ప్రళ.—కొట్టుఁడు, గాడ్పులార, విఱిచికొనుఁడు మీ చెక్కల! రేఁగుఁడు! కొట్టుఁడు! ఊఁదుఁడు, మఱిచీల్చికొనుఁడు మీ చెక్కిళ్లను! రేఁగుఁడు! వీవుఁడు! ఓ జడివానలార, ఆకాశగంగలార, నిరంతరధారలం గుమ్మరింపుఁడు మా గుడిగోపురములు తడియువఱకును, గాలిపడగలు మునుగువఱకును! ఓ గంధకమిశ్రిత మనోవేగపు మెఱుపుచిచ్చులార, సంహార విచారకములగు పిడుగులకుఁ బురోగాములార, దహియింపుఁడు నా ధవళిత మస్తకంబును! నీవును, ఓ సర్వకంపన స్తనితమా చదిపి చదును చేయుము ఈ స్థూల భూగోళాండమును! పగుల్చుము ప్రకృతియొక్క పోఁతయచ్చులగు గర్భకోటరములను, కృతఘ్నతా దూషిత మానవాకార జనకములగు సమస్త బీజ సమవాయములను ఏకకాలముననె నాశనంబు గావింపుమా!

బాణ — ఓయి మామా పాడియుంట సభాతీర్థము (స్తోత్రవర్షము, మధురవచనములు) మేలి తడిబయటి వర్షధారల కంటె. బంగారు మామయ్య, లోపలికి వెళ్లుము నీ పుత్రికల కృపను ప్రార్థింపుము: ఇదిగో నీ రాత్రి జ్ఞానిని గరుణింపదు, మూఢుని గరుణింపదు.

ప్రళ.— నీ కడుపులోని గాలినంతటిని గక్కివేయుము! ఉమ్మివేయుము, అగ్ని! కుమ్మరిలుము, వర్షా! వాన, గాలి, ఉరుము మెఱుములు నా పుత్రికలు కారు: మిమ్ముల దూఱులాడను ఓ భూతములార, నిర్దయులని, మీకేమియు నారాజ్యము నియ్యలేదు మిమ్ముల నా బిడ్డలని పిలువ లేదు, మీరించుకయు నా మాటల విన నక్కఱ కానము, కావున, మీ భయంకరాభీష్టమును జెల్లించుకొనుడు; ఇచ్చట నిలచినాడను, మీ బానిసీడనై; దరిద్ర, బలహీన, మతిహీన, నిందిత వృద్ధుండను: అయినను మిమ్ముల నన నోపుదు నీచకర్మకరులని ఈ మాడ్కిని నాయిద్దఱు దుష్టపుత్రికల ప్రక్కను జేరికొని, యింతటి ముదుసలియు నరసినదియునగు నీ తలమీఁదుగ మీ గగన జన్య యుద్ధములను నలుపుచుంటిరి జూడఁగ. అక్కట కటా! ఇది మహా ఘోరము!

బాణ.—తలనుఁ దూర్చుటకుఁ జాలినంత యిల్లుగల వాఁడెవ్వఁడో వాఁడె యిప్పుడు కిరీటధరుఁడు.

ఎఱుకమీఱి తన హృదయ గోపనము సేయంగ లేక
కాలి వ్రేలి ముందు కాపాడఁబూను కడగొట్టు కొడుకు
చెప్పుకొంటు కినుపునొప్పి కోర్వకేడ్వఁ రేయిఁ బవలు
త్రెప్పవాల్పలేక నిదుర తప్పి మిగులఁ దపించుచుండు.

కలన సింతవఱకు నెన్నటికి నెంత టందకత్తెయుఁ గానరాదర్దమున తన మోము వంకరలు సేయనది.

ప్రశ.—వలదు, కుమారా సర్వస్వామ్మునకును దృష్టాంతముగ నుండెడి. ఏమియు నోరాడను.

(ప్రవేశము హితకీర్తి.)

హిత.—ఎవ్వరచ్చట ?

బాణ.—మఱెవ్వరు, ఒక జ్ఞానియు నొక శుంఠుఁడు.

హిత.—అహాహా దేవర, ఇచ్చటనా యున్నారు తమరు ? రాత్రిని సంచరింప వలచు జంతువులును నిటువంటి రాత్రులకు సంతసింపవు : సంకుపిత గగనములు తమస్విసంచారులనుఁ గూడ జడిపించుచు వాని తమ గుహాలయంబు నిలువఁబంచుచున్నవి. నే బుట్టినది మొదలు, ఇటువంటి యగ్నిజ్వాలా పటలంబులు, ఇటువంటి భీకర మేఘనిర్ఘోష స్ఫోట

నంబులు, ఇట్టి గర్జజ్ఝంఝూవాత వృష్టిసీత్కారంబులు, నె
న్నఁడు విన్నట్లు స్మరణంబు లేదు. నరప్రకృతి భరింపజాల
దు ఈ యపాయమునుఁ గాని దాని భయమునైన.

ప్రళ.—ఈ భయంకర కోలాహలమును మనతలలపైనిఁ గీలించు
చుండు నా మహాదేవతలు కనిపెట్టుత నిప్పుడు దమ శత్రుల
నెవ్వరో. వడఁకుర యోరి దురాత్ముఁడ, యెట్టి నీయెడ సుం
డునో బయలు పెట్టని మహాపాతకములు, న్యాయకశాఘా
తంబుల నింక నొందనివి; దాఁచికొనుర నిన్నోరి రుధిర
పాణి, ఓరి కూటసాక్షి, ఓరి తత్తుల్యుఁడా సుకృతవేషధా
రి వ్యభిచారవృత్తి; పాపాత్ముఁడ, ముక్కలుముక్కలై పిగిలి
రాలుర, బాహ్యమైత్రి నాటకించుచు ద్రోహచిత్తుఁడవై
నరహత్యలఁ గావించిన విషపూరిత యమృతఘటమా;
నిభృత గుప్త యపరాధంబులార, యుబ్బించి పగులఁ గొ
ట్టుఁడు మిమ్ములం దాఁచియుండు హృదయంబుల, బయలు
వెడలి వేఁడికొనుఁడు కృపాప్రసాదమునకై యీ భీకర
కృతాంత ధర్మసభాహ్వాయకుల. నేనేమో పరపాప
పీడితుండ కాని పాపంకర పీడకుండఁ గాను.

హిత.—కటకటా! శిరోవేష్టనంబు లేక! కారుణ్యపూరిత
భూపతీ, అతిసమీపమున నున్న దొక్క కుటీరము ఇల్లిది

గో; ఈరుఘుంఝూనిలంబునుండియీయాప త్తౌసహార్ద్దము సేయు మీకు: అక్కచట శరణు చొచ్చుడు మీరు; నేను నికరిన గృహంబునకు వెళ్లెద— దాని గట్టిన రాళ్లకంటెను గఠిన మైనది; ఇయ్యెడ, మీకొఱకు విచారించుచు వెళ్ళ,లో పలికి నన్నుఁ జొరనీయ నన్నది— తిరిగి వెళ్లి బలాత్కరించి పడసెద నా యింటివారి కృపణోపచారము.

ప్రళ.— నా తెలువులు తిరుగ నారంభించుచున్నవి. రా రోము,నా కుఱ్ఱఁడ; ఎట్లున్నావుర,నా పిల్లఁడ? చలువ కొంటివా? నాకును చలి వేయు చున్నది ఎక్కడ నున్నదో యీ తృణము చాలియరి? మన యాప దనివార్యముల పరిణామనై పుణ్య మతి విచిత్రమైనది,అతి నీచపదార్థములకు బహు మూల్యంబులఁ గావింపఁ గలవి. రమ్ము, నీ కుటీరము. పాపము! విదూషక శాలకా, ఇంక నా యెదయం దొక మూల యున్నది నీ కొఱకు వగచు నట్టిది

శాణ.—(పాడుచు.)

ఆస్తి కొంచని కతి సూక్ష్మ బుద్దియు సన్నని దికిచికి నేరుపే,—
అంతెకాక యయూశె యూర హో. గాలి వీవ, వాన కురియ,—
తృప్తి మిగులఁ దన మేలుకీళ్ల సరది సవరింప పలయును,
ఏల నన్న వాన యనునది కురియుచుండు దినము దినమును.

ప్రళ.—సత్యము, నా చిన్ని పిల్లఁడ రావయ, కొనిపొమ్మ మమ్ము నీ గర్భగుడిసెకు. (నిష్క్రమింతురు ప్రళ. హిం. లు)

బాం.—సోదె యొకటి పలుక నేర్తు నీవి నుండి పోక మును ప్ర;
గురుల నోట మాట లద్ప్ప మహత్తు లేవి లేని యపుడు,
ఆంధ్ర వారు నీరు కలిపి కల్లుఁ జెఱపి యమ్మునపుడు.
రాచ వారు నేర్పు మీఱి చిప్పకాండ్ర కప్పు పడక యుండు నప్పుడు
బోంట్ల మిండకాండ్రఁ దప్ప భ్రష్టు లెవరిఁ గాని యపుడు,
న్యాయసభల నన్ని తీర్పు ల్న్యాయము లై యొక్క నప్పుడు
సేవకు ల్ఋణము లేక జోదులుం చీవ ల్గాక జీవించు నపుడు,
దూబులు నాలుకల యందు నిలువ నపుడు
ముడియవిడుపు ల్గుంపులందు సోఁకని యపుడు,
అప్పు డాల్బ్యోను భూమి గాంచు నెక్కుడైన చీకాకునుకా,
నాఁడు వచ్చు నట్టి తఱియుఁ దాని నెవఁడు చూడని ల్బి,
నడక లెల్ల సాగు నపుడు కాళ్ల మీఁదనే.

ఈ సోదె చెప్పెడు మెర్లిను; ఏలన నేను వాని ముందటి కాలపు వాఁడను. (నిష్క్రమించు.)

రంగము III. గుళ్ళస్థానుని కోట.

ప్రవేశము, ప్రియవ్రతుఁడు, దుష్టబుద్ధియు

ప్రియ.—అక్కటా, అక్కటా, దుష్టబుద్ధి, నా కసహ్యమాయె నీ యసహజ ప్రవర్తనము. వారి సెలవు కోరంగ

నాయనకుఁ గరుణఁ జూప, నా స్వాంతే యింటినే నావలన నపహరించికొనిరి: మఱియు నాజ్ఞాపించిరి నాకు, వారి నిరంతర యాగ్రహమునకుఁ బాత్రుఁ గాక యిచ్చయుండిన, నాయన మాట యెత్తఁ గూడదని, యాయన నిమిత్తము ప్రార్థ నేమియుఁ జేయఁ గూడ దని, యాయన విషయము నించుకయు నవలంబింపఁ గూడ దని, వారిని పోషింపఁ గూడ దనియుఁ.

సుష్ట —అత్యంత క్రూరము ఘోరమును!

ప్రియ —పోనిమ్ము, నీ వేమియు నాడకుము. పట్టభద్రు లిద్దఱికిని పరస్పర వైమత్యము పుట్టి యున్నది: అంతఃకలహ దుర్వార్తయు నొకం డున్నది; ఈ రాతిరి నా చేతి కొక యుత్తర మందినది, అందలి విషయము వచించుట యపాయకరము; ఈ యుత్తరమును నా యేకాంత కోష్ఠమున బీరువన దాఁచి బీగము వైచినాను. ఇప్పుడు రాజులంగారు భరించు నట్టి బాధలు సంపూర్ణ పరిహారములఁ గాంచు; ఒక సైన్యభాగము ఇంతకు మునుపె గట్టెక్కి యున్నది; మనము రాజపక్షము నవలంబింపవలయు. అయినను నేను వెతకి పట్టి రహస్యముఁగ నాయనకు సహాయము సేసెద. నీవు వెళ్లి మన పట్టభద్రునితో సంభాషింపు చుండుము, నా యూపరణ నతఁడు చూడ కుండు నట్లు: నే నెక్కడ

నని యడిగిన, నా కాళ్లు బాగు లేవు, పడుకకు వెడలి నాను దీనికిఁ బ్రతి నాకుఁ జావు వచ్చినను, శిరశ్ఛేదము నకుఁ దక్కువ పొడకాంచదు, నా పూర్వనాథులు రాజులవారికి సహాయముం జేసిరి కావలెను. ఎయ్యదో వింత చింత నున్నది, దుష్టబుద్ధి; మాట వినుము, జాగ్రతఁగ నుండుము. (నిష్క్రమించు.)

దుష్ట.—ఈ యుపకారము, నీవు చేయరానిది, పట్టభద్రుఁడు తక్షణము వినియెడు; ఆ యుత్తరము సహితము: ఇయ్యది మంచి తరుణముగ నున్నది; మఱియు నాకు దొరకువడు నా తండ్రి యోడునది! సమస్తాస్తియును నలు సైసను తఱుగు వడక. పడుచువాఁడు లేచును ముసలివాఁడు పడు చుండఁగ. (నిష్క్రమించు.)

రంగము IV గయాళి, గుడిసెకెదుట.

ప్రవేశము, ప్రళయాంతక, హితకీర్తి, బాణభటేతులు.

హిత.—ఇదియె చోటు, మహాప్రభో; రాజాధిరాజ, ప్రవేశింపుఁడు; ఈ గాఢాంధకారమున, నీ బట్టబయలున, నీ ఘోరవాతవర్షము అత్యంత దుర్భరము మనుష్య ప్రకృతికి.

(తుపాను వీవును.)

ప్రళ.—నా జోలికి రాకుము.

హిత.—ప్రళయభూపతీ, ప్రవేశింపుఁ డిందున.

ప్రళ.—పిగులుదువా డెందమా?

హిత.—అంతకు మున్నె నా డెందమె పిగిలెడి. ఱేఁడ, చొచ్చుఁడు తడయక.

ప్ర.—నీవు తలఁచెదవు మహాభయంకర మని యీ పోరాటపు తుపాను మన తోళ్ళలోనికిఁ దూఱి వేధించుట: అట్లైతె యగు నది నీకు; కాని మహా సంకటము నాటుకొన్న యచ్చట, నల్పబాధ గోచరంబువడదు. ఎలుఁగుబంటికి వెఱతు వీవు; కాని మళ్లి నీ పాఱుద్రోవ ఘోంవలించు కడలిలోని కీడ్చిన, ఆ యెలుఁగు బంటినే యెదిరింతువు దాని నోటిలోపల. చిత్తము నిర్మలముగ నుండిన దేహమును సుకుమార మగును. నా చిత్తములోని సంక్షోభము దీని కారణ మగు మనోగతమునఁ దప్పఁ దక్కిన సమస్త స్పర్శములను నా యింద్రియముల వలన నపహరించినది. పిత్రులకుఁ గృతఘ్నత! ఇయ్యది, ఈ నోరు కొఱికి వేసినట్లు గాదు, ఈ చేతిని, నన్ను మందిచ్చిన పాపమునకు? ఉండ నిమ్ము, సంపూర్ణముగ నొచ్చు నట్లుగ శిక్షించెద. వలదు, ఇఁక నేడ్వఁ జాలించెద ఇటువంటి

రాత్రిని నన్ను వెలుపలఁ దోలి తలుపులు వేయుటా! కుమ్మరించుఁడు; సహించికొనియెద. ఇట్టిట్టువంటి రాత్రి నా! ఓసి రజనీచరి, గరళవల్లి! మీ ముసలి యయ్యలుమీకు నాయన, ఎవని నిష్కపట హృదయము సర్వ పరిత్యాగంబుఁ జేసెనో,— అహా, ఆ దెస నున్నది ఈ పిచ్చికి మూలము; దాని మఱచి పోయెద: ఇఁక దాని మాట వలదు.

కెంట.—మహారాజాగ్రేసర, ప్రవేశింపుఁ డిందు

ప్రభు.—బ్రతిమాలెద; నీవే వెళ్లుము లోపలికి; నీ సదుపాయము నీవు చూచికొమ్ము: ఈ మహా మారుతము నన్నాలోచింప నీయదు నన్నెచ్చు బాధించు విషయములను గుఱించి. అయినను లోపలికి వెళ్ళెద: (బాల. కు) లోపలికి రా, పిల్లఁడ, వెళ్లుము మొదట. ఓ గృహహీన దరిద్రులార,—బంది లేదు, లోపలికి వెళ్ళుము. నే నీశ్వర ధ్యానము ముగించుకొని పిదప నిదురించెద. (విదూ. లో. వెళ్లును) నిఱుపేద దిసమొలల నిర్భాగ్యులార, ఎచ్చట నున్నను మీరలు, ఈ నిర్దయ ఝంఝూవాత ఘాతమును భరింపువారా, ఎట్లొకో మీ యిండ్లుకావని పుఱ్ఱెలును తిండి లేని పొట్టలును, మీ చిల్లుల కిటికీల చింపిరి పేలికలను, మిమ్ముల నెట్లు సంరక్షించు నీవంటి మబ్బు కారులం

మఱియు కార్తీకోత్సవ మేదో సహాయమా, దీనిని గుఱించి యించు
కయు నేను చింతింప లేదు? ఔషధము సేవించుము,
ఐశ్వర్య పటాటోపమా; పరమదరిద్రులు భరించు దుర
వస్థలను లోఁబడి, నీ కనవసరమగు భాగ్య భాజనములఁ
బంచిపెట్టి నేర్చుకొని, దేవాజ్ఞలను కడు న్యాయముతో
నాచరింపుఁడు, సధన నిర్ధన భేదముల సహేతుకములుఁగఁ
బ్రకటింపుఁడు.

ప్రేమ.—(లోపల) భాగయు న్నర, భాగయు న్నర! బీద
వెంకటాయ!     (భాణ. బయటికి పాఱను గుడిసె నుండి.)

భాణ.—రావలదు లోపలికి, మామయ్యా, ఇం దొక భూత
మున్నది. సాయము నాకు, సాయము సేయుఁడు!

హిత.—ఈ వోయి నీ చేతిని ఎవ్వ రచ్చట!

భాణ.—భూతము, భూతము! బీద వెంకటా యఁట వాని
పేరు.

హిత.—ఎవఁడురా వాఁ డా మొఱఁబెట్టు వాఁ డాగడ్డిని,
రా వెలుపల.

ప్రవేశము, ప్రేమసింహుఁడు వెఱ్ఱివాని వేసముతో.

ప్రేమ.—పెళ్లిపో! దుర్మార్గపు దయ్యము నావెంటఁ బడుచు
న్నది!

హాఁకి గ్రచ్ఛ కంప గుండ శీత వాయు వీఁచు చున్నది
వల్లె పొమ్ము నీదు శీత శయ్యఁ బోయి యంద వెచ్చఁ
గానుము, హూఁ,

ప్రళ.—నీవు నిచ్చిన వాఁడవే నీ కలుము లెల్ల నీ యిద్దఱి కొమరితలకు? ఇచ్చి యీ స్థితికి వచ్చినాఁడవా?

ప్రేమ.—ఎవఁ డిచ్చు నిద్దిరైన బీద వెంకటాయకు? వీనిని దుష్టదయ్యము తఱిమి కొని పోవు చున్నది నిప్పుగుండను మంటగుండను, రేవుగుండను సుళ్లగుండను, బసువగుండను బురదగుండను; కత్తుల నుంచినది తలగడ క్రిందను, ఉరిత్రాళ్లను జపశాలయందును; అంబలి ప్రక్కన నెలుక విసము నుంచు: డెందమున బలు పెద్దఱికముఁ బుట్టించి పొట్టిగుఱ్ఱము నెక్కి జోడునలు వేయుచు నాలు గంగుళముల వంతెనలపైఁ, దన నీడనె తన చంపరియనుచు వెంబడింపఁ జేసినది. ని పంచచిచ్ఛక్తులు బాగుండుత! వెంకటాయకుఁ జలి వేయుచున్నది,—ఓ, డోడీ, డోడీ, డోడీ. సుడి గాలులు, చెడు చిక్కులు, మాయా మంత్రములు, వీనివలన నీవు తప్పి బ్రతుకుత! బీద వేంకటాయకుఁ బున్నెము సేయుఁడు, పాడు దయ్యము వాని

పొట్లు బఱచు చున్నది; అదిగో నిప్పు డున్నది పట్టెఁ గల,—అదిగో మఱి,—అదిగో తిరుగను, అదిగో.

(తుపాను ఇంకను.)

ప్రళ.—ఏమిటి, వీని కుమారిత ల్వీని నీ స్థితికిఁ దెచ్చినా రేమి? ఏమియు మిగుల్పలేక పోతి వేమి? అంతటిని దత్తముఁ జేసితి వేమి?

భాణ.—లేదు, లే, ఒక కంబళి మిగిల్చికొన్నాఁడు, లేక పోయిన మన యందఱికిని సిగ్గులకుఁ జే టగును.

ప్రళ.—మఱి, మాను షాపరాధములకై విధింపఁబడి, యీ యూఁగుడు గాలిని వ్రేలాడు మహామారులన్నియుఁ బడుత నీ కూఁతుల తలలపై!

హిత.—అతని కెవరుఁ గూఁతులు లేరు, సామి.

ప్రళ.—చంపు, చండాలుని! ఎయ్యదియు నరప్రకృతిని నిట్లు దిగవాంచి యుండదు ఇట్టి హీనస్థితికి వీని క్రూరపుత్రికలు గాక. ఇదియేనా యిప్పటి యాచారము, నిరాకృత జనకులు తమ కండపై నిట్టియెఁ దయయుఁ గనికరము నానియుండుట (ప్రేమసీమాని యొంటఁ గ్రుచ్చిఁ గండునూడఁ జూచుచు.) యుక్తమైన దండన! ఈ కండయేకదా యీ చీకుకొక్కెర కూఁతులం గనినది.

ప్రేమ.—కొక్కొర కోడి కూరుచుండెను
కొక్కొరకోడి కుప్పదిబ్బమీఁదను
కొక్కొరకో, కొక్కొరకో,
కొరకో, కొక్కొ, కో!

శోణ.—ఈ చలి రేతిరి మమ్ములందఱి మార్చివేయు మూఢులుఁగను వెఱ్ఱులుఁగను.

ప్రేమ.—జాగ్రత, జాగ్రత, దుష్టభూతము చూపు; తల్లిఁ దండ్రుల మాట తప్పకుఁడు; నీవన్నమాట జవదాఁటకుము; ఒట్టులు పెట్టకుము; ఆడంబర యలంకారము లందాశగొని నీ మనస్సును నాటింపకుము, వెంకటాయకుఁ జలి వెట్టుచున్నది.

ప్రశ.—నీ వేమిటి వాఁడవు?

ప్రేమ.—పరిచారకుఁడను, గర్వపుపోతు గుండెన చిత్తమునను; వెంట్రుక లుంగరము తీర్చుకొందు; కుళ్లాయపైని చేజేరా దాల్చుదు, ఎన్ని మాటలో యన్ని యొట్టులు బెట్టుదు; అన్ని యొట్టుల ఆకాశవాణి సాక్ష్యముగ విడనాడుదు; సారాయి మీఁదన గాఢప్రేమ, పాచిక లంటె ప్రాణప్రీతి, ఇఁకఁ జేడియలంటెనా తురకసాహేబుకంసాని భీభీలు లేరు. ద్రోహపు హృదయము, చాడి గొట్టు చెవులు,

సెత్తురు చేతులు; పందికి మించిన సోమరి, కొంకనక్క మించిన జిత్తులమారి, తోడేలు మించిన దూబరదిండి, కుక్కకు మించిన పిచ్చి, సింగమునకు మించిన ఘాతకము. జోళ్లకిజ్జు గాని పట్టు పచ్చడముల మొఱమొఱ గాని నీ పేద గుండెను మెఱుంగుజోటుల వశము చేయవలదు, అప్పిచ్చువారి లెక్క పొత్తములకు నీ కలమునుం బోనీకుము, మఱి దుష్టపిశాచమును దూరముం దోలుము. ఇంకను వీచెడు శీతలవాయువు గ్రిచ్చపుకొమ్మదలల, మ్రోయుచున్నది సూత్రం, ముమ్, హా, నో, నాన్నీ, యని పోలిగాడ, నాపిల్లండా, నాపిల్లండా, సెస్సా! జోడన వేస్తిరా. (తుపాను ఇంకను.)

ప్రశ — మరేమి, ఇంతకంటె నీ పాతుగుంట మే లగునే, ఇట్టి యీ గాలుల కఱకుచుఱుకుల గుడ్డలేని యొడలితో డీకొనుటకంటెను. సరుం డనంగ నింతేనా, హెచ్చు కాడు! ఆ జీవిని బాగుగ నాలోచించి చూడుము. పట్టు నకై పురుగు నాశ్రయింప లేదు, తోలునకై మెకము నాశ్రయింప లేదు, బొచ్చునకై గొఱ్ఱె నాశ్రయింప లేదు, పునుగునకై పిల్లి నాశ్రయింప లేదు. హా హా హా! ఇచ్చట ముగ్గురము మున్నారము మేము, స్వాభావిక సహజతనుం గప్పి పెట్టినారము! నీవో ప్రత్యక్షముగ నిజ

జాగ్రత ! క్షత్రినుంచి కొమ్ము శ్వావెంట వచ్చువానిని ఊరకో, పులియఁడా ; ఊరకో, ఓరి భూతమా !

ప్రియ.—ఏమిటండి. మహారాజా, దేవరవారి కింతకంటె మంచి సహవాసము లేకపోయెనా ?

ప్రేమ.—అంధకారపు ఱేఁడు నొక సత్పురుషుఁడే ; మోరో యని పేరతనికి, మాహాహాయనియు.

ప్రియ.—మన మాంసము రక్తముం బలు నీచమైనది మహా ప్రభో, తన పుట్టించినదే తన కోగిలింత యాయె.

ప్రేమ.—ఓద వేంకటాయకు చలి వేయుచున్నది.

ప్రియ.—నాతో సహితము లోపలికి రండు : నా భృత్య ధర్మము నడసిన, తమ పుత్రికల ననుసరింపలేను వారు చెసెడి కఠినాజ్ఞల నెల్ల ; వారి కట్టడచొప్పున, నా కోట తలుపులకుఁ దాళము పెట్టి, ఈ క్రూర రాత్రికి మిమ్ముల కాపు ఇవ్వవలసి యున్నను, నా తెగువ చొప్పున మిమ్ముల వెతకి పట్టి అగ్నియు నాహారము సిద్ధ మయ్యెడి చోటునకుఁ గొంపోవ వచ్చినాఁడ.

ప్రశే.—మొదట నన్ను పలుకు లాడనిమ్ము ఈ మహాజ్ఞానితో ; ఉఱుముఁన కేమి కారణము ?

హిత.—రాజరాజేశ్వర, ఈయన పిలుపున కొడంబడుము; వెళ్లుఁడింటిలోపల.

ప్రళ.—ఒక్క మాటాడెద నీ పండిత సద్వ్యక్తితో. ఏమి నీ చదువు?

ప్రేమ.—భూతము నెట్లు వారించుట, పురుగుల నెట్లుఁ జంపుట

ప్రళ.—ఒక్కమాట నిన్నడుగనిమ్ము, రహస్యమున.

హిత.—ప్రతిమాలి బలవంతము సేయుఁడు, ప్రభువర్య, లేకున్న నొకమఱు వెంటరమ్మని; ఆయన తెలివులు తొట్రిల్ల సాఁగినవి.

ప్రియ.—అందున కాయనను నిందింపఁ దగునా? ఆయన

— (తుపాను ౩౬ వ.)

కొమరిత లాయన మరణమును కోరెదరు: హాహా, ఆ మేలువాఁడు హితకీర్తి! అతఁడనియె నప్పుడే యిట్లని, పాపము వాని దేశభ్రష్టుఁ జేసిరి! నీ వంచుచున్న వాఁడవు రాజుగా రున్మాదము హెచ్చుచున్నారని; నామాట వినవయ్య మిత్రమ, నేను నెంచ నెంచఁగ నింతటి యున్మాదము గలవాఁడనే; నాకుండె నొక కుమారుఁడు, ఇప్పుడు నా దాయ దాయాదత నుండి బహిష్కృతుఁడు; అతఁడు నా ప్రాణమును ద్రుంచ నెంచెను,

ప్రళ.—రావోయి, కాశీ పండిత.

ప్రియ.—మాటలు వలదు, మాటలు వలదు; మిన్నక!

ప్రేమ.—చిఱుతఁడు రూరువలుఁడు చేరె నొక్క—చీఁకటిల్లు కోటను
రవళిఁ జేసె రక్క—సియొకఁడు—నప్పుడు బయటఁ బాఱె
(నతఁడు.
వాఁడు శాఁడె మఱియు మఱియు,—ఛీ, ఛే, ఛో, ఛం,
మూరు కొనెద, బ్రిటిషు మనిసి నెత్తురున్నను.

(నిష్క్రమింతురు)

రంగము V. గుళస్థానుని కోట.

ప్రవేశము—కోణపాలకుఁడు, దుష్టబుద్ధి.

కోణ.—నా పగను దీర్చికొనియె వెళ్లెద నీ యిల్లు వదలుటకు మునుపు.

దుష్ట.—ఎట్లో కో, మహాప్రభో, లోకవాదములకు పాత్రుఁడనై యిట్లు రాజభక్తికై నైజరాగముం ద్యజించుటకు, తలఁచుటకె చిత్తము కొంచెము భీతిలుచున్నది.

కోణ.—ఇప్పుడు నాకుఁ దేటపడుచున్నది, తండ్రిగ నీ యన్న యొక్క దుష్టచిత్తమె కాదు, వాని చావును వేఁడ కోరుట; మఱి నీ యొక్క సద్గుణములె యుద్రేకముఁ గొలుప, అత్యంతమైన స్వదౌర్జన్యము సతని రేఁపించెనని.

దుష్ట.—ఎంతటి పగతురాలు నా భాగ్యదేవత, న్యాయప్రవర్తనమునకే నే నిట్లు పశ్చాత్తపింప వలసె! ఇదియె నాయన ప్రస్తావించిన యుత్తరము, పరంగీశ్వరు లాభసంపాదనములకు మనఃపూర్వక సహాయకారిగ బుజువు పఱచునది. అహో దివంబులార! యీ రాజద్రోహము పుట్టకుండ రాదా, పుట్టెఁబో నా కనులకుఁ బొడకట్టకుండ రాదా!

కోణ.—పద నాతోడుత పట్టభద్ర సముఖమునకు.

దుష్ట.—ఈ పత్రికలోని వార్త వాస్తవమె యయిన, తమ కవశ్యం కర్తవ్యము మీఁదు మిగులనున్నది.

కోణ.—వాస్తవమో యవాస్తవమో, నిన్నిది గుళస్థాన సామంతుఁ గావించినది నెమకి పట్టుము నీ యబ్బను, మే మాతనిఁ దడయక వశము పఱుపను.

దుష్ట.—(తనలో) ఆయన రాజుగారిని నూఱడించు తఱిని నేఁ బట్టుకొన్న, వీని యనుమానము పరిపూర్తిగ దృఢము వమను.—అస్మద్రాజభక్తి మార్గమున ననవరత నివిష్టుఁడై యుండెద, నిందునకును, రక్తబాంధవ్యమునకును, సహజనైజమునకును, క్రూర విరోధముగ నుండినను.

కోణ.—నీమీఁద నా పూర్ణ విశ్వాస మునిచెద; మఱి నా ప్రేముడియందు నీ తండ్రికంటె సర్వోన్నతమైన ప్రేముడిం జూచెదవు. (నిష్క్రమింతురు.)

రంగము ౫౩. కోటప్రక్కన నొక కాఁపురింటి గది.

ప్రవేశము. ప్రియవ్రతుఁడు, ప్రళయాంతకరాజు, హితకీర్తి, బాణభణితుఁడు, ప్రేమసింహుఁడు.

ప్రియ.—ఇచ్చట సదుపాయముగ నుండు కేవలము బయలు నీమకంటె; దీనిని సంతోషముతోఁ గైకొనుఁడు. మీ యనుకూలమును హెచ్చుసేయ నింక నాచేత నైనంత హితములం గూర్చెద; ఇప్పుడే తిరిగి వచ్చెద.

హిత.—వీరి బుద్ధి బలములన్నియు, వీరి యాతురత యెదుటఁ జెదఱి పోయినవి: దేవులు బహుమానించుత మీ కరుణకు! (నిష్క్రమింతు, ప్రియ.)

ప్రేమ.—భ్రాతృస్తోకుఁడు పిలుచుచున్నాఁడు, నన్నుఁ బిలిచి చెప్పుచున్నాఁడు, నీలుఁడు గాలికాఁడని, యంధకారపు సరస్సులో. దయఁజేసి, అమాయక, దుష్టదయ్యమును క్షమింపుము, జాగ్రత్త.

భాణ.—విన్నపము, అమాయ, శాపము నాలో, పిచ్చి వాఁడు నీమంత్రుఁడా, సామాన్యుఁడా?

వేగరావో యేటుదాఁటి విస్సి, సోదు వలనికే,—

బాణ.—దాని పడవలోనఁ జిల్లి యెక్కెటి
కాన నడయు నీతోఁ బలుకనేరదు.
వల నీవు కడకుఁ దాను రానుఁ దెగువఁ గూరదో.

ప్రేమ.—దుష్టఘాతము బీద వెంకటాయను చుట్టుకఁ దిరుగుచున్నది, పాపము వెన్నెలపులుఁగుఁ బోలె కుంచి కాళ్ళనఁజవ కూయుచున్నాఁడు, వెంకటాయ పొట్టలో రెండు తెల్ల కొట్టెలే కొంటకు. అఘోరించక్కుమో, నిన్న దయ్యమా; నికేమియు తిండి పెట్టలేను.

సీత.—ఎట్లున్నారు మీరు, దేవర? అవ్వాడువున వెఱుఁగు పడి నిలువకుఁడు. తమరు దయఁజేసి పన్నుండ్రి యీ పళ్ళు పులమీఁద బడలికఁ దీర్చుకొనరు?

ప్రళ.—ముందు వారి విచారణఁ జూచెద. సాత్యము లోఁ బిలిపించు! (ప్రేమ. కు) ఓయి, అంగితొడిగిన న్యాయాధిపతి, నీ యాసనముఁ గైకొమ్ము; (బాణ. కు.) నీవు నోయి, సహకార్యకర్తా దరయాధిపతి; బల్లమీఁద సవాలు ప్రకటనేసే, (సీత. కు.) నీవు మున్నాఁడవు న్యాయ సభాసమ్మేడ్డెన్ని, ధూర్తుఁ గొనుము నీవు కూ.

ప్రేమ.—న్యాయమ్ములో మనము జరుపవలయు.

నిదురయ మెలఁకువ నీకు నవ్వులబంటి గొల్లఁడ?
పయిపన నుండుత న్నీదు గొడ్డెలు;
ప్రోఁగుమో యొక ప్రోఁత చిటిచిన్ని నగవు
మొగమున
దాచు ఖాళ్మే హాని నీదు గొటియ మింపకు.

ఛీ! పిల్లి బూచిద వస్నది.

ప్రళ.—ముందు దాని పై నేరము మోపుము. అదియ గరళ వల్లి. ఇచ్చటనే సత్యంబుఁ జేసెద నీ గంభీర సభాసమక్షమున, అది తన్ని పంపినది నిఱుపేద రాజునిఁ, జన కన్న తండ్రిని.

బాణ.—రావమ్మ యిటు, అమ్మయ్య. నీ పేరు గరళవల్లా?

ప్రళ.—కాదని పారలించ నేరదు.

బాణ.—మన్నింపుము కనికరముతో, ముత్యాలి పిట్ట యని పొరపాటు పడితి సుమీ!

ప్రళ.—ఇదిగో నున్న దింకొకరిత, దీని క్రూరపు చూపులు చాటించుచున్నవి, చూడు, దీనిగుండె యెంత యుక్కు పాజినదో యని. నిలుపుము దాని నచ్చటే! ఆయుధము,

లాయుధములు! కత్తి, నిప్పు! న్యాయసభలో ధర్మ
చ్యుతి! బూటకపు న్యాయాధిపతి, ఎందుకు దానిఁ
దప్ప విడిచితివి?

ప్రేమ.—నీ పంచబుద్ధులకును మేలు కలిగెడు!

హిత.—అయ్యో పాపము! స్వామి, ఏమాయె మీ యో
ర్పంతయు నిపుడు, మీ రన్నిమాఱులు నిలుపుకొనియెద
మని యగ్గించి కొంటిరే?

ప్రేమ.—(తనలో.) నా కన్నీళ్లు వడియ సాఁగినవి మీఁదు
మిక్కిలియు వారిపై జాలిచే; ఇఁక నా మాయవేస
మును మాఁపు నట్లున్నవి.

ప్రళ.—చిన్న కుక్కలుం దక్కిన వన్నియు, కత్తెర, సం
పెఁగ, వెండిగుండులుఁ జూడుఁడు, నన్నుఁజూచి మొఱుఁగు
చున్నవి.

ప్రేమ.—వెంకటాయ ఋవ్వను ఫుత్తాను వానిపై. అవలికి,
ఓ కుక్కలార!

ఉండుత నీ నోరు నలుపో తెలుపో,
కోఱలఁ గొఱికిన స్వపము పోఁకిడం,
గబ్బిరొమి జోడణంగి వెఱపు టలు జాతిరో

పై కెత్తుము, ఎత్తికొనుము; మఱి నను వెంబడింపుము, తీసికొని వెళ్లెదఁ దగు చోటు నొకటికి మీరలు తీవ్రముగ యాత్రాసన్నద్ధు లగుటకు.

హిత.—డస్సి యుడిగిన ప్రకృతి నిదురించుచున్నది ఈ యూఱట నీ పెరిగిన వరముల పుంజమునుఁ గుదుర్ప నోఁపు; కాని సందర్భములు పొసఁగని యెడ నవి కుదురుట యతి దుర్లభము. (బాణ. కు) రమ్ము, సాయము సేయుము నీ యధిపుని మోయను: నీవు వెనుక నిలిచి పోఁ గూడదు.

ప్రియ.—రమ్ము, రా, పద, పో.

ప్రేమ.—మనకంటె పెద్దలు మన దుఃఖముల నే. భరింపఁ జూడఁగా, మనకుఁ బోధగాంచవు మన దుఃఖములు శత్రువులని. ఎవఁ డొంటరిగ దుఃఖములు పడునో వాఁడే చిత్తమున నత్యంతముఁ దత్తఱించు, మఱచి వెఁగులను దన స్వస్థ యవస్థల నుసుఖాలోకితములను, కాని దుఃఖమునకుఁ దోడికాండ్రు నుండిన్న, సహవాస బహుతాత్తల దాఁటి వేయఁ గల్లము, మఱి సుఖశమిల్లి సహవాస మహిమన. ఎంత చుల్లకనయ్యు నోర్వఁ జాలినదియు నాయె, చూడిపుడు నా దుఃఖము, నను నొంచునదియె రాజుగారి

బోరగింపఁగ, ఆయనకు పుత్రికాశల్యముం గని, నాకు పితృశల్యంబుఁ బోలె! వెంకటరాయ, ఆవలికి! గణుతింపుము దౌష్ట్యత్య ఘోషముల; మఱి, తఱిఁ జూచి నిన్నుఁ బ్రకటించికొనుము, ఎప్పుడు నిన్ను దోషిం జేసి కీడొనర్చిన యసత్యాభిప్రాయము నశించి, సదభిప్రాయము తలయెత్తి నిన్ను నిర్దోషియని ఋజువిచ్చి, యథాస్థితికి నినుఁ బ్రవేశింపఁ బిలిచి, గౌరవ సమాధానములం గూర్చునో తిరుగను. పిమ్మటఁ దటస్థించుత నాకును పరులకు నేటిరాతిరి, రాజు గరుమాత్రము సురక్షిత లగుత! డాఁగుము, డాఁగుము.

(నిష్క్రమించు.)

రంగము VII (గుహస్థానమరికోట)

(ప్రవేశము, కోణపాలకుఁడు, రజనీచరి, గరళవల్లి, దుష్టబుద్ధులు, సేవకులును.

కోణ —అంచల మీఁద వెల్లము త్వరితము మన పట్టభద్రుఁడు నీ పెనిమిటి యొద్దికి; చూపుము ఈ యుత్తరమును, పరంగి సైన్యము గట్టుఁ జేరినది. వెతకి పట్టుఁడు ఆమరాత్ముని గుహస్థానమి.   (నిష్క్రమింతురు కొందఱు సేవకులు.)

రజ —కఱి తీయుఁడు తడయక.

గర —తోఁడి వేయుఁడు వాని కండ్లను.

కోణ — వదలి పెట్టుఁడు వాని నాయాగ్రహమునకు. దుష్టబుద్ధి, మా వదినెగారికి సాయముంతము: నీ ద్రోహిష్టి తండ్రిపై మేము చేకొనవలసిన పగతీర్పులు నీ వెదుటనుండి కనులఁగాంచఁ దగినవికావు నీ విపుడు దర్శింపఁ బోవు పట్టభద్రులకు హెచ్చరిక సేయుము, అతిత్వరిత యుద్ధసన్నద్ధతంగార్చి: మేమును బద్ధలము తాదృశాయుత్తమునకు. మన యుంచెల వాంప్రు శీఘ్రప్రవార్తా వహులై యుండవలయు మాయిద్వతి మధ్యము. సుఖముగుత, నీకు వెయ్యంపు వదినె సుఖము నీ యాత్రకు, గుళ్ష్ఠానాష్ఠసిక.

ప్రవేశము వసుపాలుఁడు.

ఏమివార్త! ఎచ్చటి రాజు?

వసు.— గుళ్ష్ఠానేశుఁడు పంపివేసె నాతని నీకడనుండి: రమారమి ఏవురో యార్వురం ముష్పంద్రు రాజుని జోదులు, రథసాన్వేషకు లాతనికై, కలసి రాతని కోటవాఁకిట; పీరలుం మఱికొందఱు గుళ్ష్ఠా న్పరిచరులును రాజు వెంబడి ద్వారస్థరి కేగినారలు: అచ్చట సర్వాయుధ సజ్జీకృత స్నేహితులు సహస్రసంఖ్యాతు లున్నారఁట, బలుబీరము లో... వారలు.

కోణ.— తే తెమ్ము గుణ్ణము లక్ష్మి యజమానురాలికి,

గర.—సుఖమయ్యెడుం మీకు, మధురమకుటవర్ధన, మా చెల్లెలా.

కోణ.—దుష్టబుద్ధి, క్షేమము యాత్రలో.

(నిష్క్రమింతురు గరళవల్లి, దుష్టబుద్ధి వసుపాలుర

పో వెతకుడు ఆద్రోహి గుళస్థానుని, దొంగకై

పెడ రెక్కల విఱిచికట్టుక, కొని తెండి మా సముఖంబునకు.

(నిష్క్రమింతురు సేవకులు

యథార్థ న్యాయముచెప్పిన వానిపై శిరసాజ్ఞ మనవ

యరాదైనను, న్యాయనిర్ణయ సాంప్రదాయ రహితమ

మనయధికారము కాసంత యుపచారము సేయవలయు

మనయాగ్రహమునకు; దీనిని జనులు దూషింపవచ్చు

గాని నిరోధింపలేరు. ఎవ్వ రచ్చట? ఆద్రోహియే?

ప్రవేశము ప్రియవ్రతుడు, ఈడ్వఁబడి లోపలికి ద్దతి మ్రగ్గరిచెద

రజ.—కృతఘ్నశ్వ్రదజంబుకమ! వాఁడేసుమా.

కోణ.—కట్టుఁడు గట్టిగ వాని రెండు చేతులను.

ప్రియ.—ఏమని భావము. దేవేరి దేవరలార? నమిత్రములు

రింపుఁడు మీరలు నా వింద లనుమను: నా కేమియు

సము చేయకుఁడు, మిత్రములార.

కోణ.—కట్టుఁడు వాని ననుచుంబెను. (సేవకులు కట్టుదు

రజ.—గట్టిగ, గట్టిగ, ఓరి కుత్సిత వంచక !

ప్రియ.—దయాశూన్యురాలవు నీవకాని, నేఁగాను వంచకుఁడ.

కోణ.—ఈ కుచ్చికిఁ గట్టుఁడాతని దురాత్ముఁడ, బుద్ధికి వచ్చులె నీకుక్—

(రజ. వాని గడ్డమును బీఁకును.)

ప్రియ.—సదయులౌ దేవు లెఱుంగఁగ, నత్యంత నీచకృత్యము నన్ను గడ్డము పట్టి పీఁకుట.

రజ.—ఇంత తెలువు, నిట్టి చండాలుఁడునా ?

ప్రియ.—పెంకె నాతుక, ఈ వెండ్రుకలు, నా గడ్డమునుండి నీవు పెఱుకు నట్టివి, ఇవి యునురులు పోసికొని నిన్ను దూఱులు వెట్టెడి; మీ కాతిథ్యముఁ జేసిన గృహపతి నేను; నా యీ భవద్యజమాన లక్షణముల మీఁద లిట్టి యపహర్తృ హస్తములతో నిట్లోయి నవలక్షణము గ్లానింపఁ దగదు. ఏమి మీ చికీర్షితము ?

కోణ.—రావోయి, ఏమి యుత్తరము లంచెదను నీకు పరంగి నుండి ?

రజ.—సరళుఁడవగుము నీవిచ్చుఁ బ్రతివచనంబుల, డాఁగనల్లాలము, నిజము నెఱుఁగుదుము.

కోణ.—మఱియు నేఁమేమి కూటమంత్రము ల్బన్ని నాఁడవు, క్రొత్తగ నీ భూమిని గట్టెక్కిన ద్రోహుల తోడుత?

రజ.—ఎవరి చేతుల నప్పగించినాఁడవు పిచ్చిరాజును! పలుకుము.

ప్రియ.—నాకొక యుత్తరమందెను నందలి వార్తలన్నియు వట్టి యూహాలె; యదియుఱు మధ్యస్థు నొకని పంపుస వచ్చెను; శత్రుని వలనం గాదది.

కోణ.—కపటము.

రజ.— జూటును.

కోణ.—రాజు నెక్కడికిం బంపినాఁడవు?

ప్రియ.—ద్వారక పురికిఁ.

రజ.—ఏలొకో ద్వారక పురికిఁ? నీ వాజ్ఞఁ బడసితివా లేదా ప్రాణము తొలగ్గఁగ —

కోణ.—ఎందునకో ద్వారపురికి? మొదటం దానికిఁ జెప్పసీ బదులు.

ప్రియ.—కట్టఁ బడినాఁడ కంబమునకు: ఓర్చికొనవలె నీ కాటుల కంత.

రజ.—ఎందున కోయి, ద్వారకకు?

ప్రియ.—ఎందున కంటివి, చూడనోర్చను నీ క్రూరపు గోళ్ళతోఁ, పాపము! ఆయన ముసలి కన్నులఁ దోఁడివేయఁగ : మఱి నీ యుగ్రపు టక్కఱయ యాయన యభిషిక్త గాత్రముఁ గ్రుచ్చఁగం బంధికోటులు. నరకాంధకార తమిస్రయం దా మహానుభావుఁడు అరక్షిత మస్తకముతో సహించిన యా ఝంఝామారుత బాధిత యఘోరాపారావారంబు కినిసి పొంగి యెగసి తారకామండల జ్వలన సముదాయము నెల్ల నిస్తూలముఁగఁ జల్లార్ప సమకట్టె ; కాని, పాపము! ఆ ముసలిగుండె, వర్షించుమని దివములఁ బ్రోత్సహించె. అట్టి భీకర సమయమున నీ ద్వారమున వచ్చి సాలావృకములు గోలుదించియున్న, నీ వేమని యుందువు ‘అబ్బీ, ద్వారపాలక, తాళముఁ దీసివేయుము’ అని, ఇతర క్రౌర్యములెన్నిటికి నొడంబడినను : పోనిమ్ము నేఁగాంచెద దైవశిక్షు గ్రాసంబు సేయు నిట్టి వంటి యపూర్వాతి సంతాపములను.

కోన.—కాచుట యన్నమాట యెన్నటికిని జరుగదు నమ్ముము. ఓరి యుబ్బులు, పట్టుకొండు కుర్చిని. ఈ నీ కన్నులపైని నా కాలిని నదిమెద.

ప్రియ :—ఎవ్వఁడు మీలో జీవింప నూహించునో మఱపటినంబు
 కట్టను, నా సంగుఁడునాకు కొంచెము సాయము! అహాహా
 . శ్చర్యము! ఓహో దేవులారా!

రజ :—ఒకప్రక్క పెక్కండ్రను మఱియొకప్రక్కను, ఆ కొండ
 వంటివానిని

కోణ.—మానిచిటివేని దైవ శిశువు,—

మొ సే.—అప్పుఁడు మీ చేతిని, దేవర; మిమ్ములం గొలిచినాఁడ
 ను బాల్యము మొదలు: కాని యెప్పుడు సత్సేవ నేఁజేయ
 లే దిప్పుడు చాలు నాఁపుఁ డని చెప్పుటం బలె.

రజ.—ఏమి రోయి, మొఱిగెదవు, శ్వానమా!

మొ. సే —నీ కెప్పుడైన మీసముండిన ప్పూఁతిమీఁద దాన్నిలాగు
 దిప్పుడు ఈ జగడమందు. ఏమని భావము నీయది.

కోణ.—నా కమతవాఁడే! (చూసి జగడ మాడుదరు.)

మొ. సే —కానిమ్ము, అట్లయిన, రావమ్ము, కోపఫలముఁ గోసి
 కొనుము.

రజ.—నా కిమ్ము నీ కత్తిని; కాఁప కొడుకిట్లుఁ దిరుగఁబడనా!

(కత్తి తీసికొని వాని వెనుక నుండి పొడుచును.)

మొసే.—అయ్యయ్యో, చచ్చితి! దేవర, మీకొక కన్నున్న దిగదా, వానిపై కొంచెము గాయము పడినది చూచితను. అయ్యో! (చచ్చును.)

కోణ.—ఇంక నేచ్చుఁ జూడఁబోను, కాన ముమ్ముందె యడ్డగించెద. చెదరుమ, రోతపుపేశియ; ఎక్కడ నీ సోయగ మిప్పుడు?

ప్రియ.—అంతయుఁ జీకటియు ననాదరము నాయె. ఏడి నా కొడుకు దుష్టబుద్ధి? దుష్టబుద్ధి, నీ ప్రకృతి విస్ఫులింగము లన్నిటిం మంటలు కొలుపుము, ఈ ఘోరఘాతకమును సాధింపుము యీవచ్ఛక్తిత్రో.

రజ.—చాలురా, వంచక దురాత్ముఁడా! పిలుచుచున్నాఁడవు నిను రోయువానిని; వాఁడె చూపు మాకు నీ ద్రోహచింతన లన్నిటిని వెల్లడి చేసినవాఁడు: అతి సుకృతాత్ముఁడతఁడు నీపైఁ గనికరించునే?

ప్రియ.—అయ్యో నా మౌఢ్యమా! అట్లైనఁ బ్రేమసింహుఁ డపదూఱుకు లోనయ్యె, నావలనఁ బడరాని యిడుములం బడియె. సదయ విబుధుల, క్షమింపుఁడు నా యీ యపరాధముల; వానిని సంవర్ధింపుఁడు!

రజ.—పో మోఁగఁబట్టి గంటవేయుము కోటవాఁకిట ; పోనిమ్మతఁడు త్రోవను మూర్ఖుని ద్వారకపురికి.

(నిష్క్రమించు వాకిఁడు ప్రియవ్రతుఁ డట్టుక)

ఎట్లున్నది, మన్నాథుఁడ? ఏమిటి యీ చూపు?

కోణ.—గాయముం బడితిని ; వెంబడింపుము నను వెలఁదుక ; తఱుము మా కన్నులేని సైలాటకానిని ; వేయు మీ భావి సెం గుప్పదిబ్బపై, రజనీచరి, రక్తముఁ దొఱఁగుచున్నాఁడు రభస రయమునఁ ; అకాలములోఁ బడిన దీ గాయము ; సందిలి యిమ్ము. (నిష్క్రమించు కోణ. రజ. పట్టుక.)

౧ం. సే.—ఎంతటి మదుకు సైసఁ జేయ వెనుదీయను, ఇయ్యతఁను మేలే పడసిన.

మూ. సే.—అది నిడివికాలము బ్రతికిమనుచుఁ, దుదివిఁ బడసిన తొలిత్రోవ చావుకు, కోమలు లందఱు రక్కసలే యగుదురు.

౨ం. సే.—ఆ ముసలిసామంతుని వెంబడింతము మనమందఱు ; మఱియు నీ వెఱ్ఱిగుడిసె యిఁక యాయన నెట్టటుఁ జిత్తము చొప్పున నీడ్చికొని యేగునో యట్లుఁ జేయనిత్తము : వాని మాటలపిచ్చితనము ఎట్టిపనికిని నతని నియ్యకొలుపు.

మూ సే.—వెళ్లుమీవు: నేను వెళ్లి కొంచెము గోఁగునుగ్రుడ్ల గిజరునుఁ బట్టుక వచ్చెద, నతని నెత్తురుమూఁతికిఁ బట్టింపను. మఱి, భగవంతుఁడు వాళ్లపైఁ గటాక్షించుత!

(నిష్క్రమింతురు చెఱియొక త్రోవన.)



# అమృతహృదయ్య
(లేక)
# ప్రళయాంతకరాజు.



## చతుర్థాంకము.



### రంగము I బయలు.

ప్రవేశము, ప్రేమసింహుఁడు.

ప్రేమ. — మఱి మేలే యగు నిది, పరుల యవజ్ఞకుఁ బాత్రులయినామని తెలిసి యుండుట, ముఖస్తుతులు వినుచు నాస్తోతల యవజ్ఞలు తెలియమికంటె. సంపచ్ఛక్రమున నత్యధమ, యతినీచ, యతిక్లిష్ట పదార్థముగ నుండుట భవిష్యత్తును గూర్చి యాశాస్పద మయ్యెడుం గాని యెన్నటికిని భయదాయకంబు కానేరదు: శోచ్యమైన మార్పెయ్యది యన నుత్తమ స్థితి చ్యుతియె: కాని, స్థితి నైచ్యము కాలక్రమమున నానందాన్నత్యముగఁ బరిణమించు. సుఖముగ రమ్ము, అట్టి గావున, మహానిలమ

యభార మారుతమా! నీయావచ్ఛక్తితో వీచి శాధించి నటువంటి యభాగ్యుఁడు నీ వీవలుల నెంచి ప్రతి యేమి చేయఁడు గదా? పోనిమ్ము, ఎవ రిచ్చటికి వచ్చుట?

ప్రవేశము ప్రియవ్రతుఁడు, ఒక ముసలివాఁడు తోడ్కొనిరాఁగ.

మా నాయనే, యగతికుఁడై నడపింపఁ బడుచును? ప్రపంచమా, ప్రపంచమా, ఆహా ప్రపంచమా! నీదు విచిత్ర పరిణామములఁ బట్టి నిన్ను ద్వేషింపక పోతిమా, యీ జీవులము జరామరణంబులకు సంమతింపము.

ముస.—అక్కటా, మా యనుంగు సామి, నీయండ కాఁపుఁగ, నీ బాబయ్య కాఁపుఁగను నున్నవాఁడ, నీ వెను బడి యేండ్లను.

ప్రియ.—అవ్వలికి, తల్లిపొమ్మవలికి; నెచ్చెలి, తొలఁగి పో: నీ యూరడింపులు నా కిసుమంతయు మేలు చేయవు; నీకో, కీడు చేయవచ్చు.

ముస.—అయ్యొయ్యో సామి, నీ త్రోవ కనుఁబడదయ్య నీకు.

ప్రియ.—నాకే త్రోవయు లేదు; కావున నాకుఁ గన్నులు సక్కఱ లేదు: కన్ను లున్నపుడు కడగండ్లఁ బడితిని; అడుగడుగనకుఁ దొడకట్టు నియ్యది, మన సాధన సామగ్రులు మనల నసడ్డాళులుం జేయును; మఱి మన

సాధన శూన్యతయె అతిశ్రద్ధాభూతం గొలుపును మనలకు,
ఓరి ప్రియపుత్రుఁడ, ప్రేమసింహుఁడ, మోసపుచ్చఁబడిన
నీ నాయన యాగ్రహాస్పదుఁడా! నిన్ను ముట్టి చూచు
నంత దాఁక బ్రతికితినా నాకుఁ గండ్లు తిరుగ వచ్చె నని
కొందురా!

ముస.—ఏమిటి యది! ఎవరు వారు?

ప్రేమ.—(తనలో) ఓ దేవులార! ఎవఁడన నేర్చు, 'నే నిపుడు మహాధమస్థితిని నున్నా నని'? ఎప్పటికంటె నిప్పుడు అతి మహాధమస్థితి నున్నాఁడను.

ముస.—వీఁడు, పాపము! వెఱ్ఱి వెంకటాయ.

ప్రేమ.—(తనలో) దీనికిని మఱి హీనస్థితికి వత్తును కాఁబోలు అతిహీనత యనునది కానేరదు 'ఇయ్యదే యతిహీనత,' అని నోట చెప్పఁ జాలి నందాఁకను.

ముస.—ఓరోయి, ఎచటికి పేగువాఁడవు?

ప్రియ.—వీఁడేమి బికిరాల మానిసా?

ముస.—పిచ్చివాఁడు, బికిరాల పోతును.

ప్రియ.—వానికిఁ గొంచెము వివేచన యున్నది, లేని చో బిచ్చ మెట్లెత్తును? నిన్నటి రేతిరి తుపానున నిట్టె వానిఁ గంటి నొకని; వానిఁ జూడఁగనే, మానిసి యనిన నొక

కీట ప్రాయముంగఁ గానిపించె: నా కొమరుం డపుడు వాడమె నా మనమున: కాని యప్పటికిని నా మనసు వానిపై సమ్మైత్రిఁగ నుండలేదు: ఆవల చాలను వినినవాఁ డను. ఈఁగలు మాడ్కిని నాట బడుతలకు, మనమును దేవుల కగుదుము; వట్టి యాటలకే మనలం జంపెదరు

ప్రేమ.—(తనలో.) ఎట్లగు నియ్యది? చెడ్డదే యగు నీ జీవనము, తన దుఃఖమునుఁ గేరడము లాడుచు దాఁచుచుఁ, దన్ను నొరులను నగచాట్లు వెట్టుట.—మేలు మేలు నీకు, మేటి మగఁడ.

ప్రియ.—అవ్వాఁ డా దిగంబరే?

ముస.—ఔను సామి.

ప్రియ.—అట్లయిన, మాట విని, వెళ్లి పొమ్ము! నన్నుఁ బట్టి నీవు ఇక్కడికి ఒక్క మైలో ఒక్క క్రోశమో దూరమున మమ్మునఁ దిరిగి వచ్చి కలయుదు వేని, ద్వాపరపు మార్గమున, అట్లుఁ జేయుము ప్రాసేస్తంబు సంచి, మాకై పట్టుక రమ్ము కొంచెము గుడ్డ బట్ట నీ దినమొలకాని కొఱకు, వీని నే వేఁడికోనియెద నాకుఁ ద్రోవఁ జూపుటకు.

ముస.—అయ్యో బాబు, వీఁడు పిచ్చివాఁడలను.

ప్రియ.—ఇదేనయ్యా కాల వైపరీత్యము పిచ్చివాండ్రు గ్రుడ్డి వాండ్రకుఁ ద్రోవఁ జూపుట. చేయుము నా మాట చొప్పున, లేదా నీ యిచ్చవచ్చినట్లు; తక్కిన దెట్లైననుఁ గానిమ్ము, ముందు నీవు వెళ్లిపొమ్ము.

ముస.—వానికి నేఁ దెచ్చిచ్చెద నా యుడుపులలో మేలైన దుస్తుచు, దానిఁ బట్టి యేమి వచ్చినఁ గానిమ్ము

(నిష్క్రమించు)

ప్రియ—ఓరోరి, దిగంబరి—

ప్రేమ.—బీద వెంకటాయకుఁ జలి వేయుచున్నది; (తనలో) ఇంతకంటె నెచ్చుగ నీ వేసమునుఁ గులుకలేను.

ప్రియ.—రారో యీవల.

ప్రేమ.—(తనలో). అయినను తీరదు.—మేలు మేలు నీ చిన్నరి కన్నులకు; నెత్తురోలుకు చున్న దేమి?

ప్రియ.—తెలియునా నీకు ద్వారపురికిఁ ద్రోవ?

ప్రేమ.—మెట్టు కట్లు, వాకిండ్లు, గుఱ్ఱపు త్రోవ, కాలి త్రోవ. బీద వెంకటాయ తెలువు లొక్కల్పడె భీతివలన, మేలు నీకు, మంచివాని కొడుక, దుష్టభూతమునుండి! ఐదు భూతము లొకట్టిసె వేక కాలమున బీద వెంకటా-

యను : మోహమునకు, జగన్మోహనుండు ; మార్గరాజ, మార్కాసురుఁడు ; దొంగతనమునకు, బడాచోరుగాఁడు ; హత్యకు, యమఘాతకుఁడు ; తెక్కిరింతలకు, పకాపక షోఁకు, వీఁడు చిరకాలమునుండి పట్టుకొన్నాఁడు, అంతః పురదాసులను, పరిచారికలను కాన, మేలు మేలు నీకు మేటి మగఁడు !

ప్రియ.—ఇంకేమ్మ, ఈ సంచినిఁ దీసికొమ్ము, విధికృత వేధసలచే సమస్త విపత్తులకుఁ దల వాంచ నోఁపినాఁడవు, నేను దుర్దశ ననుభవించుట నీ సంతుష్టి నెచ్చుఁ జేసె దినంబులార, ఇట్లనే జరుపుం డనిశము! అనిత్యమైశ్వర్యముతో నతి విషయోపభోగముతో నోల లాడుచు, మీ ధర్మ శాసనముల డిగఁ ద్రొక్కుచు, తా మనుభవింప నంచున పరుల విపత్తులఁ జూడక, మరించి తిరుగు భోగ నిరతులు వేగముగఁ జూచుత మీ యజేయ తేజో బలముల ; అట్లుఁ జేసిన సంప్రవిభాగంబు తేర్పడి యత్యుపభోగమును నిమూలింపఁగ, ప్రతి మానిసికిని జెందును చాలినంత సౌఖ్యము ప్రపంచమునఁ గలుఁగుదువా?

ప్రేమ.—చిత్తము, బాబు.

ప్రేయ.—కొండచఱియ యొక టున్న దచ్చట; దాని యున్నత శీర్షంబు అవనతమై తొంగి చూచుచున్నది బహుభయంకరముగ, వణుగుచుఁ దన చుట్టిన యగాధము లోనికి; నీవు సేయవలసిన యుపకార మే మన్న, నన్ను దాని యంచునకు, గొంపోయి చేర్చుము, నా కని నీవు సహింపవలసిన శ్రమమునకు ఘూర్ణుఁ జేసెద నాయొద్ద నుండు నెద్దియో విలువైన దొకండు నిచ్చి ఆకడ నుండి నా కెవరుఁ దోడు కావలసి యుండరు

ప్రేమ.—ఇమ్ము నీ సందిలి; ఓిరవెంకటాయ పిలిచి కొని పోవు నిన్ను. (నిష్క్రమింతురు.)

రంగము II ధవళశర్మ పట్టభద్రుని నగరు యెదుట.

ప్రవేశము, గరళవల్లియు, దుష్టబుద్ధియు

గర —స్వాగతము, ప్రభువర; విచిత్రము నాకు, నా యుపరుష పురుషుండు మనలకుఁ గాన్పింపలేదు మార్గమునందు.

ప్రవేశము వసుపాలుఁడు.

ఓ రోయి, ఎక్కడ నీ నాధుఁడు ?

వసు.—దొరసానిగారు, లోపల: ఎన్నటికిఁ బురుషుఁ డింత మారితే దాయనం బళై. తెలిపె తాయనకు గష్టెక్కాన

సేనను గుఱించి: అంమనకు లేనగవు నవ్వె: దొరసాని గారు వచ్చుచున్నా రంటిని; ఆయన యుత్తరము 'మఱి కీడాయె' నని; గుళస్థానుని ద్రోహము, నాతని కొమారుని భక్తిపూర్వక కైంకర్యము, న్నేను వర్ణింపఁగనే, శుంఠకాయ యని నన్ను తిట్టుచుఁ, దలక్రిందులఁ ద్రిప్పితి ననియె: ఎయ్యె దతనికి రుచింప రానిదో, యదియే యాయనకు మనోహరము తోఁచు; ఎయ్యది రుచ్యమో యది ద్వేష్యము.

గర.—(ధృష్ట. కి.) అట్లయిన నీ వంతకుపైఁ దాఁటి పోవలదు ఈ దంతయు నాతని పశుప్రాయపు భయాక్రాంత నైజము; ఇందున జేసిని యత్నింపఁ దెగువ పూనఁడు. మఱియుఁ దాఁ పౌరుషమున నెదుర్కొనవలసిన యిక్కట్టులు లేనట్టె సాధించువాఁడు. త్రోవలో మన మని కొన్న యభీష్టములు యథార్థములై కావచ్చును. మఱ్లమో, దుష్టబుద్ధి, నా, మఱఁదియొద్దకి; ఆతని సైనిక గణనంబులఁ ద్వరిత పఱచుము, మఱి యతని బలముల నడపుము: నా ఇంట నే కోఱుముట్ల మార్చుకొనవలయు, నా, మగని చేతికి పంపెకోల నివ్వవలయు. ఈ సత్వకమైన పని వాఁడు మనకు నడుమ రాయబారి యగ్నాఁడు: నిడివి

నాళ్లకు మునుపే విను సవనవము ప్రాప్తింపఁ బోవును,
ఒక యజమానురాలి యాజ్ఞను, నీకె తెగువ మీఱిన నీ
మేలునకై యుద్యమింప. తాల్చుము దీనిని; మిగుల్చుము
మాటల. (అభిజ్ఞాన మిచ్చును.)
శిరము నొఱగింపుము; ఈ ముద్ర, పలుకఁ దెగించిన, నీ
సర్వాత్మల సువర్త్తకుఁ జెలరేఁపును, భావంబు కనుము,
భాగ్యంబు కొనుము.

దుష్ట.—నీ వాఁడన, ప్రాణ మరణముల.

గర.—నా యతి ప్రేష్ఠ గుళిస్థాన్. (నిష్క్రమించు. దుష్ట)
ఓహో, ఎంత ఖేదము మగవానికి మగవానికి! నీకుఁ
దగును ఆఁడదాని యూడిగములు: నా శత్రుఁడు గదా
యిప్పుడు నా శిబిరమును దురాక్రమించినాఁడు.

వసు.—మాతాంబ, ఇదిగో మా పట్టవష్ఠనుఁడు. (నిష్క్రమించు.)

ప్రవేశము ధవళవస్త్ర.

గర.—నీ యూలపు సష్టూరా త్రైలిని.

ధవ.—ఓ గరళవల్లీ! నీ ముఖమున నా కఱకు కిరువలి
తూర్వాస్ప దుష్ప్రి వెలయుచే యువు నెపు. నీ స్వభావము
నాకు భయావహ మగుచున్నది. తన యుత్పత్తి పరా

భవంబు సేయు నట్టి స్వభావము ఎట్టి నియలిలోను నుండ నేరదు ; తననుఁ బుట్టించి తన పాలిచ్చి పెంచిన చోట్టు నుండి విఱిగి వేఱుపడ నాయిత మగు నా కొమ్మ, తప్పక వాడి యెండి పో వలసినదే కదా?

గర.—చాలు నిలుపు ; నీ యుపమానము రసాభాసము.

ధవ.—జ్ఞానమును సత్త్వమును హీనులకు హీనంబె యగు : ముఱుకులకు ముఱుకులె యభిరుచించు. ఏమిఁ జేసిన దానవే? పులులు కాని మీర ల్బ్రతిక ల్కారు, ఏమిఁ జేసినారలే మీరలు? కన్న తండ్రి, దయా సముద్రుఁడు, నయోధికుఁడు, పండిన పండు, ముక్కఁ ద్రాఁటితో లాగఁ బడు నెలుఁగు గొడ్డును నాలుకతో త్రాకు నాయన. నట్టి మహానుభావుని, ఓ మ్లేచ్ఛులార, యో పరమ చండాల దౌర్భాగ్యులార! వెట్టిదానిఁ జేసినారలే. నా యనుంగు తమ్ముఁడు (షడ్భుకుఁడు) మిమ్ముల నిట్లుఁ గావింప సమ్మతించెనే? పురుషుఁడు, రాజస్యుఁడు, ఆయన పొంత నంత భాగ్యముం బడసినవాఁడు! గగనంబులే వలపక యున్న, తమ పసువు ఛారణులఁ బ్రత్యక్షమ్మావున నతి వేగముఁగ నిట్టి నీచ యపరాధనుల నిగ్రహించుటకు, ఫల మెమి వచ్చు, మానుష సమునాయమె బలాత్కరించి మానుష

సముద్రాయముచేఁ గబళీకరించు, పారావారపు ఘోరా కార మకరాది జలచరంబుల మాడ్కిని.

గర.——పాలి కారిజపు పిజికి కోఁచ! అపకారములకుఁ దగి నట్టి చెంపల వాఁడా! అపకారముల మోయ నోఁపు తల కాయ వాఁడా! ఇయ్యది శమనము ఇయ్యది నూనము, అని వివేచనంబు సేయఁ జాలిన నేత్రములు లేని కను బొమలవాఁడా, ధూర్తులు శిక్షింపఁ బడు నపుడు తమ ధార్ష్ట్యము నెఱవేఱక మునుపు, వారికై జాలిపడువారు మూఢులె యని తెలియని పరమ మూఢుఁడ, యెక్కడ నీ దుందుభి? పరంగివారలు తమ టెక్కెముల విప్పి రరు, ఈ నిశ్శబ్ద భూమిని, ఱెక్క తురా బొమిడికఁ దాల్చి నీ రాష్ట్రమును వెఱపింప సాఁగెదరు: ఇట్లుండఁగ నీతుల మూట విప్పుచు మిన్నక కూలఁ బడి నాఁడవు; మఱి మొఱ లిడియెదవు 'అక్కటా, వాఁడేలఁ జేయు చున్నాఁ డిట్టులు?' అనుచును.

ధవ.——నిన్నే చూచికో, పిశాచమా! ధర్మ వైరూప్యము పిశాచమునందు యుక్తము కావున, నంత భయావహము కాదు, క్రూర సుందరియందుఁ బోలె

గర.——ఓరి యప్రయోజక మూర్ఖుఁడా!

ధవ.—ఓసీ, స్వ స్వరూపమును క్రోధమున భేదించి యాచ్ఛాదింప గోరిన దానవా? లజ్జ లేదు నీకు? నీ స్వరూపమును పైశాచంబుగా భావింపకుము. నా రోషము తో డ్కొనన్నా చేతులం బరుచుట తగ వగుసేని, కండల నెముకలం జెసికించి తునియింప నోపు: వాస్తవముగ నీవు పిశాచమె యయినను స్త్రీ రూపము నిను రక్షించుచున్నది.

గర.—ఔర, నీ మగతనం బిపుడు—

ప్రవేశము ఒక దూత.

ధవ.—ఏమి సమాచారము?

దూత.—ఓ, నా బంగారు సామి, కోణపాలక పట్టభద్రులు జమునిఘాలాయిరి; వారి భృత్యుడొ సంహరించె, గుళస్థానుల కండవ కంటిని వారుగ్రుడ్డిపడ జలికించు తటిని.

ధవ.—గుళస్థానుని కన్నులే?

దూత.—వారు పెంచిన భృత్యుం డొకండు, పరితాప ప్రకంపితుండై, యా క్రౌర్యం బోసరింప నీక తా నడ్డు పడియె, కత్తిని వాంఛుచు దన గొప్ప శావందున కెదుట: వారు నవుడు దానికి బ్రకుప్తులై, ఎగిరి పడుడును వానిపై, నటికి చంపిరి యందటి నడుమను; కాని వారు మాత్రము

తప్పులే దా హానికర ఘాతముల్ ; దీనిచే నశించిరి పదం పడి.

ధవ.—ఇది తేటపఱచు చున్నది మీర లున్నారని పైన, నోన్ని న్యాయ పాలకుల్ ; ఈ యధోలోకపు మా మ హాపరాధముల నెంత సత్వరము శిక్షించితిరో! కాని, పాపము, ఓ గుళస్థానుఁడ! కోల్పోయెనా యతఁడు మఱి సటి కంటిని?

దూత.—కెంటర్సి, కెంటర్సి, పట్టభద్రులు. ఈ పత్రము, మాతాంబా, కోరెడు, త్వరితోత్తరముకు. ఇది మీ చెల్లెలి పనుపు.

గర. (తనలో.) ఒక దానిని దీన నా యుల్లము రంజిల్లె పెల్లుగ. కాని నా చెల్లెలి ముండతనమును, మఱి నా గుళస్థుఁడు ప్రక్కన నుండుటన్, నా మనోరథము నెల్ల నొక్కటం బడఁగొట్టి నా జీవనము నేవముఁ గావింప వచ్చు; మఱి దానిని, ఈ సుద్ది యంత పులుపు కాదు. చదువుకొని, ప్రతిఁ బంపెద. (నిష్క్రమించు.)

ధవ.—అతని కొడు కెక్కడికిం బోయె నాయన కనుగ్రుష్టు వారు తోఁడు చుండఁగ?

దూత.—ఇచ్చటికి మన పట్టభద్రతో వచ్చి యుండె.

ధవ — లేఁడే యతఁ డిక్కడ!

దూత — లేఁడు మహాప్రభో; తిరిగి వెళ్లు చుండఁగాఁ దెరువునఁ జూచితి నతని.

ధవ — ఎఱుంగున యతఁ డీ దౌష్ట్యముగా?

దూత — చిత్తము, మహాప్రభో; అతఁడే కొండెముం మోసి తండ్రి కెదురుగ; వలసియె యిలు లేచి వచ్చి వారి దండన కడ్డు లే కుండను.

ధవ. — గుళస్థా, సజీవుండనోయి నే వంచింపను నీదు భక్తికి రాజుపై, మఱి పగ తీర్పను నీ కనునప్తికివి. రావో యీ డకు విచిత్రము: చెప్పుమ యన్నియు నాతో నీ కింకేమేమి తెలియునో. (నిష్క్రమింతురు.)

రంగము III. పరంగి దండు విడిది, ద్వారపురి చేరువ.

ప్రవేశము హితకీర్తియు, నొక సుజనుఁడును.

హిత. — పరంగిరాజు ఏ లంత దెబ్బాటున తిరిగి వెళ్లెనో యెఱుఁగుదురా కారణము?

సుజ. ఎవ్వోదో తమ రాష్ట్రమున న్యూన ముంచి వచ్చిరి కాంబోలు, నది యిపు డిక్కడ వచ్చిన మీఁదట జ్ఞప్తి పడియె? సంతతవ స్వరాష్ట్రమునకుఁ జెల్లు భయము

నపాయముం గావునసే, వారి స్వయం మరలఁబాటు
మిగుల నపేక్షితము నవశ్యకము నాయె.

హిత.—ఎవరి నాయన యుంచి వెళ్లినారిచట సేనాపతిఁగ?

సుజ.—పరంగి బలాధ్యక్షులు, సీమంతుఁడు పరంతప సేనుఁడు.

హిత.—మీ జాబులవలన రాణిగారికి దుఃఖ చేష్ట లేవైనను
బుట్టెనా?

సుజ.—చిత్తము, దేవర; ఆయమ వానిఁ దీసికొని నా
యెదుటనే చదివె; చదువు చుండఁగ నడుమ నడుమ
నింపు టశ్రుబిందువ్రం దొఱఁగె నాబిడ తన లేఁజెక్కులి
పయిని; కానుపించె నామె తన రాగంబుపై రాణిఁ గ, నే
రాగము ఇనుమిక్కిలి యూనతి మీఁది యామెపై రాజు
కాఁ గడఁగనో.

హిత.—ఓహో, అయిన నామె తహతహ పడినె.

సుజ.—ఒక్కఱి పడదు; ఓర్పును వెతయు నొండొంటిని
మార్కొనె, నామెకు నెచ్చు టందము నెయ్యది కొలుప
నేర్చునో యనుచును. మీరు చూచియే యుందురు
ఎండయు వానయు నేక కాలమునఁ గాయనుఁ గురియను:
ఎలనగవులుం గనుబొట్టులు నట్టులె తోఁచె నయినను
మెఱఁగు మీఁది యుండె వానికంటెను: అక్కెంమోవిసఁ

జెల్లఁగిన యీ కులుకు చిట్టెలనవ్వులు తెలియ నట్లుండె నా వాలు కన్నులం గానఁ జేరిన విందులన్; ఇవియు నెలవుఁ బడసి వాని వలన ముత్యముల మాడ్కిఁ జిరికె, వజ్రములనుండి, ముక్తసరుగ, అలజడియు నందఱికిం బలుఁ ముద్దు కొలుపు నపురూప వస్తు వగును, అందఱికి న్నా యందమె పొసఁగి యుండిన.

హిత.—ఆబిడ యేమియు నోటి మాటన లేదా?

సుజ.—తథ్యము, ఒకమఱొ యిరుమఱొ వగర్చి, నాయన! యంచు, నిట్టూర్పులు వెలువడ, న దేమో తన డెందము నొక్కి నట్టులు: అఱచె, 'అక్కల! అక్కల! మానవతుల కపమానములార! అప్పల! హితకీర్తి! నాయన! అక్కల! ఏమిటి, ప్రళయ మారుతము లోనే? పెంజీకటి రాత్రినే? దయ యనునది పదార్థము కాదు!' ఇటు వాపోవుచుఁ గదల్చి వేసె నా పవిత్ర తీర్థము నా స్వర్గపు నేత్రముల నుండి; పదంపడి చాలించి కొనియె వాపోకను; మఱి లేచి వెడలె వగచి దుఃపిల్లను మాత్రము.

హిత.—ఆ చుక్కలె, మన పైని యీ చుక్కలె, మనయుల్లంపు గోవములు నేలుచున్నవి; లేని యెడ, నచ్చము నొక్కటె

పతియు సతియుఁ బుట్టించ నేర రిట్టి కట్టిదురు గొనముల పట్టులక్. అట్టుపిదప మీ రెపుడు నామెతోఁ బలుకు లాడ లేదో?

సుజ.—లేదు.

హిత.—ఇయ్యె దెపుడు రాజు మరలక మునుపా?

సుజ.—కాదు, పిదప.

హిత.—మంచి దయ్యె, యీ ఓద పుర పుర పొక్కెనుఁ ప్రళయాంతక రాజుగారు పురములో నున్నారు: వారు ఎప్పుడో యొకతఱి, నెఱుకపూఱిమి ప్రొద్దునఁ దెలిసిఁ దెచ్చుకొందురు మన మెందున కిచటి కేతెంచినారమో; కాని తమ కూఁతురి మాత్రముఁ జూడ నొప్ప రొక నలు సంతయు.

సుజ.—ఏలొకొ, యటు, కూరి మయ్యె?

హిత.—బలిష్ఠ యపమాన మొక్కటి వారిని బాధించుచుఁ గనులం బొడసూపుచుఁ దాఁ జేసిన యప్రియంబును, దండనముం మఱిమఱి మోఁదు చున్నది. ఏ నిర్దయ యాయన యాశీర్వాదము నామె కీనీక యపహరించెనో, పరదేశపు కష్టనష్టముల కామెనుం బాత్రురాలిఁ జేసెనో, ఆమె యొక్క విలువ యెచ్చిన స్థితి స్వతంత్రతల నాయన కుక్క.

బుద్ధి కూఁతులకు స్వాధీనపఱచెనో, ఆ నిర్దయయు దాని ఫలములును నాయన మనసును బలు విషపు కొండులతో చుఱుకుచుఱుకు మని కుట్టుటం బట్టి, యందునఁ బుట్టిన చిచ్చుఱ లజ్జయే యమృతహృదయం దర్శింపనీక యాయన నడ్డు పెట్టుచున్నది.

సుజ.—కటకటా! పాపము! దొరవారి సంకటం!

హిత.—ధవళవర్మ కోణపాలకుల బలములను గుఱించి యేమియు వినలే దేమి?

సుజ.—ఔ నౌను, పొక్కు చొప్పున, వారు సన్నద్ధులే.

హిత.—మంచి దయ్యా, మిమ్ము నేఁ గొంపోవెదఁ బ్రళయాంతక ప్రభువుల సన్నిధికి, నచ్చట నాయనకు శుశ్రూషింప మిమ్ముల వదలిపెట్టెద: కొండొక ముఖ్య హేతువు కొంత తడవు నను బ్రాపటీకమునం గప్పియుంచును: నేను అముక పురుషుఁడని కలరూపు తెలిసిన, నిప్పుడు మీ రొసఁగు నాతోటి పరిచయమున కనుతపింపఁ జాలరు. మనవి చేకొనుఁడు, నా వెనువెంట నడవుఁడు.

(నిష్క్రమింతురు.)

రంగము IV. అదియొక గుడారము.

ప్రకోళము దుందుభి ధ్వజములతో, అమృతహృదయ,
చరకుఁడు, బంటులును.

అమృ — కట్టా, ఆయనే: ఏల, ఇంతకు మును పె కానుపించె నాయన, గాలి మోఁదిన కడలి వడువునఁ గొందలంబు వడుచు, గొం తెత్తి పాడుచు; తలకుఁ జుట్టుకొని బొమి డిక శైవడి, బూజుకంపు ధూమగఁడిని చాలు కలుపుల ను, గ్రచ్ఛ రెమ్మలం గన్నెరు వేళ్లను, దూలగొందులం గోకిలాక్షి పుష్పములను, గురుగాకుఁ, మఱి మనము తిన్న తెఱడి ధాన్యపు చేనులం జెరుగునట్టి పనికిరాని కలుపు లన్నిఁ టికా. ఒక నూర్వురం దళమునుఁ బనుపుఁడు: ఎత్తుగ నెది గిఁయుంను చేనుల నొక్కొక యెకరపు స్వాతకుఁడు, ఆయ న మా కన్నుల కెదుట తోడ్కొని రండు. (నిష్క్రమించు నొకపడవాలు.) ఏమి చేయనోఁపు మానుష పాండిత్యము త్రిప్పించుటకు నాయన యపహృత చిత్తస్వాధీనతకా? ఎవఁ డట్టి సహాయముఁ జేయునో య తని కిచ్చెద నిలువు దోఁపిడి న్నా కలిమి నెల్ల.

వైద్యు — ఉపాయ మున్నది, తల్లీ; మన ప్రకృతికిఁ బోష ఖరాలు శాంతియె; అయ్యదే లే దాయనకు; దాని నా

యనయం దుత్పాదింపను, ఎన్నెన్ని యో మూలిక గ్గలవు; అవి యపూర్వ గుణములు కలవి; నెంజలికాని నేత్రమును మూయించు శక్తి కలవు వానికి.

అమృ.—సమస్త కల్యాణ రహస్యములార! ఈ పుడమిలోని సమస్త యప్రకటిత యోషధీ మహిమలార, మొలచుచును నా కన్నీళ్లను గైకొనుచు! ఈ సత్పురుషుని తుందుడుకు కుదుర్చుటకు నాయము చేయుడు! వెతకుడు, వెతకుడు మా యయ్యను; ఆసిద్ధ జేసితి మేని, అడ్డ కట్టరాని యా గ్రహ వశమున మాయించి కొనియెడి వివేకపు కళ్లెంబు లేని స్వజీవనమును.

ప్రవేశము ఒక దూత.

దూత.—సుద్ది, రాణమ్మగారు; బ్రిటానియ బలము లిట్టు ప్రక్కకు మొనకట్టి వచ్చుచున్నవి.

అమృ.—మునుపే యెఱింగినారము: మా యాయితమును వారి నెదురు చూచుచునే యున్నవి, ఓయి ప్రియజనకుండ, నీ పనిమీఁద నే నే నిపుడు బయలుదేరుట; కావున నే, ఘనుఁడు ఫరంగీశుఁడు నా శోచనమును గోఁజాటపు కన్నీళ్లను కరుణించినాఁడు. భూ కాంక్షతో పిఁగి మమీ యుద్ధసన్నాహంబునఁ బూనలేదు; మఱి కేవలము భక్తియె,

అకలంకిత భక్తియు, మా వృద్ధ జనకుని స్వతంత్రమునే మన్నుల నీ యుద్యమమునకుఁ బ్రోత్సహించె. త్వరితము లోనే ఆయన వర్తమానము వింద్దుఁ గాక, ఆ మూర్తిని కనులారఁ గందుఁగాక! (నిష్క్రమింతురు)

రంగము ౫ గుళస్థానుకోట.

ప్రవేశము రజనీచరి, వసుపాలుఁడు.

రజ.—అయితే, మా బావగారి బలములు బయలు వెడలిన వా?

వసు.—చిత్తము, తల్లీ.

రజ.—తామే రూపుమాపున నందున్న వారా?

వసు.—అమ్మయ్యా, మిగుల బలవంతముమీఁద: మీ యక్కయే మేలు జోసు.

రజ.—దుష్టబుద్ధి ప్రభువులవారు మీ ప్రభువులవారితో నింటఁ గలసి మాట్లాడ లేదా?

వసు.—లేదమ్మగారు.

రజ.—ఏమని యభిప్రాయము మంతు నాయనకు మా యక్కయ యుత్తరమున.

వసు.—నాకుఁ దెలియ దమ్మ దొరసానిగారు.

రజ.—దేవకృప, ఆయన పనుపఁ బడినారు మిక్కిలి యవసర విషయమున. కుహా మాధ్యమాయె, గుళక్షానుని కనులు మిడియఁగ, సతని జీవింప నిచ్చుట: అతఁడు వెళ్లిన చోట్ల నెల్ల నఖిల హృదయముల మనల కెదురు త్రిప్పుచున్నాఁడు: దుష్టబుద్ధి వెళ్లినాఁడు కాఁబోలు, ఆతని వందురునకుఁ జాలిపడి, యతని యంధకారపు జీవనమును మోచనము సేయింపను! అదియునుం గాక, పగతుని సేనాబలముఁ బరికింపను.

వసు.—అట్లయిన వారి వెనుకఁ బడక తప్పదు, రాణిగారు, ఈ జాబు కోసరము.

రజ.—మన దళములు రేపు బయలుదేఱును మాతో నుండుము; త్రోవలు అపాయకరము లఁట.

వసు.—కుండ లేను, మాయము; నా సీమాటిగారు ఈ పనిని మిక్కిలి యవసర మని యానతిచ్చినారు.

రజ.—ఆమె దుష్టబుద్ధిగారి కేల వ్రాయవలె? ఆబిడ యభిప్రాయముల నీవు కొటిమాటఁగ మోసికొని వెళ్లలేవా? ఒక వేళ, ఏయ్యదో—ఇయ్యది యని చెప్పలేను: నిన్ను మిగుల నన్నానిఁచెద, ఈ జాబును నేను పగుల్చఁ గొట్ట నిమ్ము.

వసు.—అమ్మగారు, అంతకంటె నేను—

రజ.—నే నెఱుంగుదు నీ నీమాటికిఁ బెనిమిటిపైఁ బ్రేమ లే దని: అ దేమో నాకు నిక్కమె: క్రిందటి మాఱు ఇచటి కి వచ్చి యున్నపుడు, ఆయమ వలపు క్రేగన్నులు, మా మినుకుఁ జూపులును వైచుచుఁడె, ఘనులు దుష్టబుద్ధులఁ గోరి, పెచ్చునకు నే నెఱుంగుదు నీ వాయమ కంతరంగ భృత్యుఁడ వని.

వసు.—నేనా, అమ్మయ్యగారు?

రజ.—తెలియుఁ దాని నమ్మికమె పలుకుదానను: నీవు తాదృ శుండవే, హెచ్చాడకుము: కావున నా యానతి నీకు, ఈ కమ్మను కొనిపొమ్ము: నా నాథుఁడు చనినవాఁడు: దు ష్టబుద్ధులు నేనును మాటాడినారము; నీ నీమాటికిఁ గం టెను నా చేతికె యతఁడు మిగుల ననుకూలుఁడు: హె చ్చు సమాచారమును సంపాదింపఁ గలవు: ఆతని నీవు కనిపట్టితి వేని, ఒక మాట, దీని సతని కిమ్ము: మఱి నీ య జమానురాలు నీవలన నింత పుట్టునకు వినఁగనే, దయ చేసి, యీ పెత్తోఁ జెప్పుము, తన తెలివినిఁ గ్రిప్పించుకొ మ్మని, ఇమ్మెయి, సుఖ మగుత నీకు, ఒక వేళ నా గ్రుడ్డి

కైలాటకాఁడు నీ వీనులంబడెనా, బహుమానము బడయు నెవ్వఁడు తునుమాడునో వాని శిరమును.

షను.—మాయురె, యతనిఁ గనఁ గల్గునేని, అమ్మయ! తెలుప నోఁపుదు నే నెవరి ప్రక్కని జోదునో.

రాజ.—మేలుఁ గాంచు మీవు. (నిష్క్రమింతురు.)

రంగము VI పొలములు ద్వారపురిప్రాంతమున.

ప్రవేశము, ప్రియవ్రతుఁడును, ప్రేమసింహుఁడును, కాఁపువేసముఁ దాల్చి.

ప్రియ.—ఎప్పుడుఁ జేరఁ గలము ఆ కొండ కొనకు?

ప్రేమ.—ఎక్కుచునే యున్నాఁడ వీవు; చూడుము, ఎంత బడలుచున్నారమో.

ప్రియ.—నేల చదనుఁగ నున్నట్లుఁ దోఁచుచున్నది నాకు.

ప్రేమ.—భయంకర ప్రపాతము: వినుము, సముద్ర ఘోషము వినఁ బడుచున్నదా?

ప్రియ.—లేదు, లేనే లేదు.

ప్రేమ.—ఏమిటిది, నీ యితరేంద్రియములు న్యూనము లగుచున్నవి, నీ కన్నుల నొగులువలన.

ప్రియ.—అటులనే కావచ్చును, బాధము: నీ గొంతు మాఱిన ట్లున్నది: ఇందాఁకటికంటె మేలు నుడువులుం మేలు నాయముఁగ పలుకు చున్నాఁడవు.

ప్రేమ.—మోస పోయినాఁడవు; ఎందును మాఱలేదు బట్టలం దప్ప,

ప్రియ.—నాకుఁ దోఁచెడిని, నీవు మునుపటికన్న బాగుగనే పలికెద వని.

ప్రేమ.—రా వోయి: ఇదియె చోటు: కదలక నిలువుము. ఎంత బీతు ఎంత తిరుగుడుగ నున్నది, ఈ పెనులోఁతునం గనుల వేయుట! నడిమి యాకసమున నెగురుఁగాకులు, నెట్టకాలి కాకులును దుమ్మెద లంత లావుగనుఁ గానుపింపవు: సగము త్రోవ దిగువఁ ద్రాఁట నొకఁడు వ్రేలాడు చున్నాఁడు పచ్చాఁకుఁ గోయుచు, ఎంతభయంకర వ్యాపారము! తన తలపుఱ్ఱెయంత చిన్నఁగ నున్నవాఁడు: కడలిగట్టున నడచు బెస్తలు చిట్టెలుకలం బలెఁ గనుపట్టు చున్నారు: అల్లదిగో నా పొడుగాటి లంగు రోడ, దాని చిన్న దోనంత సన్నగిల్లినది; ఆ చిన్న దోనె మఱి చూపునకుఁ దోఁప నంత చిట్టి తెప్పకుండ కరణి! లెక్కింపఁ దరము కాని యా పనికిమాలిన గులకఱాళ్లపైఁ గోపముతో మోఁదు

చున్న యీ గొణుఁగుడు కరడములు ఈ యెత్తున వీనఁబడవు, ఇఁక నేఁ జూడవలవను; మెదడు తిరిగి కనులు మఱిఁగి తలక్రిందలుఁ దొరలి పడుదు నేమో, భయము వేయుచున్నది.

ప్రియ.—నీ నిలచు చోట నన్ను నిలుపుము:

ప్రేమ.—నీ చేతిని చాఁచుము నాకడ: తుదియంచున కడుగు దవ్వున నున్నాఁడ విపుఁడు, ఈ పుడమిలోని కలుము లన్నియు నిచ్చినను నెగిరిపడి దుముకను.

ప్రియ.—వదలిపెట్టుము నీ చేతిని. ఇందమ్ము, నెచ్చెలి, ఇంకొక్క సంచి; అందున్న దొక రత్నము బీదవాఁడు కేలఁ బట్టి నువ్విళ్లూరఁ దగినది: అచ్చరలు నమరులును నీయెడ దాని వృద్ధిఁ బొందింతురు కాక! నీవుదూరమునకుఁ దొలఁగుము: నాయెడ సెలవు పుచ్చుకొనుము, నీవు కదలుట నే విననిమ్ము.

ప్రేమ.—మంచి దిపుడు, సెలవుఁ బుచ్చుకొనెద, అనఁగుటయ్యా.

ప్రియ.—మనః పూర్వకముఁగ.

ప్రేమ.—ఈయన నిరాశత నిట్లు వెక్కిరించు టెందున కంటె, దానిని నివర్తింపను.

ప్రియ.—ఓ బలిష్ఠ దేవులార! ఈ ప్రపంచము నిపుడు నేఁ బరిత్యజించెద; మఱి మీర ల్చూచుచుండఁగ నా గొప్ప విపత్తును వినయముతో దునిపివేసెద: మఱి కొంత కాలము దీని నే సహింప నోఁపి, గొప్పవియు నడ్డగింప రానివియు నగు మీ యాజ్ఞలఁ గూర్చి నే మొఱలిడు దోసము నొడిఁ గట్టక యుండ నేర్చిన, నా యాయుష్యపు టసహ్యాంతమును, వత్తి బొగ్గుబోలె తనంతట నదియె కాలి పోవ నిత్తు. ప్రేమసింహుఁడు బ్రదికి యుండిన, నయ్యాలు, దీవింపుఁ డతని. ఓ రోయి, వెంకటాయ, సుఖము నీకు.

(బోరగిలఁ బడును)

ప్రేమ.—వెళ్లిపోయినాను, బాబు: సెలవు.—
అయినను నేఁ జెప్పలేను, భావనాశక్తియె యపహరించ నోఁపదా ప్రాణభాగ్యము నని, యా ప్రాణమే యియ్య కొని యుండఁగ నపహరింపఁ బనుటకు; తాఁ దలఁచిన యచటనే యీయన చేరియుండిన, ఇంతలోనే నశించి యుండును చింతనాశక్తి సజీవుఁడ, నిర్జీవుఁడ? ఓయి, బాబు! ఎవ రండోయి, భద్రులు! వించున్నారేఁ టండి! పలుకరు! ఇట్టిటె యీయన గతింపవచ్చు, దృఢము దైవాధీనము, తెప్పజిల్లు చున్నాఁడు. ఎట్టి వాఁటం డోయి, మీరు?

ప్రియ.—ఆవలికి, చావనిమ్ము నన్ను.

ప్రేమ.—మీరు కేవలము బూరుగు దూది యయినను, ఈఁకలు, గాలి యయినను, ఇన్ని బారలు దిగువ కుఱుకుటను, గ్రుడ్డు పడినట్లు వే తునియలై చెల్లచెదఱి యుందురు, కాని యింక మీ యూపిరి యాడుచున్నది: బరువు బాడమువారు, నెత్తురు పీర లేదు: పలుకు లాడెదరు; పటు గాత్రులు. పది కూపకములఁ గూర్చినా నొండొంటిపై మీరు నిలువుగఁ బడిన యున్నతమునకు సరిపోదు: మీ సజీవత యద్భుతము. పలుకుఁ డయ్యా మఱి యొక మఱి.

ప్రియ.—పోనిమ్ము, నిజముఁగ నేఁ బడితిన, లేదా?

ప్రేమ.—కడలి యెల్ల నుండు ఈ తెల్ల బలపపు కొండ యొక్క భయంకర శిఖరము నుండి. పైనికి నిక్కి చూడుఁడు; క్రీఁదు గొంతుల యేటిరింతయుఁ గనుపడదు, అంతకంటె విననుఁ బడ దా జవ్వన: ఒకమఱి తల యెత్తి చూడుఁడు.

ప్రియ.—అక్కటా, నాకు కండ్లు లేవు. దౌర్భాగ్యత కింత మాత్రము భాగ్యమును లేదా, మరణము ద్వారా తన్నుఁ దా సమాప్తిఁ జెందించు కొనునంత? ఒక్కించుక యా

దరు వుండె, దౌర్భాగ్యము ప్రజాపీడకుని యాగ్రహ
మును మోసపుచ్చి, యాతని గర్విష్ఠ హరాత్కారమును
విఫలంబుఁ గావించు దనుకను.

ప్రేమ—మీ చేతిని చాఁచుఁడు; పైనికి: అట్లు. ఎట్లున్నది?
మీ కాళ్లు వశముఁగ నున్నవా? నిలిచెదరే.

ప్రియ.—మిగుల బాగుఁగ, మీఁదు మిగులను బాగుఁగ.

ప్రేమ.—ఇయ్యది యద్భుతములో నద్భుత మాయె. ఈ
నిట్రవు కొండ నెత్తిని, అదే మా బండము మీవలన వీడెనే?

ప్రియ—ఒక నిఱుపేద దౌర్భాగ్యవు బికిరాలమారి.

ప్రేమ—దిగువ నే నిలచి చూడఁగా నతని కండ్లు రెండు
చంద్రురులుగాఁ గనుఁబడియె. వే ముక్కు లుండె; కరడ
ములు పేర్చిన కడలిఁ బోలె మెలకలం మిట్టపల్లముల
నొప్పిన కొమ్ము లుండె. ఏదో భూతము కాఁబోలు:
కావున, ఓయి ధన్య పితరుఁడ, నిర్ణయము నూహింపుము,
పరిశుద్ధాత్ము లగు దివిషదులు, మనుష్యుల కసాధ్యములఁ
దమ బిరుదులుఁగఁ గాంచినవారలు, నిన్ను సంరక్షించినా
రని.

ప్రియ—ఇప్పుడు నా స్మరణంబునకుఁ దిరిగినది; ఇఁక మీఁదట
విపత్తును సహించెద నదియె 'చాలు, చాలు' ననునంత

వలెకు మొత్తో యని; యటు పిదపఁ జచ్చెద. నీవిప్పుడు
చూచితి నని వర్ణించితివే, దాని నే నరుఁడని మోసపోతి:
పలుమఱు నది పలుకుచుండె, భూతము, పిశాచము,
అనుచును ఆతఁడే నను నచ్చోటికిఁ దోడి తెచ్చె. ౧

ప్రేమ.—సుశీలముం దితితృవంతము నగు చిత్తవృత్తుల సంక
ల్పించుము. అయితే ఇది యేవ రిక్కడ వచ్చుట ?

ప్రవేశము, ప్రళయాంతకుఁడు, వెట్టివెట్టిగఁ బువ్వుల నలంకరించుకొని.

వశీకృత బుద్ధి స్వస్వామి కిటువంటి హైసేఁత నెన్నఁడుం
గావించి యుండదు. సురక్షిత మైన ఈ నేత్రేంద్రియము
ఈ నృపనాథుని ఈయనం బలె స్వాస్థ్యంబు చెందింప
నేరదు.

ప్రళ.—ఎన్నటికిని జరుగదు, నన్ను ముట్ట నేరరు వారు
మిథ్యా వేషధారి నని; నేను సాక్షా ద్రాజను.

ప్రేమ.—ఓహో, హృదయ శల్యపు దర్శనమా !

ప్రళ.—ప్రకృతి యుత్కృష్ట యీ విషయమునందు, మానుష
కల్పన కంటెను, అదిగో నీ సంచకరము. ఆ యభాగ్యుఁడు
పింటిని కాకి కాళ్ళు వలెఁ బట్టియున్నాఁడు: జవళి గజపు
నిడివి కోల్ల నెక్కు పెట్టుము, చూడుము, చూడుము

యొక మూషికము! ఊరక, ఊరక; ఈ సైగ చూపిన జున్నుముక్క సేయు నా పనిని. ఇందమ్ము నా యినుప చెయిజీరా: రాక్షసున్నిపై దానిని సాధించద: ఆ రాగి వన్నెపు గండగొడ్డలి వారల రప్పించుము. భళీ, బాగుగ నెగిరి పోతివె, పులుఁగా! గుఱి నూదిని, గుఱి నూదిని: హు! సంకేత పదము చెప్పుము,

ప్రేమ.—సుగంధ మరువకము.

ప్రళ.—గడఁచుము.

ప్రియ.—నే నెఱుఁగుదు నా కంఠము.

ప్రళ.—హా, హా! గరళవల్లి, తెల్లని గడ్డముతో! నన్ను మిథ్యా స్తోత్రము జేసిరి కుక్కలంబలె; నా గడ్డమునఁ నల్ల వెండ్రుక లొచ్చెను నల్లవెండ్రుక లందు మొలఁచు మును పే, యనిరి. నే నెది చెప్పిన దానికి ఔ నంటె ఔ ననిరి, కా దంటె కా దనిరి.—'ఔను; 'కాదు' రెంటను కలిసిన మంచి దైవమతము కాదు. వాన యెప్పుడు వచ్చెనో నను దడుపుట కొక మఱు, గాలి యెప్పుడు వీఁచెనో దంత వీణ వాయింపను; ఉఱుము మెప్పు డూరకుండ లేదో నా యానతి వినఁగనే, అప్పుడె వారి కనుఁ గొంటిని, అప్పుడె వారి మూరుకొంటిని. చాలు లెమ్ము, వాండ్రు తమ మాంత

యూఁకల చెప్పిన మనుష్యులు కారు; సర్వము నాకు సాధ్యమనిరి. పట్టి జూటు, శీత జ్వరాక్రాంతుండను గాన.

ప్రియ.—ఆకంఠపు టడియాలము నే లెస్సఁగ నెఱుంగుదు: రాజుగారు కా రాయన?

ప్రశ.—ఒక్కొక్క యంగుళమును రాజనే; నేనఁగనుకఁ బాఱఁ జూచితినా, చూడుము నా ప్రజ లెంత గడగడ వడఁకెదరో. ఈ మానిసి ప్రాణముల మన్నించి నాఁడను. ఏమి నీదు విషయము? వ్యభిచారమా? నీ కుఱిపోఁత లేదు: వ్యభిచారమునకు శిరచ్ఛేదమా! కూడదు.

ప్రియ.—ఓ సరే, ఆ హస్తమును నేను ముద్దుఁ బెట్టెద!

ప్రశ.—మునుముందు దాని నేఁ దుడిచికొనియెద; అందు మర్త్యతా వాసన వీఁచు చున్నది.

ప్రియ.—ఓ హో హో; ప్రకృతి మాంగళ్య శేషమా! ఈ మహా ప్రపంచము నొక నాఁ డిట్టులె రూపుమాసి పోవును నన్నానవాలు పట్టఁ గలరా?

ప్రశ.—నీ కన్నులం జక్కఁగ నే గుఱుతించెద. నన్నుఁ జూచె దవా యోర చూపుల? వలదు, నీ చేత నైనంత బీరము చూపుము గ్రుడ్డి మన్మథ. నే నేమో మోహింపను. ఈ

శౌర్య పత్రికం జదువు మీవు: దాని రచనా లక్షణము
నైన గమనించుము.

ప్రియ.—అందలి ప్రత్యక్షరము నొక సూర్యుం డైనను,
ఒక్క డైననుం జూడలేను

ప్రేమ.—నేను నమ్మియే యుండను దీని నెవరైన వీనుల
మాత్రము వైచియుండిన; ఈ పురూపున కనుంబడు
చున్నది కావున, నా గుండె భగ్గీలు మనుచున్నది.

ప్రళ.—చదువుము,

ప్రియ.—ఏమిటి, కన్నుల గవుసెనలతోనా ?

ప్రళ.—ఓహో, నీవును నా పంక్తిలోని వాఁడవా! కండ్లు
లేవ నెత్తిని, కాను లేద సంచిని ? నీ కన్నులు బలువు గవు
సెనలను, నీ సంచి నులువుదానిని ఉన్నవి; అయినను ఈ
ప్రపంచము ఎత్తైఱఁగున జఱుగుచున్నదో చూచెదు గదా!

ప్రియ.—దాని మ్రుట్టుపాటునఁ జూచుచున్నాఁడ.

ప్రళ.—ఏమిటి, వెఱ్ఱి పట్టినదా నీకు ? ఒకఁడు కండ్లు లేకయే
చూడవచ్చునె ఈ ప్రపంచ గతిని చూడుము నీదు వీను
లతో: చూడు మా న్యాయాధిపుఁ డెమ్మెయిఁ దిట్టుచు
న్నాఁడో యా చిన్న జాతి దొంగను. పరాకు, నీ చెవ్విని:

లాఢమును గొట్టించుట; దాని నే ఋజువునకుఁ దెచ్చెద, మఱి యీ యల్లుండ్రను సద్దు చప్పుడు లేక వెంబడించి పట్టికొంటినా యటు పిమ్మట, చంపు, చంపు, చంపు, చంపు, చంపు, చంపు.

ప్రవేశము, ఒక సుజనుఁడు, పరిచరులతో.

సుజ.—ఓ, యిదిగో నున్నవారు: చే సాఁచి పట్టుకొండు. దేవర, తమ యతిప్రేష్ఠ పుత్రిక—

ప్రశ.—ఏమి సహాయము లేదా? ఏమిటి, చెఱకాఁడనే? సత్యము, నా భాగ్యదేవతయొక్క ప్రాకృత క్రీడాకందుకమే. నన్ను దయతోఁ జూడుము, నీకు విడఁగడ రొక్కమిచ్చెద. వ్రణవైద్యులు వలయు నాకు; మెదటివఱకుఁ గోఁత పడుచున్నాఁడ.

సుజ.—తమ కేమి పలసిన నిచ్చెదము.

ప్రశ.—ఎవరు సాయము సేయరా? అంతయు నొంటరి కాఁడనే? మఱేమి, ఇయ్యది యొక మానిసి నుప్పు మానిసిఁగఁ జేయనోఁపు; అతని కన్నుల తోఁట నీటి కుండలుఁ గావించి పైఁ బెచ్చునకు, శరద్రజమును నడఁచి వేయు.

సుజ.—చెన్ను టయ్య,—

ప్రళ.—ధీరముతోఁ జచ్చెద, పెండ్లికొడుకుఁ బోలె నేమిటి! వేడ్కతో నుండెద: రా, రమ్ము; నేను రాజను, ఓరి యబ్బలూ, తెలియుఁడు దాని.

నుజ.—తమరు రారాజులు, మేము మీ దాసానుదాసులు.

ప్రళ.—అయిన నందుఁ గొంచెము త్రాణ మున్నది. వలయు, వలదు, మీ యుద్దేశము నెఱవేఱ వలసిన, పరుగులు పాఱియే కావలెను. సా, సా, సా, సా.

(నిష్క్రమించు పరుగుచు, పరిచరులు వెంబడింతురు)

నుజ.—అత్యంత కరుణాస్పదము, అతి నీచ హేయునందును, వాచా మగోచరము రాజన్యునందు! తమ కొక్క పుత్రిక యున్నది, ప్రకృతిని విడివింపను, తక్కిన యిద్దఱుం దానికిఁ దెచ్చిన సార్వత్రిక యపనిందనుండి.

ప్రేమ.—జయము, శాంత పురుష.

నుజ.—ఓయి, వేగిరింపుము; ఏమి నీ కోరిక?

ప్రేమ.—తమ రేమైన వినుచున్నారా, సామి, యుద్ధ మొకటి సిద్ధ మగుచున్నదా?

నుజ.—ఆ నానుడి బలునిక్కము. మఱి యందఱు నెఱింగి నదే: సద్దు వినఁ గల్గినవా రందఱు న్వినియెదరు,

ప్రేమ.—కాని, మీ దయకుఁ బాత్రుండను; ఎంత దగ్గర నున్నది మఱునటి సైన్యము ?

సుజ.—మిగుల దగ్గిరను బలు వేగ గమనము న్సేయుచున్నది. మూలబలము నిరీక్షింపఁ బడుచున్నది గంట గంటయు.

ప్రేమ.—కృతార్థుఁడ నయ్యా ; అంతె కావలసె.

సుజ.—రాణిగారు విశేష ముఖాంతరమున నిచ్చట నున్నను, సైన్య మేమో సంచారముననే యున్నది.

ప్రేమ.—కృతజ్ఞుఁడను, బాబు. (నిష్క్రమించు, సుజనుఁడు)

ప్రియ.—ఓ సదా శాంత దేవతలార, నా శ్వాసము గొని పొండు మీరలే : నాదు నీచప్రకృతి తిరుగను మరుప దేశము చేయకుండుత, నే చచ్చుటకు మీ యభీష్టము పుట్టక మునుపె !

ప్రేమ.—చక్కఁగ బ్రార్థించెదవు, నాయన.

ప్రియ.—ఓయి, సత్పురుషుఁడ, ఏమిటి నీ పూర్వోత్తరము ?

ప్రేమ.—నిఱు పేదవాఁడ నయ్యా, విధి ఘాతమున కోర్చు వాఁడను ; సుఘాతములును, హృదయభేదకములు నగు దుఃఖములచే శిక్షితుండనై, క్షిప్ర కారుణ్య గర్భితుండను.

నీ చేతిని సాంచుము, ఏదో యొక విశ్రమంబునకు నినుం బిలుచుక వెళ్లెద.

ప్రేమ.——మనఃపూర్వక వందనములు, స్వర్గపు ప్రసాదానుగ్రహములుం మీంనుమిగులను, మీందుమిగులను!

ప్రవేశము వసుపాలుండు.

వసు.——ప్రకటిత బహుమానము! మద్భాగ్యాశ్రీ, ఏమి యదృష్టము! ఆ నేత్రహీన మస్తకము మొట్టట మాంసరూపమయినది, నా సంపదల సంవర్ధించుటకే. ఓరి వృద్ధ దౌర్భాగ్య స్వామిద్రోహి, ఇంక నిసుమంతయుం దడయక నీ పాపముల స్మరించుక మహా ప్రాయశ్చిత్తంబుం జేసికొమ్ము: వాలు వెలువడినది నినుం దూలం గూల్చునది.

ప్రేమ.——మంచిది, నీ స్నిగ్ధ హస్తము చాలినంత బలిమి నా వాలునం జొన్పుత! (ప్రేమ. అడ్డపడు)

వసు.——ఏ లంటర, తెగిన మిగులు కొంపవాండ్లు, ప్రచురిత రాజద్రోహిని రక్షింపం గాలుం బ్రయత్నింతువు? అపలికి; వీని దౌర్భాగ్యపు సంపర్క[illegible] గాడ దోషానుదునిం గా నియుక్త [illegible] వీని దండింతు.

ప్రేమ — నాను గంటె ఒదలను ఈ ముసలోణ్ణి ఒట్టి వున్నానికి.

వసు — వదలి పెట్టురా, బానిసీ, చత్తువు లేక పోతె!

ప్రేమ — చాలు లే, పెద్ద మనిషి, తెగ వయ్యా నీ దారి చూచుక, ఓదోళ్ల జోక్యము నీ కెందుకు లె. ఈ యొట్టి గప్పాలకె నా ప్యాణాలు ఎగురఁ గట్టైనా, ఇన్నాళ్లుండమ లె, ఎగిరి పోయి పద్నాల్గు కేతురు లయ్యేంపు, ఒద్దు లెగూ, రామా కయ్య ముసలోడి దగ్గఱ; దూరాన నిలూ, నీకు సారు చేస్తా; నిలక పోతివా, చూతు నొక చెయ్యి, నీ లాటికాయ గట్టా, నా తరవలి కత్తి గట్టో; నాను గంపె త్యాట మాట లోణ్ణి

వసు — పో పో పో, చీఁపురఁ గట్ట!

ప్రేమ — నాను గంటె షీఁకేస్తా చూసు నీ పండ్లను: రా మటి; నే యెఱవను లే నీ పొడుపులకు.

(వాసు కయ్య మాడఁగ, ప్రేమ, వగతుని పడగొట్టును.)

వసు — బానిసీఁడ, చంపినావుర నన్ను: ధూర్తుఁడ, తీసికొమ్ము నా రూకలసంచి, నీవు క్షేమమున కాపించిన, నా కళే బరమును బూడ్చివేయుము నా మీఁద నుండెడి యుత్తరముల నుట్టిఁ జెప్పుము గులెస్టాన సామంతుఁడు దుష్ట

బుద్ధికి; ప్రీతిమ్మ కత్తిని వెంకు మాయననుః అయ్యో, అకాల మృత్యువా! (చచ్చును)

ప్రేమ.—నిన్ను ఉంగుదు బాగుగ; కైంకర్యపర ఘాతకుఁడవు; దాష్ట్యమునకుఁ దగువాటి మొరకు నీ యొడయురాలి దాష్ట్యములకు విధేయుఁడవు.

ప్రియ.—ఏమిటి, వాఁడు చచ్చినాఁడా?

ప్రేమ.—ఘూర్ప్రంపుము క్రిందను, నాయనా, ఒపలికఁ దీర్చి కొమ్ము ఈ చౌక్కాయి జేబులఁ జూతముః వీఁడు వ్రాసుచ్చిన పత్రములు నాకు మిత్రములు కావచ్చును చచ్చినాఁడు; కాని వీనికి యమకింకరుఁడు వేత్రాకుఁడు కారాదా యని చింతించెద. చూతము సెలవే, మెత్తని మయినమా; మర్యాపలార, మమ్ముల దూఱకుఁడు; మన శత్రుల మనస్సు తెలియుంగ, వారి గుండెలం జీల్చ వెసదీయము; వారి కాగితములనో యన్న, అంతకంటె విస్పష్టము.

(చదువును.) ‘మన యన్యోన్య ప్రతిజ్ఞలు స్మరణయందుంపుము. నీ కెన్నో తరుణములు దొఱకును వానిఁ దునిమి వేయుటకు; నీ ధైర్యము కొఱంత పడకుండిన సమయమును స్థలమును యథేష్టముగ సంప్రాప్త మగును.

ఏమియుఁ గడతేఱదు, అతఁడు జేతమై తిరిగిన; అప్పుడు నేనే చెఱకత్తియను, నతని పడుకయె నా చెఱసాలః దాని యసహ్యాపు రోఁత వేదికనుండి నన్ను విడివిం పుము; మఱి యతనికి ప్రతినిధివి కమ్ము నీ పరిశ్రమకు మాఱుఁగ.

‘నీవు—భార్య యన నోఁపుదును—
‘ప్రియురా లగు పనవుకత్తె
‘గరలవల్లి’

ఓ హా, పరిమితి రహిత మైన స్త్రీబుద్ధి ప్రదేశమా! తన సుగుణాలంకృత భర్తయొక్క ప్రాణహరణమునకుఁ గూటయత్నము; ఆయనకు ప్రతినిధి నా చిన్నారి తమ్ముఁడే! ఇచ్చట నీ యిసుకలలో, నిన్నుఁ బాఁతెద, ఘాతక పాతకులకుఁ దగిన పాపభూమి యిది; మఱి పరి పక్వ తరుణము వేఁచి, యీ కుత్సిత పత్రికతో, ద్రోహ మరణసమర్పిత పట్టభద్రుని యెదుటఁ బఱిమెద: ఆయ నకు మే లగు నీ చావును రాయబారము న్నేఁ దెలుపఁ గల్గిన.

ప్రియ — రాజుగారు వెఱ్ఱివారై నారు: ఎట్లుకుక్కపాటుఁగ నా నిచబుద్ధి జాతిమనసుతో నిలచుచు, నా పెనుదుఃఖముల స్మరించుచున్నాఁడను, ప్రజ్ఞ చెడక! నాకును వెఱ్ఱెత్తిన మే లయ్యెను; అట్లయినచో, నా తలఁపులు వేఱుపడును నా చూకురులవలన; మఱి చుమ్మచు ట్లన్నియుఁ ద్రిమ్మఱిరుగు చిత్తమునఁ దమ్ముఁ దాము మఱచి పోవును.

ప్రేమ.—నీ చేతిని సాఁచుము:　(దుందుభి. దూరమున)

చాలదూరమున నే వినంబడు నట్లున్నది దుందుభి ఘోషము. రా నాయన, ని న్నొక స్నేహితుని యొద్ద నప్పగించెద.　(నిష్క్రమింతురు)

రంగము VII ఒక గుడారము పరంగిజండులో; ప్రళయాంతకుఁడు శయ్యపై శయనించియుండు. మృదుల గానము వాదించును. సుజనుఁడు నితరులు శుశ్రూషింతురు.

ప్రవేశము. అమృతహృదయ, హితకీర్తి, చరకులు.

అమృ — ఓయి, సత్పురుష హితకీర్తి, నే నెటుల జీవించి యేమి పనిఁ జేయఁగలను, నీ మేలున కెదురు సేయ? నా జీవితము బలు కుఱుచ యగును. నా సర్వప్రయత్నము నిష్ఫలం బగును.

హిత—నా యూడిగములఁ జేర్కొనుటయె, అమ్మయ్యా, ఎమరు సేఁత యెక్కువ. నేఁ జెప్పిన వార్త లెల్ల కేవల సత్యములు; అతిశయోక్తులు లేవు, లవ గూహనంబును లేదు: యథా తథా.

అమృ.—మేలు దుస్తులం దొడుగుము! ఈ చింపిన ఆ దుఃఖ దినముల యభిజ్ఞానములు: ప్రార్థించెద, వీనిని దునిపి వేయుము.

హిత—క్షమార్పణము, ప్రియ మాతృక; ఇంతలోనే నన్ను ప్రకటించు కొనుట నేఁ జేసిన యుద్దేశమును విఱిచి వేయును: ఈ వరము వేఁడెద నీవు నన్నెఱుంగ వలదని, కాలము నన్ను నుచితమని తలఁచు వఱకును.

అమృ—అట్లయిన నటులె కానిమ్ము, నా మేలు భద్రుఁడా. (వరకునకు) ఎట్లున్నవారు రాజులవారు?

వర.—దేవేరి, నిదురించు చున్నారు నెమ్మగిలి.

అమృ.—ఓ ప్రియంకరు లగు వేల్పులారా, ఆయన యుపకృత ప్రకృతిలోని కొఱఁతను పరిహరింపుఁడు! ఈ శైశవమునకుఁ దిరిగిన మా జనకుని శిథిలీకృత కర్ణేంద్రియముల; ఆహా!, బిగియించి మనోహరంబులు గావింపుఁడు.

చర — దేవేరిగారికి సమ్మతి యుండిన, మహారాజుగారి మేలు కొలుప వచ్చును: వారు చాలసేపు నిదురించినారు.

అమ్మ. — నీ శాస్త్రానుభవము లెట్టు లుదహరించునో అట్టులె జరిపింపుము. ఆయనకు నూతన వస్త్రములు దొడిగినార?

నుజ — చిత్తము, దేవేరి, ఆయన మైమఱచి నిదురించుచుండఁగఁ గ్రొత్త దుస్తులు దొడిగినారము.

చర — అండ నుండుము, అనుంగు దేవేరి, ఆయన న్నేము మేలు కొలుపఁగా, నా కించుకయు సందియంబు లే దాయన స్వాస్థ్యముఁ గుఱించి:

అమ్మ — చాలను మేలు.

చర. — చిత్తగింపుఁడు, అండఁ జేరుఁడు ఇంకను గట్టిగ గానము వాఁగుడు మీర లచ్చట!

అమ్మ. — ఓయి, నా బంగారు తండ్రి! నిన్ను పునరుజ్జీవింపఁ జేయు నౌషధము నా యోష్ఠముల నూఁగుత; మఱి యీ చుంబనము కుదుర్చుత, నా యక్కలు నీ పండు ముదుసలితనమునఁ గావించిన యా క్రూర యాతనలను!

హిత — ప్రీతి మీఱు బలు విలువ హెచ్చిన రాజన్య పుత్రికా!

అమ్మ — నీవు గనక వారి తండ్రివే కాకున్నను, ఈ మంచు తెల్లని నరపులె చాలునె వారి కరుణకుఁ బ్రోత్సహింప.

ఇయ్యది తగు ముఖ మగునే, రణోత్కటం మారుతముల కప్పగింప? అగాధ భయానక వజ్ర గర్భిత మేఘ నిర్ఘోషంబున కెదుట నిలువ? తీవ్ర మగు వక్ర విద్యుత్తు యొక్క యత్యంత భీకర రభస పాతంబున? మేలుకొని —గతిలేని దిక్కు మాలిన వాఁడ!—ఈ సన్నని కుర్లాయతో? నా శత్రుని శ్వానంబును, నన్నది కొఱికిన దైసను, ఆ రాత్రిని నా నెగడి యెదుట నిలువ నిచ్చియుందు: నీ వపుడు సంతసించితివా, పాపము! నాయన, ప్రాంత గుడిసెలో డాఁగియుండు బందుల నడుమను, పెనమాలిన దొంగల నడుమను, ముగ్గుకింపుల కుఱుచ గడ్డి మీఁద? అక్కటకటా! అదృష్టంబై యాయె నీ ప్రాణత్యాగము లేక కాలమునే సమాప్తిఁ జెంద కుండుట. వేలు కాంచుచున్నారు, పలుకుము వారితో.

చర.—దేవేరి, మీరే పలుకుఁడు; అదే శ్రేష్ఠము.

అమృ—ఎల్లున్నవారు నా రాజప్రభువులు? ఎట్లున్నారు రాజగంభీరులు?

ప్రశ.—నీవు తప్పు చేసినదానవు నన్నిటుల సమాధినుండి వెల్వరించుట: నీ వాక్కు యానందాత్మను; కాని నే నేమో చిచ్చు చక్రమునఁ గట్టఁబడి యున్నాఁడను; గనుక

నా కన్నీళ్లే నన్నుఁ గాల్చుచున్నవి కఱఁగించిన సీసము కై వడి.

అమ్మ.—బాబయ్యా, నే నెవరనో పోల్చెదవా?

ప్రళ.—నీవొక యశరీరవు, దేవతవు, నాకుఁ దెలియును; ఎప్పుడు చచ్చితి వీవు?

అమ్మ.—ఇంకను, ఇంకను, చాల దూరము!

చర.—వా రింక బాగుఁగ మేలు కాంచ లేదు; ఊరకుండుఁడు కొంత తడవునకు.

ప్రళ.—ఎచ్చట నున్నవాఁడ నింతదాఁకను? ఎచ్చట నున్నాఁడ నిప్పుడు? అందమైన పగలు పూఁట? నే నిరుమిక్కిలియు మోస పోయినాఁడను. ఇంకొకఁ డిదే రీతిని మోసపోవఁ జూచినను, వానిపై జాలిచే నేఁ జచ్చి పోదును. ఏమి చెప్పవలెనో నా కేమియుఁ దోఁచ లేదు. ఇవి నా చేతులే యని సత్యముఁ జేయ లేను. చూతము; ఈ గుండుసూది చుఱుకు మని నాటుచున్నది నా యునికినిఁ గుఱించి నాకు దృఢ విశ్వాసము పుట్టిననో!

అమ్మ.—ఓయి బాబు, నన్నుఁ గటాక్షింపు మయ్యా; మఱి నీ చేతుల నా శిరముపై సాఁచుము నన్ను దీవింపుము బాబు. వలదు, కాదాదు, బాబయ్య, నీవు మోఁకాలింపఁ గూడదు.

ప్రశి—దయ యుంచి. నన్నుఁ బరిహాసింపకుము. నేను మిగులను నిఱు మూఢ, తెలివి తక్కువ ముదుసలిఁడు, అశీతియు నెక్కువ, ఒక గంటయు లేదు ఎక్కువ తక్కువ, స్పష్టముగఁ దెల్పను, నాకు సందేహము నే చిత్త స్వాధీనుఁడు కాఁడని. నీ వెవ్వరవో, ఇతఁ డెవ్వఁడో గుఱుతింపఁ జాలినట్లు దోఁచుచున్నది; అయినను సందేహ పీడితుండ, ఏలంటె నిది యెట్టి చోటో నాకు బొత్తిగ నానవాలు లేదు. నా కున్నంతి చాతుర్య మెల్లఁ గూర్చ నో, ఈ దుస్తులు వచ్చిన పోఁబడి నాకు జ్ఞప్తిలేదు, మఱియు నిన్నటి రాతిరి నే నెక్కడ నిలచితినో యది యుఁ దెలియ లేదు. నన్నుఁ జూచి నవ్వకుండు; ఏని హేతు వనిన నేను మానిసి యగుట నిబద్ధి యైన, ఈ చిన్నారి లేమగువ నా ముద్దుకూఁతురు అమృతహృదయ యన నోఁపుదు.

అమృ.—ఔ నౌను, అదియె నేను, నేనే యదియు.

ప్రశి—నీ కన్నీళ్లు తడి యైనవే? ఔను, సత్యము. నిను యాచించెద, దాని నేఁ ద్రావుదు. నే నెఱుంగుదు నాపై నీకుఁ బ్రేమ లేదని; నీ యక్కలో యనిన, నాకు

జ్ఞాపక మున్నది, అన్యాయ మొనరించినారు నాకు: నీ
కేమో హేతు వున్నది, వారికో లేదు.

అమృ.—ఏ హేతువు లేదు, లేదే హేతువు.

ప్రళ.—నేఁ బరంగి సీమలనా యున్నాఁడ?

హిత.—తమ రాష్ట్రములోనే, దేవర.

ప్రళ.—మోస పుచ్చకుము నన్ను.

చర.—ఊరడిలుఁడు, అనుఁగు దేవేరి: ఆ మహా సంరంభము, చూచితిరా, అది గడచి పోయినది వారిలోనె. అయినను అపాయకరము గతించి పోయిన సంగతులను ఆయనకు సవర సేయుట; వేఁడుఁ డాయనను లోపలికి పొమ్మని; ఇంక కొంచెము కుదురుపాటునకు వచ్చువఱకు ఆయన నిఁక నేమిత్రొందర పెట్టవలదు.

అమృ.—దయ యుంచి దేవర వారు విహరింప వచ్చెదరా?

ప్రళ.—నీవు నా యందోర్పుఁ జూపవలయు: ప్రార్థించెదని న్నిపుడు, మఱచి పొమ్ము, మన్నింపుము నా సేఁతల: నే ముసలివాఁడను, మూర్ఖుండను.

(నిష్క్రమింతు రందఱు హిత. సుజ. లు తప్ప)

సుజ.—సత్యమేన, యయ్యా, కోణపాలక పట్టభద్రుఁడమ్మెయి, సంహరింపఁబడుట?

హిత — పరిపూర్ణ సత్యమయ్యా.

సుజ — ఎవరాతని జనుల నడపువారు ?

హిత — గుళస్థానుని జార పుత్రుఁడట !

సుజ — జనశ్రుతి చెప్పెడి, ప్రేమసింహుఁ డాయన బహిష్కృత పుత్రుఁడు, జర్మనీ దేశములో కొంటు సామంతులు, హితకీర్తుల వారితోనున్నాఁడని.

హిత — జనశ్రుతి ఛేదము పడియెను; ఇఁక మన నడవడిలో బహు జాగ్రతఁగ నుండవలయు; రాష్ట్రపు బంటులు రభసమున నభిగమించు చున్నవి.

సుజ — మధ్యక్షము మహా రుధిరపూర్వక మయ్యెడి. శుభమయ్యెడు, నండి, మీరు (నిష్క్రమించు)

హిత — నా యాశయు లక్ష్యమును పరిపూర్ణముఁగ సమకూరును, లేదా, బొత్తిగ విఫలం బగుచు, నేటి యుద్ధపు జయాపజయములు చెప్పును. (నిష్క్రమించు)



# అమృతహృదయ
## (లేక)
# ప్రళయాంతకరాజు.

## పంచమాంకము.

### రంగము I బ్రిటిషు దండు, ద్వాగపురి సమీపము.

ప్రవేశము దండుధ్వజములతో. దుష్టబుద్ధి, రజనీచరి, సుజనులు, భటులును.

దుష్ట.—పట్టభద్రుని నడయును, ఆయన తుది యోచన యూర్జితమా, లేక యింతలోఁ దన యోచనను మార్చి కొన నేదైన వ్యాజము బోధించెనా యని. ఆయన పదే పదే మార్పులు జేయుచున్నారు, తమ యేర్పాటులనే యడుగడుగునకునుఁ గసరుచున్నారు: ఆయన దృఢ నిశ్చయమును అడిగిరా.

(ఒక సుజనునకు, ఈతఁడు నిష్క్రమించును)

రజ.—మా యక్కయ మానిసి నిశ్చయముఁగ నేదో సంకటముఁ బడసినాఁడు.

దుష్ట—సంశయాస్పద మే యగు, సీమంతినీ.

రజ.—మఱి, మధురనాయక, నీకుఁ దెలియుఁ గదా, నేను నీ కొఱ కుద్దేశించి యుంచు శోభనము: చెప్పుము నాతో—మఱి సత్యము:(గ—మఱి సత్యమునే పలుకుము, నీవు నా యక్కను వలఁచుట లేదు?

దుష్ట.—గౌరవమైన వలఁపున.

రజ—నేను దానిని సహింప నేరను; నాదు ప్రియ నాయకుఁడ, దానితో నీకు సరసము వలదు.

దుష్ట—భయము వడకు: ఆమెయు నా యను యువమానులు పట్టభద్రులును!

ప్రవేశము, దుందుభీ ధ్వజములతో, ధవళవర్మ, గరళవల్లి, భటులును.

గర.—(చాటున.) ఈ యుద్ధమునైనఁ గోలు పోదును గాని, ఆ చెల్లెలుమాత్రము అతని నన్ను విడఁదీయ వలవను.

ధవ—మా యతి ప్రీతిమతి యా మఱఁదలా, సంతోసము నినుఁ జూచి. ఓయి, నే నిది వినియెద; రాజుగారు తమ కూఁతురిఁ జేరినా రఁట, మఱి కొందఱుం జేరినా రఁట, మన రాజ్యాధికార క్రౌర్యముచేత దుఃఖార్తులైన వారును, ఎక్కడ సత్య మగుపడదో నా బుద్ధికి, సక్క ధ

కన్నటికి శౌర్యము జూపలేను: ఈ విషయమో యనిన, ఇది మాకు సంబంధించినదే, పరంగిరాజు మన సీమపై దాడి వెడలుచున్నాఁడనియె కాని, రాజగారికి ధైర్య మిచ్చుచున్న దని కాదు; ఏ లంటె, వారికిం మఱి కొంచెటికిని నతి నీతియుతములును ఘనహేతుపూర్వక ములు నైన ముఖాంతరములు కల వని, నే నూహించెద, మనల నిమ్మెయిం మాఱుకొనుటకు.

దుష్ట.——దేవర, తాము మహా ఘన బుద్ధితో భాషించెదరు

రజ——ఎందున కీ తర్కము?

గిర.——కలసి పోరుఁడు పగతుని మార్కొని, ఏలన, నీ గృహ చ్ఛిద్రములును, స్వకీయ కలహములును కా విక్కడి ప్రస్తుత ప్రశ్నంబులు.

ధవ——అట్లయిన నిర్ణయింతము యుద్ధవృద్ధుల సమక్షమున, మన యభియోగ విధానముల.

దుష్ట.——నే నిప్పుడె మిము దర్శించెద మీ గుడారమున.

రజ——అక్కయ్యా, మాతో వత్తువా?

గిర.——రాను.

రజ——మిగుల ననుకూల మగును; దయ యుంచి నడుము మాతో.

గర.—(తనలో) ఓ, స్వామీ, తెలియు నాకీ పాపప్రకృత —వచ్చెద.

వారు వెలుపల వెళ్లుచుండఁగా, ప్రవేశము, ప్రేమసింహుఁడు మాఱువేసమున.

ప్రేమ.—కరుణానిధులు తాము మాట్లాడియున్న నావంటి నిఱుపేదవానితో, ఒక్కటే యొక్కమాట నాలకింపుఁడు.

ధవ.—మీరు ముందు వెళ్లుఁడు, పట్టుకొనియెద. మాట లాడుదము. (నిష్క్రమింతు రందఱు, ధవ. ప్రేమ. తప్ప)

ప్రేమ.—తాము యుద్ధమారంభింపక మునుపే ఈ యుత్తరమును విచ్చుఁడు. తమకు జయము కల్గిన, కాహళము ప్రోయుత దానిని దెచ్చిన వానికై; మహా దరిద్రుఁడుఁగ నే కనఁబడెనను, అందు వక్కాణించి యుండు దాని ఋజవు పఱుపఁగల యోధు నొకనిఁ దేఁగల. తమ కపజయమే తటస్థించిన, తమ ప్రాపంచిక వ్యవహారములకు కట్టి యుపసంహారము విధిలిఖితము; అటుపై కూట తంత్రములకుఁ జోటు లేదు భాగ్యము నిన్ను వలఁచుత!

ధవ.—తడయుము చదివి ముగించు దనుక నీ యుత్తరమును.

ప్రేమ.—వలదని నా కానతి. కాలము సహకరించిన, బట్టుఁడు మాయమైనను, నను దిరుగఁ గనుఁబడియెద.

ధన.—మంచిది, పోయిరా, నేఁ జూచికొనియెద నీ కాగితము. (నిష్క్రమించు ప్రేమసింహుఁడు.)

పునఃప్రవేశము దుష్టబుద్ధి.

దుష్ట.—శత్రువు దృష్టిపథమున నున్నాఁడు: మీ బలముల మొగ్గరము దీర్పుఁడు: ఇదిగో నున్నది వారి నిజమైన బలము, వారి దళముల యుజ్జాయింపు లెక్క, మిగుల జాగ్రతతోఁ గనిపట్టినది వేగులచేత; కాని యిప్పుడు బలు త్వరితమే మీ కర్తవ్యము.

ధన.—ఆ యవసరమును నానందముతో నెదుర్కొనియెదము. (నిష్క్రమింప.)

దుష్ట.—ఈ యిద్దఱి యక్కఁజెల్లెండ్రకును న్నేను కామప్రతిజ్ఞఁ జేసినాఁడను; ఒండొరులపై మచ్చరించువారు, కట్ల పాముచేఁ గుట్టఁబడినవారిఁబోలె. ఇద్దఱిలో నెవరినే నేర్పఱచుకొందు? ఇద్దఱినా? ఒక్కర్తెనా? ఇద్దఱి న్విడుతునా? ఇద్దఱుం జీవించియున్న నొక్కరితెను ననుభవింపలేను: విధవరాలినిఁ బరిగ్రహింత మంటె, దాని యక్క గరళవల్లి కాగ్రహము నున్మాదముం బుట్టుచున్నది, మఱి నా పక్షమును గెలిపించుట యతి దుర్లభము దాని పెనిమిటి జీవించియుండఁగా. పోనిమ్ము, అతని సంరక్ష

ణము నుపయోగింత మీ యుద్ధముకొఱకు, ఇది ముగియఁగనే అతని నిరాకరించున దేవరితో యవి యుపాయము పన్నుత వానిఁ ద్వరితము నివర్తింపను. ప్రళయాంతకు నమృతహృదయకు నతఁడు చూప నుద్దేశించు కనికరముఁ బట్టి, యుద్ధము ముగిసి వారు మన వశమునం బడెరా, యతని క్షమను వా రెన్నఁడు నొందఁ జాలరు; నా స్థితి నాలోచించిన, నేను ఆత్మసంరక్షణంబుఁ జేసికొనవలయుఁ గాని, తర్కవితర్కములు కావు నా పని. (నిష్క్రమించు.)

---

రంగము II. ఒక రణరంగము, ఇరు దండులకు నడుమ.

రణభేరీ కాహళ ఘోషము, లోపల. ప్రవేశము, దండభీధ్వజములతో, ప్రళయాంతకుఁడు, అమృతహృదయ, భటులును .

నాట్యరంగముమీఁద, నిష్క్రమింతురు.

ప్రవేశము. ప్రేమసింహుఁడు, ప్రియవ్రతుఁడును.

ప్రేమ.—ఇదిగో నాయనా, ఈ తరుచ్ఛాయను గైకొనుము నీ కాతిథ్యకారిఁగ; ప్రార్థింపుము పరమాత్మను, న్యాయము వర్ధిల్లునట్లు; తిరుగను నేను మఱలితినేని, నీ కూఱటయు నేఁ దెచ్చెద.

ప్రియ.—ఈశ్వరకృప నీకు సాయము సేయుత, నోయి!

(నిష్క్రమించు, ప్రేమసింహుఁడు.)

రణవాద్య ఘోషమును పలాయనమును లోపల.

పునఃప్రవేశము ప్రేమసింహుఁడు.

ప్రేమ.—లెమ్మయ్యా ముసలి మానిసి, ఇమ్ము నాకు నీ చేతిని, పదపద! ప్రళయాంతకరాజు ఓడిపోయె, అతఁడు నతని కూఁతురుం బట్టువడినారు; సాఁచు మయ్యా నీ చేతిని; రమ్మయ్యా రా.

ప్రియ.—ఇఁక నడుగైనను బెట్టను, కాబు; క్రుళ్లుట కీ చోటె చాలు నయ్యా యొకనికి

ప్రేమ.—ఏమిటి, పునరపి దురాలోచనలా! మనుష్యులు సహింపవలయు నిచ్చటనుండి పోకడను, నిచ్చటికి రాకడనుం బలె: కాలపరిపక్వమే సమస్తమును. రావమ్మా.

ప్రియ.—అదియును సత్యమే యగు. (నిష్క్రమింతురు.)

---

రంగము III ప్రిటిషువంశ, ద్వారపురి చేరువ.

ప్రవే, జయఘోషముతో, దుందుభీధ్వజములతో,

దుష్టబుద్ధి: ప్రళయాంతకుఁడు సత్యశీల ముదలగువారు

జొఱకాండ్రు, దళవాయి, సిపాయిలు, మొదలగువారు.

దుష్ట.—కొందఱు పడవాళ్లు కొని పొండు వీరి నవలికి; గట్టి కాపుదల, ఆ పెద్దవారి (వీరిపై న్యాయము తీర్పఁగలవారి) యభీష్టములు మొదట నువిజ్ఞాతము లయ్యెడివఱకు.

అమృ.—మనమే కాము మొట్టమొదటి వారలము, ఉత్తము యుద్దేశములఁ బూని అధమ దుర్దశ కధీను లైనవారు. నీ నిమిత్తము, బాబు, పీడాక్రాంత భూపతి, తలవీకన కాయరాలి నైతిని. నా యంతట నే నేమో, నీవు లేకున్నఁ, గట్టల్కం బొమముడిఁ బెట్టంగల, బలు మోసపు కట్టఁడి భాగ్యదేవతయొక్క వెక్కిలి యొక్క అపహాస్యాల కెదురుఁగ. మనము దర్శింపవలదా యీ యర్శిలి కూఁతుల నీ కూఁతుమి యక్కలన్ ?

ప్రళ.—వలదు, వలదు, వలదు, వలదు! రమ్ము, వెళ్లి పోదము చెఱసాలకు, మన మిద్దఱమె పాడదవు బోనులోని పిట్టలంబలె; నను నీ వాశీర్వదింపఁ గోరఁగ, నేను మోఁకరించుచు నీ క్షమార్పణ వేఁడెద: అట్లొయి మనము వసింతము, భజింతము, పాడుదము, ప్రాఁగతలం జెప్పికొందము, నవ్వుదము చిత్రపు వన్నెల సీతాకోకచిలుకలం జూచి, నిఱుబేద టక్కరుల విందము ముచ్చటింప దివాణపు సుద్దులన్; మనమును భాషింతము వారితో సహితము గెలిచిన దెవ రోడిన దెవ రని; లబ్ధాధికారు లెవ రని నష్టాధికారు లెవ రని (ప్రవిష్టు లెవరని బహిర్గతు లెవరని), చేకొని భావవత్తోఁ జర్చింతము సత

ప్రవర్తనపు నిగూఢ రహస్యముల్, దేవ చారులల మా
ఱ్కని; గోడలు కట్టిన కారాగృహమునఁ జిరము జీవిం
తము గోడాడుచు గొప్పవారి కూటువులం గత్తులం,
బోటుపాటు లుప్పతిల్లు నట్లు చందురు చూపున, కూడు
వీను వానిని.

దుష్ట—కొనిపోండు వారి నవలికి.

ప్రళ—ఇటువంటి యాత్మ యుద్ధములందు, నా పాస్నోరి
యమృతహృదయ, క్రతుభుజులును విశ్వసి యూహాలుతులం
బ్రేల్తురు. నిన్ను నేఁ బట్టుకొన్నాను గదా? ఇంక మన
లను వీడ్చి యెడఁబాఁపఁ గడఁగువాఁడు వేల్పుత్రోవ నుండి
కొఱవి తేవలె మనల నిద్దఱిం గొరకనక్కలంబలె బొక్క
నుండి బాగయించి యెగఁదోలుటకు, తుడిచికొమ్ము నీ
కనులను: రమ్ము.

(నిష్క్రమింతురు ప్రళ. అమ్మ. లు కాఁపువలతో.)

దుష్ట—రావో యీడకు, దళవాయి; అవధారు! ఈ
చీటినిఁ బుచ్చికొమ్ము (కాగిత మిచ్చుచు); వెళ్లి పంబడించుము
వారిని చెఱసాలకు; ని న్నొక మెట్టు ముం దెక్కించి
నాఁడ; ఇందుండు నిర్దేశము స్నాఅవేర్చితివేని ప్రభుసంప
దలకుఁ జెరుపుఁ జేసికొనియెదవు; దీనిని తెలిసికొమ్ము

నీవు, మనుష్యులు కాలానుగుణ్యులని: మృదులచిత్తంబు ఖడ్గంబున కనర్హంబు; నీకు నియోగింపఁబడిన యీ గొప్ప విషయము ఇప్పుడుఁ దర్కింప నశక్యంబు; ఒకటి చెప్పుము నీవు చేతువని; లేకపోయిన వేఱు తెరవున నీ క్షేమమును వర్థించికొనుము.

దళ.—చేసెదను, మహాప్రభో.

దుష్ట.—మఱి నను మా పనికిని; దాని ముగించిన వెంటనే ధన్యుఁడ వని నిను వ్రాసికొమ్ము: లక్షించుము నా మాట, తక్షణమునే; నే నెట్లు నియమించినాఁడనో యం దట్లనే నిర్వర్తింపుము.

దళ.—బండిని నీడ్వలేను, ఎండు వోటు బియ్యము సమల లేను; మగవాని పని యైనచో, దప్పక చేసెద.

(నిష్క్రమించు)

వాద్యఘోషము. ప్రవేశము ధవళవర్ముఁడు, గిరళవల్లి, రజనీచరి, కిశోర దళవాయి, భటులును

ధవ.—ఓయి, నేఁడు నీ వగుపఱచినాఁడవు నీదు శౌర్యభావము, నీకు సుభాగ్యము సనుకూల పురోగామి యాయెను. ఈనాటి యుద్ధపు విరోధుల నీవు చెఱఁ బట్టినాఁడవు; [illegible] వారిని మా వశమున నప్పగింతుము; మేము పాలించె

దము వారలను, వారియోగ్యతలకుం మా క్షేమమున కును యుక్త మా రీతిని.

దుష్ట.—అయ్యా, నేఁ దలంచితి యుక్త మని యా ముసలి మరదృష్టపు రాజునుం బంపుట యొక్క చెఱసాలకు, నియమించుచుఁ గొందఱి రక్షణకొఱకు; వారి వయోధికతం మనోహరతయు, వారి బిరుదున నత్యంత మనోహరతయు నున్నందున, సామాన్య జనుల హృదయములు వారి పక్షమున నాకర్షింపఁబడి, మన సంచకరముతో నమర్పఁబడిన యీఁటియలై ఆజ్ఞాత లగు మన కన్నులం బొడుచునేమో యన్న వెఱపుచేత. ఆయనతో రాణిగారినిం బంపినాఁడ: అందునకు నయ్యదియే కారణము; సర్వత స్సిద్ధులు వారు, రేఁపో మఱి యెచ్చు తఱినో, తమ రెపుడు విచారణాసనారూఢులై వారలఁ దమ సంముఖంబునకు రాఁ బనిచినపుడు విచ్చేయుటకు. ఇప్పుడో యనిన స్వేద రుధిర సిక్తులము; స్నేహితులు స్నేహితులఁ గోలుపోయినారు; మఱి మా మంచి న్యాయయుత కలహములును, చిత్తోద్రేక వేళల, శపింపఁ బడియెడు, వాని తీక్ష్ణత ననుభవించు వారిచేః అమృతహృదయ యామె నాయనల విషయము దీనికంటె మూఁటియు చోటు నపేక్షించెడు.

ధవ.—ఓయి, శాంతుఁడవై వినుము, నిన్ని యుద్ధవిషయమున మా యాజ్ఞానువర్తిఁగ నెంచెదముగాని, సమాన స్కంధునిఁగఁ గాదు.

రజ.—అయ్యది మా యభీష్టముఁ బట్టి యున్న, దాయనను మే మెట్లుఁ బ్రసాదింతుమో. ఇంత దవ్వు మాటల మీఁటుటకు మును పే మా యభీష్ట మే మని మున్మూలం మొదట నడుగవలసిన దాయెనే. మా బలముల నడపి నాయనకు నా యధికారము, న్నన్ను నుదాహరించెఁ, బ్రతినిధిఁగ నియుక్తుఁడై; కాన నట్టి యస్మ త్సాత్మా త్ప్రతిష్ఠి తైక్యంబె చాలునే నీ సమాన స్కంధత నొసంగను.

గవ.—అంతటి ప్రచండత వలదు లె; తమ యోగ్యతా ప్రతాపముననె తమ యౌన్నత్యముం బడసినారు, నీ కూర్చిన పట్టపు టవసరము లేకయె.

రజ.—నా చేతులార నే నొసంగిన నా యధికారముల బలిమినె, యీ సీమలోని మహా శ్రేష్ఠులకు సమానుఁ డీయన.

గవ.—అంతకంటె నధికము చెప్పలేవు, ఆయన నీకుఁ గాని మిత్తి యయినను.

రజ.—పరిహాసకులుం దఱుచుగ శ్రావకధను లగుదురు.

గర.—సెబాసు చాలులే, సెబాసు చాలులె! నీ కట్లు గధించిన కన్నులు కొద్దిగ మెల్లకన్నులాయె.

రజ.—చేడియ, నా కొల్లు సరిలేదు; లేనిచో, నా కడుపు కడ వెళ్ల వెల్లువ కట్ట నుత్తరం బిత్తును. సేనాపతీ, నైకోనము నా సిపాయిల, ఖయిదుల, పితృధనమును; వాని నీ వశేము కొమ్ము, నన్నును ఈ కోట నీయదె, లోక పంతయు సాకిరి, నిన్ను నే సృజియించినాడను ప్రభువుగ విభువుగ రజనీచరికిని.

గర.—ఆయన ననుభవింప నిశ్చయించిన దానవే?

ధన—దాని కష్టవాట్లు వేయుట నీ స్వాధికారమున లేదు.

దుష్ట.—నీ యధికారమునను లేదు, పట్టభద్రుడా.

ధన.—అఱజాతి కొడుకా, యున్నదిర.

రజ.—(దుష్ట కి.) నీ దుంఋభి మ్రోగనిమ్ము, నా యధికారము నీ దని ఋజువు పఱచుము.

ధన—తడయుము కొంచెము; వినుము వివేకము. దుష్టబుద్ధి, నిన్ను బట్టుకొనిమీద శిరచ్ఛేద నాజ్ఞ రాజద్రోహాపరాధముచే బట్టితి; మఱి, నీతో సహితము, నీ స్వర్ణాలంకృత సర్పముకా. (గర. చూపుచు.) ఇక నీ యధికారముం గూరిచి, ముద్దు మఱదలా, దాని నే నడ్డగించెద

నా భార్య హితమునకై; ఆమెయే యీ ప్రభువునకు లోనొప్పందముఁ జేసికొన్నది. కావున దాని మగఁ డగు నేను అడ్డగించెద మీ వివాహ యత్నముల. నీకుఁ బెండ్లియే వలసిన, నాకుఁ జెల్లింపుము నీవలఁపుల. నా గేస్తురాలికి నిశ్చితార్థ మైనది.

గర.—విష్కంభకము!

ధవ.—నీవు సాయుధుఁడవు, గుళిస్తాన్; కావాళములు వాఁగనిమ్ము; ఎన్నఁడు నెదుర్పడని యెడల నీ వుత్తిపై ఋజువు పఱప నీదు బలు దారుణములును, పరిస్ఫుటను లును, బహుసంఖ్యాతములు నగు స్వామిద్రోహముల, నదిగో నున్నది నా ప్రతిజ్ఞానము (ఒకఛీరాను దిగువ విసరును); నీ హృదయముపై ఋజువుపఱచెద, రొట్టెను ముట్టక మునుపు, నీ హెూతేనియు నే యంశములోనుఁ దక్కువ పడనివాఁ డని ఇవు డివుడే యిచట నే నేమని నిన్ను ప్రకటించినాఁడనో యా యంశము లెల్లను.

రజ.—జబ్బుగ నున్నదే, అయ్యో జబ్బుగనున్నదే!

గర.—(తనలో.) లే నెడ, నిఁక నెన్నఁడు నవ్వను మందును.

దుష్ట.—ఇదిగో నా ప్రతిజ్ఞానము. (ఛీరాను గిరుకకు విసరును), ఎట్టివాఁడో యతఁడు నేను స్వామిద్రోహి యను నాతఁడు,

ధూర్తుఁడు వాఁడు దబ్బ ఆడినాఁడు: పిలుపును నీ
శృంగవాదనముతో: ఏ వాఁ డతఁ డే తెంపఁ దెగించునో
యతనిపై, నీపై, నింకెవరురారాదు? వారిపై, నా
సత్యము నా గౌరవము న్నే స్థిరీకరించెద దృఢముఁగ.

ధవ.—క్రీక్కువాఁ డొకఁడు, హా!

దుష్ట.—బట్టువాఁ డొకఁడు, హా!, యొక బట్టువాఁ డేఁడీ!

ధవ.—నీ యొంటరికాని బీరమునే నమ్ముము; ఏలన నీ
జోదులు, నా పేరిటఁ గూర్పఁ బడినవారలు, నా పేరిఁ
టనే వీడుకో లందిరి.

రజ.—నా ఐబ్బు తల కెక్కుచున్నదే!

ధవ.—ఈమెకుఁ దెగులు: కొనిపోంము నా గుడారమునకు.

(నిష్క్రమించు రజ. నడిపింపఁబడుచు.)

ప్రవేశము ఒక క్రీక్కువాఁడు.

రావో యిచ్చట, క్రీక్కువాఁడవా,—శృంగము స్వనింప
నిమ్ము!—మఱి చదువుము బిగ్గర దీనిని.

దళ.—స్వనించుత, శృంగము! (శృంగనాదము.)

క్రీక్కు.—(చదువును.) ‘ఈ సైన్యపు వరుసల లోపల నక్కులఁ
జాతుఁడో, ఉన్నతపద నియుక్తుఁడో, యెవఁ డైనను, గుణ

స్థాన సామంతుఁ డని భావింపఁ బడినవాఁడు, దుష్టబుద్ధి యని పేరు గలాఁడు, వీని పైఁ బోరి స్థాపింపఁ గలాఁడైన, బహువిధముల స్వామిద్రోహాని, కనుఁబడుఁ గాత నాతఁ డిచట శృంగపు మూఁడవ మ్రోఁతన: హీఁను సాహసించినాఁ డాత్మరక్షణకు.'

దుష్ట.—వాదింపుము! (మొదటి శృంగము.)

క్రికి.—పునరపి! (రెండవ శృంగము.)

క్రికి.—తిరుగను! (మూఁడవ శృంగము.)

(లోపల శృంగ ముత్తరం బిచ్చును.)

ప్రవేశము ప్రేమసింహుఁడు, మూఁడవమ్రోఁతన, సాయుధుఁడై ఒక శృంగముతోఁ జనముంగల.

ధవ.—అడుగు మతని యుద్దేశములను, ఎందున కగుపడు వాఁడో, యీ శృంగపు పిలుపున.

క్రికి.—ఎవ్వ రోయి మీరు? మీ పే రెయ్యది, మీ స్థితి యెయ్యది? ఏ లాగో మీరు ప్రతివాదించుట, ఈ ప్రస్తుతాహ్వానమునకు?

ప్రేమ.—ఎఱుంగుము, నా పేరు నష్ట మైనది; ద్రోహాపు దంతమ్ముచే కుతకమాయె. నాకూన్యము, కీటకుత పుష్పము

ద్రౌపది: అయినను నే నిపుడు మార్గాన వచ్చిన శత్రుని యంత సత్కులోద్భవుండనే.

ధన.——ఎవ్వఁ డా శత్రుఁడు ?

ప్రేమ.——ఎవఁడురా, పలుకుచాఁడు, గుళ్లస్థాన సామంతుఁడు దుష్టబు ద్ధనువాని పక్షము ?

దుష్ట.——అ య్యతఁడే; ఏ మనిమెద వతనితో ?

ప్రేమ.——ద్రోయుము నీ యడిదము; నిజముఁగ సుదార హృదయమునే యపరాధించిన నా వచనము, నీ భుజము సేయుత న్యాయము న్నిరు: ఇదిగో నాయది చూడు మియ్యది నా కులీన వంశమునకును వీరోపదేశ ప్రతిజ్ఞకు వీరవృత్తికిని శాంతమైన స్వతంత్రము ద్రోహా లపై ద్రోయుట. దృఢముఁగ శపథముఁ జేసెద, ఎ వింత బలిష్ఠుఁడు, యువానుఁడు, ఉద్యోగస్థుఁడు, [illegible]ష్ఠత్వ వంతుఁడ[illegible]నైనను, నీ ఖడ్గము జయశీలము న్ని సంపద జ్వాల నాభి నవ మైనను, నీ శౌర్యము హృదయ దా[illegible]ము న[illegible]ం డఁగ, నీ వేమో స్వామిద్రోహి వే, ఈ మ[illegible]న్నత యశశ్శోభిత రాజన్యానికి విరుద్ధముగఁ [illegible] [illegible]ములఁ బన్ను వాఁడవు; మఱియు నీ మస్తకపు కొ[illegible] [illegible]దలు కాని నీ పాదపు క్రిక్రిందు వఱకును దా[illegible] [illegible]నాళి

పలికెను గోండురుకప్పవంటి సర్వాకలంకిత శరీరపు స్వామి ద్రోహివి. నీవు మట్టినకు చెప్పుము 'కాను' అని, ఈ ఖడ్గమును, ఈ భుజమును, మఱియు నా ధైర్యసారమంతయు సన్నద్ధము లై యున్నవి 'నీవు బూటాడెదవు' అని నీ హృదయమునకు నాటఁ జెప్పుచు, తద్విదారణంబుఁ జేసి యా మాట నూర్జిత పఱచును.

మష్ట.—వివేకము చూపఁగన నీ పేరును నేఁ గోరవలయును: కాని, నీ బాహ్యము ఇంతటి సుందరమును రణోత్సుకమును, నీ జిహ్వయు కులీన సంస్కారము నొకించుక ద్యోతంపఁజే[illegible] గావున, నా క్షేమము వీరధర్మసూక్ష్మము లరియుచు, నా ధర్మము లొప్పున నాఁపుఁ జేయ సులభ మైనను, వాని నెల్లను ధిక్కరించి నిరాకరించెద: మఱి నీ వుదహరించిన ద్రోహము లన్నిటి నీ తలపైనికె త్రిప్పి విసరికొట్టెద; కారప సదృశ ద్వేష్యమా నీ బూటుతో నీ హృదయమునే [illegible] ద్రొక్కెద; నీ కటికి హృదయమును నా ద్రోహములు మిన్నక యొరయుచున్నవి కాని [illegible] కావున ఈ నా చేతి కరవాలమున [illegible] వానికిఁ

ద్రోహిఁ జేసి, చెఱసనిచ్చి, యందుననే యాచంద్రతారార్కము న్నివసింపఁ జేసెద. శృంగములార, వాదింపుఁడు !

(రణ ఘోషములు; వారు పోరుదురు. దుష్ట. కూలును.)

ధవ.—రక్షింపుఁడు వానిని, రక్షింపుఁడు వానిని!

గర.—ఇది యేదో కైలాట తనము గుళ్ళ: క్షాత్ర శాసనము చొప్పున, నీ వుత్తరవాద బద్ధుఁడవు కావే యపఉచిత విరోధికి: జయింపఁ బడినాఁడవు కావు, కాని వంచించి మోసపుచ్చఁ బడినాఁడవు.

ధవ.—మూసికోవే నీ నోటిని, పడఁతుక; కొనకుంటివ నీ కాగితముతో మూయుదు: (ప్రేమ. కు) నిలువు పెయ్యా; (దుష్ట. కు.) అందికొనురా, ఎట్టి బూతు పేరనకును హీనమైన వాఁడా, నీ దురాత్మత న్నీవే చదివికొమ్ము; ఓంపు శేమి పలదే చేడియా: తేఁట పడుచున్నది తెలిసినదానవని దానిని. (ఆ యుత్తరమును దుష్టబుద్ధి కిచ్చును)

గర.—అనికొను, తెలిసిన నేమి, రాజశాసనములు నాయవియె కాని, నీయవి కావు; ఎవఁడు నన్ను దాసికి నాక్షేపింపఁ గలవాఁడు?

ధవ.—అత్యంత బీభత్సము! ఓ హో! తెలియునే నీకీ కౌగితము?

గర.—అదుగఁ బోకుము నాకుఁ దెలిసినదానిని.

(నిష్క్రమించు.)

ధవ.—వెళ్ళుఁడు దాని వెంబడి; త్యక్తాశురా లయినది, నిరోధింపుఁడు దానిని.

దుష్ట.—నీ వేయే నేరముల మోఁపినాఁడవో వానిఁ జేసినాఁడను; అంతియ కాదు, మీఁదు మిగులను; కాలము వెల్లడిఁ జేయు వానిని. అది గడఁచి పోయినది, అట్లనే నేనును. కాని, నీ వెవ్వఁడ వోయి ఇట్లు ననుఁ దన్ని పెరిమెఁ బొందినాఁడవు? మాన్యకుల జాతుఁడ వైన మన్నించెద నిను,

ప్రేమ.—పరస్పర సమాధానము బడయుదము మనము. నీకంటెఁ దక్కువైన వాఁడను కా నోయి, దుష్టబుద్ధి, నా వంశోత్పత్తిని, ఎక్కువవాఁడ నైతినా, నీవు నెక్కువ యపరాధివి యు. నా పేరు ప్రేమసింహుఁడు. నీతండ్రికిఁ గొమారుఁడ. దేవతలు న్యాయ-పక్షపాతులు, కానన్, మన సుఖప్రద పాపముల నుండియే సువల

శిక్షించు నుపకరణములఁ సృజింతురు: నినుఁ బుట్టించిన యీ యంధంతమస పాపిష్ఠి స్థానము మన నాయవగారి నయనాపహారి యాయె.

దుష్ట.——నీవు చక్కని మాట లాడినాఁడవు, సత్యము: కాల చక్రము పూర్తిగ నొక చుట్టు తిరిగి వచ్చినది. నేను నధోగతుఁ డయినాఁడను.

ధవ.——తోఁచెంచె నాకు, నీ నడక జాడయె రాజమాన్యతం బూర్వసూచకంబుఁ జేసినట్లు; నిను నేఁ గౌఁగిలించి కొనవలె: దుఃఖము విదళించుత నా హృత్పద్మము, నిన్నఁ దైనను ద్వేషించి యుండిన ని నైన నీ తండ్రి నైన!

ప్రేమ.——మాన్య రాజన్యులు, నే నది యెఱుంగుదు.

ధవ.——ఎచ్చట నిందాఁక నిను దాఁచికొంటివి? ఎట్లుఁ దెలిసి కొంటివి నీ తండ్రియొక్క దుర్దశలను?

ప్రేమ.——వానినిఁ జికిత్సించుటవలన, దేవర, ఆలకింపుఁ డొక టూకించిన కథను; అది చెప్పి ముగియఁగనే, ఓ యన్న, పిగులుత నా గుండియు! ఆ క్రూర ప్రకటనను, నా వెనువెంటనె తఱుముచున్న దాని ఫలసంకటములనుఁ దప్పించుకొనుటకు——ఆహా, మన ప్రాణము ల్మని తీపు! ప్ర[illegible]సంకటమును గంటగంటగఁ గడపనోఁ[illegible]

దము కాని, యొకపరియె చావఁ దెగింపము కదా!—
అదియె నేర్పె నాకు పిచ్చివాని పోలికలో శత్రువుఁ జొచ్చు
మని; కుక్కలకు నసహ్యమైన వేసముఁ దాల్చినను,
మఱి యీ వేసధారిఁగ నుండఁగనే సంధించితి నా
తండ్రిగారిని, నెత్తురు కక్కుచున్న కనుగుంట యుంగరము
లతో, నందుఁ జెక్కియున్న యనర్ఘ రత్నములు నూతన
ముఁగ నష్టములై యుండఁగ; నాయనకుఁ ద్రోహినై
తోడ్పడుచు, నాయన కని యున్న వస్త్రశయనము
ల్యాచించుచుఁ గాపాడితి నాయన నైరాశ్యమునుండి;
ఇంతటి దనుకను,—ఓసి యపరాధమా—నన్నెవని
యాయనకు బయలు పెట్టుకొంటిని; కాని, ఒక యఱగం
టకు మునుపె, ఆయుధ సన్నద్ధుఁడనై, సమ్మక మున్నను
ఈ సుజయమునుఁ గూరిచి, గాఢ నిశ్చయము లేక, న
న్నాలింగింపుచు నాయన యాశీర్వచనము ల్యాచించితి,
మఱి మొదటనుండి తుదవఱకును నా యాత్రను వారిఁ
జరిత్రించితి: గాని యాయన పొఱిపోయిన హృదయము,
అక్కటా! పోరు సహింప నశక్తమై, ఆనందము, శోకము
లను నీ రాగద్వంద్వముల యతిశయతచే, మందహాసము
తోఁ బిగిలిపోయె.

దుష్ట — ఈ వచనంబు నీయది కరఁగించె నా మనమును, మఱి యొకవేళ మేలే సేయఁ గాఁబోలు; కాని పైని చెప్పుము నీ చరిత్రము; ఇంకేదో చెప్పఁ దలఁచిన ట్లగుపడు చున్నాఁడవు.

ధవ. — ఇంకే మైన నెచ్చఁగ నుండిన, దీనికి దుఃఖకర మైనది, మనసుననే యుంచికొమ్ము, దీనిని వినఁగనే, నిలువంతయు నేఁ గరఁగు చునికి నున్నాఁడను

ప్రేమ. — ఇంత మాత్రమె చాలు నని తోఁచు దుఃఖము దిచ్చలేని వారికి, కాని మఱి యొకటి కలదు, దీనితోఁ గలుపవలసినది, అది యంతకంటె మహా సంతాపకరము, దానితో ముగించెద. అమ్మెయిం మా తండ్రిగారి మరణమునకు నే మొత్తల పెట్టె యార్చుచుండఁగ నచటికి నొక మానిసి యేతెంచెను. ఈయన నన్ను నా యతిహీన స్థితినిఁ గాంచి యున్నందున, నా యనన్యా సహావాసమునుఁ దొలఁగుచుండెఁ: కాని యపు డెఱింగికొని యెవరొకొ యీ కీలిని దుఃఖబాధఁ బైనవాఁ డని, తన బలిష్ఠ బాహువుల నా మెడపై గ్రుచ్చికొని, మింటినిం జీల్చి వేయునట్లు అంకెలు వెట్టి యేడ్చె, మా నాయనపైఁ బడె; ప్రళయాంతకులను తన్నుఁ గుఱించి ముం దప్పుడుఁ

జెవ్వులు వినియుండని కనికరమైన కథనుఁ జెప్పె; దానినిఁ జెప్పుచుఁ జెప్పుచు నాయన వ్యాకులము మట్టుమీఱి రేఁగగ, నాయన ప్రాణసూత్రములు పెరుగఁ దొడఁగె: అప్పుడు రెండు మాఱులు శృంగములు ఘోషింప నచ్చటనె యాయన మూర్ఛిల్లి యుండఁగ వదలి వచ్చితి.

భవ.—అయితె యెవ్వరీయన?

ప్రేమ.—హితకీర్తిగారు, బాబు, దేశభ్రష్ట హితకీర్తిగారు, పీరు స్వశత్రు లైన రాజుగారి వెంబడించుచు మాఱువేసముతో, బానిసీనికి నిష్వఁదగని యూడిగంబులఁ జేసె నాయనకు.

ప్రవేశము, ఒక సుజనుఁడు, నెత్తురు కత్తితో.

సుజ.—సాయము, సాయము, హా, సాయము!

ప్రేమ.—ఎటువంటి సాయము?

భవ.—పలుకవోయి, మానిసి.

ప్రేమ.—ఏమి భావ మా నెత్తురు కత్తికి?

సుజ.—వేఁడిఁగ నున్నది, పొగయు చున్నది; ఇది వచ్చెయాబిడ గుండెనుండి—అయ్యో, ఆమె, పిలువుమాతె!

భవ.—ఎవతె పిలువుమాతె? పలుకవోయి నీవు.

సుజ.—తమ సీమాటి, దేవర, తమ సీమాటియె: పై నామె చెల్లెలు నాపెచే గరళప్రయుక్త యాయెః ఆపెయె యన్ని వక్కాణల నప్పగించె.

దుష్ట.—నేను నా రిద్దఱికి నొప్పంద పడియుంటి. మూవురు నొక్క నిముసమున నే యిప్పుడుఁ బెం గ్లాడెదము.

శ్రీమ.—ఇదిగో వచ్చుచున్నారు హితకీర్తిగారు.

ధన.—వెల్వరించి యెదుట నుంపుఁడు వారి శరీరముల, బ్రదికియున్ననుఁ జచ్చియున్నను; ఈ దివౌకసుల దండన, మనల గడగడ వడఁకించునది, కనికరము మాత్రము పుట్టింపదు మా యుల్లంబునందు. (నిష్క్రమించు సుజనుఁడు.)

ప్రవేశము, హితకీర్తి.

ఓహో, ఇ య్యితఁడేనా? ఈ తరుణము ఆసందర్భము కేవల కులీ నాచారములె ప్రేరించు నుపచారములకు.

హిత.—మా రాజుగారికి మా యేలినవారికి నిరంతర సురాత్రము నుడువ వచ్చినాఁడను: లేరా వా రిక్కడ?

ధన.—ఎంతటి ప్రమాదము! ఏమి మఱపు? చెప్పవోయి, దుష్టబుద్ధి, ఎచ్చట రాజుగారు? అమృతహృదయ యెచ్చట? చూచుచున్నావా ఈ పదార్థము, హితకీర్తి?

(గరళవల్లి, రజనీచరుల కళేబరములు రంగములోఁ జేఁబడును.)

హాత.—అక్కటా, ఇ దేల నిట్లు?

దుష్ట.—ఎడపడక దుష్టబుద్ధి ప్రేమింపఁబడె నీ యిద్దఱి మిటారుల; అం దొకరితె నాకొఱకు మఱి యొకర్తు గరళంబు పాలు నీసి తన్నునుం జెకట్టిచ్చికొనియె.

భవ —అవియె సత్యము. మూయుఁడు వారి ముఖముల.

దుష్ట.—ఒగర్చుచున్నాఁడ చూపిరికొఱకు, కొంత మేలు నే సేయఁ దలపోసెద, నా స్వాంత నైజమునకు హూఱుపాటుగ, వేగిరఁ బంపుఁడు, అంతఃం దొందిటి పడుఁగు: కోటకు; ఏ లంటె నా యధికారపత్రము పోయున్నది, ప్రళయాంత కామృతహృదయల ప్రాణము హైన్యసికి, ఆలస్యము వలదు, సమయమునకుఁ బంపుఁడు

భవ —పరుగుము, పరుగుమొ, పరుగుము!

ప్రేమ.—ఎవరి కడకు, ప్రభువర? ఎవఁ డా కింకరుఁడు? విపదల యడియాలము పంపుఁడు.

దుష్ట.—తగిన యోచన; నా ఖడ్గంబుఁ గొంపొమ్ము: దాని నా జళవాయి కిమ్ము.

భవ.—త్వరితముఁ జేయుము, నీ ప్రాణము తీపి మైన.

(నిష్క్రమించు ప్రేమ)

దుష్ట.—ఆతని కనుజ్ఞ యీ౦బడినది, తను పత్నిచేతను నాచేతను, చెఱసాలలో నుఱితీయుట కమృతహృదయను, మఱి యీబిడ నిరాశనే వ్యాజముసేయ, దన్నుఁ దానె వధించికొనె నని.

ధన.—దేవతలు సంరక్షించుత నాబిడ్డ! వీని నొకింత గొనిపొం డవలికి. (దుష్ట. తొలఁగిపంబడు.)

పునఃప్రవేశము ప్రళయాంతకుఁడు, అమృతహృదయ శవమును సందిట మోయుచు. ప్రేమసింహుఁడు, దళవాయి, నితరులు న్వెంబడింతురు.

ప్రళ.—కూయుఁడు, కూయుఁడు, వాపోవుఁడు, మొఱపెట్టుఁడు! అయ్యో మీరలు ఱాతి మనుష్యులు: మీ నాలుకలుం గన్నులు నా కుండెనా, వాని నొక్కుమ్మడి జాడింతును నభోమండలంబు చీలి పోవు నట్లు. అది పోయినది శాశ్వత పదవికి! నే నెఱుంగుదు నొక్కరు చచ్చియుంటయు నొక్కరు బ్రతికియుంటయు; ఇది చచ్చిన మట్టివంటి దాయె. అద్ద మొకటి యొసంగిండు: నీయూపిరి యా శిలను మంచుఁ గప్పినా మాఱుకి చేసినా, మఱేమి, బ్రతికినదేను.

హిత.—ఇదియె నా ప్రళయాంతము?

ప్రేమ.—లేక, యా ఘోరతా ప్రతిబింబమా?

భవ.—పడుత యనంతము, నశించుత ప్రపంచము!

ప్రళ.—ఈ యింక కదలుచున్నది; నా బిడ్డ బ్రతికి యున్నది! అట్లైన, నిదియు నొక యదృష్టము, నే బడిసిన విపత్తు లన్నింటిని మఱవఁ గొట్టునది

హిత.—(మోఁకరించుచు.) అహో నా సత్ప్రిభో!

ప్రళ.—దయఁ జూపుము, అవ్వలికి.

ప్రేమ.—ఘనులు, హితకీర్తులు, దేవరవారి మిత్రములో.

ప్రళ.—మహామారి వారుకొని పోను మిమ్ము లందఱిని, ఘాతకులార, ద్రోహులార! దీనిని నే సంరక్షించియుందు; ఇప్పుడు వెళ్లిపోయినది ఇంక నెన్నటికిఁ దిరిగి రాదు! అమృతహృదయా! అమృతహృదయా! తడయుము ఇంచుక తడవు. హా! ఏమి సెప్పుచున్నావు? దాని కంఠ మెప్పుడును మృదువైనది, శాంతమైనది, అణఁకువైనది, ఉత్తమలక్షణము ఆఁడపుట్టువకు. నిన్ను ప్రేలాడించుచున్న యీ చండాలుని చంపివేసితి.

దళ.—సత్యము, ప్రభువులార, అట్లనే చేసిరి.

ప్రళ.—చేయలే దఁటరా, ఓ రోయి ? ఒక కాలములో నా సొగసు వాఁడి వాయిదారతో వారలం గంతులు వేయ నిచ్చియుందు ; ఇప్పుడు ముసలి నైతిని, పైని ఈ యద్ద కష్టలు నన్నుఁ జెఱపివేయుచున్నవి. నీవెవ్వఁడవు ? నా నేత్రము లుత్తమ స్థితిని లేవు : చెప్పెద నంయము తిన్నఁగ.

హిత.—భాగ్యము తనుఁ గొనియాడి కొన్న, నిద్దఱిఁబట్టి, యొకరు ప్రేమాస్పదులు, ఒండొకరు ద్వేషాస్పదులు తన కని, అం దొకరి నిడిగో ప్రత్యక్షముఁ గఁ జూచుచున్నా రము.

ప్రళ.—ఇయ్యది మందదృష్టి. నీవు హితకీర్తివి కావు ?

హిత.—అ య్యతఁడె, తమ భృత్యుఁడ, హితకీర్తిని.

ఎచటఁ దమ భృత్యుఁడు కేయూరుఁడు ?

ప్రళ.—వాఁ డొక మంచి పిల్లఁడు, నే నది చెప్పఁగల నీకు ; వాఁడు మంచి యేటుకాఁడు, అదియు వేవేగముఁగ ; వాఁడు చచ్చి యవిసి పోయె.

హిత — ఆ సేన, తమ స్థితిభేదమును పుత్రినాశమును మొదలు పెట్టి నప్పటనుండి, తమ క్లిష్టపదముల వెంబడించినాఁడ,—

ప్రశ.—స్వాగతము నీ కిచటికి.

హిత.—మఱి యెవరు రాలేదు అంతయు నిరానందమునుఁగ, నంధంతమసమునుఁగ, భీకరమునుఁగనున్నది. తమ జ్యేష్ఠపుత్రికలు తమ క్షేమములఁ దామె చెఱిచికొని, భగ్నాశలై, మరణముఁ గాంచినారలు.

ప్రశ —ఔనౌ, నాకు నట్లనె కాన్పించెడి

భవ.—చిత్తవశము లేక వారు నుడువుచున్నారు: వృథాయాసము, ఆయన మనలఁ బోల్పఁ గోరుట.

క్షేమ.—బోత్తిగ వ్యర్థము.

ప్రవేశ మొక పడవాలు.

పడ —దుష్టబుద్ధులు నష్టాసువు లైనారు, దేవర.

భవ —ఆ సంగ తిక్కడ గడ్డిప్రాంత. ప్రభువులార, మిత్రాగ్రగణ్యులార, తెలిసికొండు మా యభిప్రాయము ఈ మహాసంక్షోభమున కేమేమి పరిహారములు వలయునో యవన్నియు ననుసంధింపఁ బడియెడి: ఇక మా విషయ మెన్న, ఈ వృద్ధ రాజగంభీరులవారి యాయుష్యములో

మే మధికారసన్యస్తుల మయ్యెదము; వారినే నిరంకుశాధికారులం గాంతము. (హిత. ప్రేమ. లకు.) మీ రిద్దఱు మీ మీ యధికార స్వాతంత్ర్యములకు, అంతియ కాదు, హెచ్చు స్వాతంత్ర్యములు కూడ, మఱియు మీ యోగ్యతల కనుగుణ్యా రీతిని సన్మాన బహుమానములుం గూర్పంబడు. అఖిల మిత్రమాణ్యును వారి సాత్త్వికధర్మపు మధుర ఫలముల నాస్వాదింతురు; నిఖిల శత్రువులును వారి యధర్మపు చెయువులకుం దగినయట్లుగనే దారగింతురు కటుఫలు పెల్లగిల్లు. కిట్టూ, చూడుండీ, చూడుండీ!

ప్రళ.—మఱి నా నిఱుబీద ముద్దరాలు లుఱినిం బడినది! లేమ, లేమ, లేనే లేమ ప్రాణము! ఒక కుక్క, ఒక గుఱ్ఱము, ఒక యెలుక బ్రతుకనేల. నీకు మాత్రము పో నేలని రెల్ల? నీ విఁకను రావుగదా యెప్పటికిని. రా వెప్పటికిని, రావు, రావు, రానే రావుగదా యెప్పటికిని! ఎవరోయి, యీ గుండిని సడలింపుము: మేలుం జేసితి వోయి. చూచెదవా దీనిని? చూడుము దానిని, చూడుము, దాని పెదవులు, చూడవో యచట, చూడవోయి! నా ప్రాణము!

అ—మ్మ—త—హృ—ద—య! (మరణము.)

ప్రేమ.—మూర్ఛిల్లు చున్నారు! మహాప్రభూ, మహాప్రభూ!

హిత.—పగులుము, హృదయమా ; పుణ్య మయ్యెను, పగ లుమే !

క్షేమ.—పైని చూడుఁడు, మహాప్రభో

హిత.—బాధ పెట్టకుడు వారి యాత్మను: ఓ, కడవ నిష్ట్మా యనఁ! వారి పగతులే యగుదురు, ఈకఠిన సంసార చక్ర మున నింకను వారిఁ గట్టి కొట్టి త్రిప్పఁ గడఁగువారలు.

క్షేమ.—గళించినవారె, దృఢముఁగ.

హిత.—అద్భుత మే మన్న, ఇంత కాలము వారు భరిం చుటే: అధి కాయుష్యముం దురాక్రమించుకొనిరి.

ధవ.—భరించుక వెళ్లుఁడు వారి నిచ్చటనుండి, మన ప్రస్తుత కార్యము, సార్వత్రిక చిత్తసంకటము. (క్షేమ. హిర. లక్ష.) నా యంతరాత్మ మిత్రములార, మీర లిద్దఱు నేలుఁడీ రాజ్యమునందు; రక్షింపుఁడు, పరిపాలింపుఁడీ వ్రణయిత మును విదారితము నగు రాష్ట్రమును.

హిత.—నా కొక యాత్ర సమీపించు చున్నది, దేవర, అవి లంబితముఁగ నే వెళ్లవలెను: నా నాథుఁడు ననుఁ బిలచు చున్నాఁడు, కాదు కూడ దనఁ గూడదు నేను.

ధవ.—ఈ విపత్కాల భారమును వహింపక తీరదు; మన మనోరాగ భావములఁ బ్రకటింపవలయుఁ గాని, యిదమిత్థ మ్మని యుక్తాయుక్తముల విచారించి యాచరింప లేము. అందఱిలో నత్యంత వృద్ధులకే యత్యంత దుర్భర భారం భరణ మాయె; యువానులు మేము అంతటి భారము జూడను లేము, మోయను లేము, అంతకాలము బ్రతుకను లేము.    (నిష్క్రమింతురు, మరణభేరి మ్రోఁత)

సంపూర్ణము.



THE S. I. V. L. PRESS, PURASAWAKKAM, MADRAS.

అభినవ ఆర్షమత యుద్దేశములకు ప్రకటన
సాఫల్యసాధనంబగు,

# దక్షిణహిందుస్వదేశభాషా
# గ్రంథ ముద్రాక్షరశాల

**(SOUTH INDIAN VERNACULAR LITERATURE PRESS,)**

యందిప్పుడు ఆంధ్రాంగమును దేవనాగరి యంగమును కార్యంకరములై యున్నవి. ఇంక రెండు మాసములలో ద్రావిడాంగమును ఆఱుమాసములలో కర్ణాటకాంగమును ఏఁడాదిలో కేరళాంగమును చేర్పఁబడును. దేశాభివృద్ధికి తీవ్ర సాధనంబులగు విషయములపై గ్రంథముల వ్రాసి ముద్రింపఁ గోరువారు ఇచ్చట మిగులను సదుపాయములం బడయఁ బోదురు. వలయువారలు మాకు వ్రాసిన, విశేషాంశములఁ దెలిసికొనవచ్చును.

☞ ప్రత్యుత్తరంబు కోరువారు టపాల ఖర్చు అప్పు కొనవలయు.

పరమహంస విద్యానందస్వాములు,
దక్షిణ హిందూ స్వదేశ భాషా గ్రంథ
ముద్రాక్షరశాలాధ్యక్షులు.